## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071369

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కావ్య నిదానము

"FOR FAVOUR OF REVIEW—
REVIEWED ISSUE SOLICITED."
PUBLISHERS

గ్రంథకర్త:
**శ్రీ రూపనగుడి నారాయణరావు**

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారి ఆర్థిక సహాయమున

మహానంది పబ్లికేషన్సు
బ్లాక్ నంబరు 622/A, శాంతినగర్,
**గుంతకల్లు**

[ప్రథమ ముద్రణము] [ప్రతి వెల రూ. 6-00

# విషయ సూచిక

# మున్నుడి

విద్యార్థి దశనుండియు నాకుఁ గావ్యమన్నను, కావ్య విమర్శనమన్నను నాదృతి యెక్కువ. కావున, నే నవే కాంధ్ర గ్రంథములనే కాక, కళాశాలలందుఁ బాఠ్య గ్రంథములుగా నుంచఁబడు నాంగ్ల కావ్యభాగములను, దృశ్య, శ్రవ్య కావ్యములను, బహుశ్రద్ధతోఁ జదువుచుంటిని. ఉపాధ్యాయవృత్తియందు వేఁజేరిన తరువాత నాకుఁ గావ్యపఠనోత్సాహ మతిశయింపఁగా, ఆంగ్ల మందలి ప్రసిద్ధ కావ్యకములను సవ్యాఖ్యానముగాఁ బఠించితిని. చదివిన విషయములలో నా కభిరుచి జనకములైన వానిని గుర్తించి, మననముచేసి, లక్ష్యములుగా నెత్తి వ్రాసికొంటిని.

సాహిత్యోపాసకుఁడనగుటచే, సాహిత్య విమర్శనమన్నను, నాకభిరతి యధికము. ఆంగ్ల విఖ్యాత కవుల గుఱించినే విమర్శన గ్రంథములఁ (Men of Letters — Series) గొన్ని పఠించితిని. హడ్సన్ ప్రాజ్ఞుఁడు వ్రాసిన ('Introduction to English Literature') అను గ్రంథమును జదివితిని; మాత్యూ ఆర్నాల్డ్ రచించిన సాహిత్య విషయక వ్యాసములను, వ్యాసంగము చేసితిని. అప్పుడప్పుడే ప్రచురింపఁబడిన 'కవిత్వ తత్త్వవిచారము' నాకంటఁబడ, దాని నాకళించితిని. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి 'ఆంధ్ర వాఙ్మయ సూచిక' యొక్క పీఠికకు నధిగమించితిని. ఇంతే కాక యాంధ్రాంగ్లేయ విమర్శన గ్రంథములలో శిఖరప్రాయ మనదగు శ్రీ అరవిందుల 'Future Poetry' యొక్క వ్రాఁతప్రతిని నెంతో కష్టమున సంపాదించి యధికాసక్తితోఁ బఠించితిని. దీనిని బఠించుచో నాకుఁ గలిన-

కర్నూలుజిల్లా పత్తికొండనుండి శ్రీ వనం శంకరశర్మగారి సంపాదకత్వమున వెలువడు 'హితవాది' యను వార పత్రిక యందును ప్రచురించి పాఠకలోకమునకు పరిచయము చేసిరి.

ఈ గ్రంథ ముద్రణకై ఆర్థిక సహాయము నభ్యర్థించుచూ, పరిశీలనార్థము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ హైదరాబాద్ వారికి వ్రాతప్రతి పంపబడెను. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు ఈ వ్రాతప్రతిని పరిశీలించి, ముద్రణార్థము దయతో రెండువేల రూప్యము లొసంగి, ప్రోత్సహించినందులకు వారికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయమని వేడినంతనే వ్రాసి పంపిన సర్వశ్రీ దివాకర్ల వేంకటావధానిగారికి మా అభినందనములు.

గ్రంథకర్తను గూర్చి 'కవి పరిచయము'ను వ్రాసి పంపిన కడపజిల్లా రచయితలసంఘ కార్యదర్శి శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణకు సలహాలొసంగి ప్రోత్సహించిన సహృదయులైన శ్రీ ఎ. గోపీనాథ్‌గారికి మా ధన్యవాదములు.

మేము కోరినంతనే ప్రీతితో ఈ గ్రంథమును పరిశీలించి తమ అమూల్య అభిప్రాయముల నందజేసిన కవి పండితులకు మా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథకర్తపైగల భక్తిగౌరవములను పురస్కరించుకొని రూ. 116/- విరాళముగా యొసంగిన సాహిత్య పోషకులు శ్రీ అవ్వారి నారాయణగారికి మా అభివందనములు.

పూ౯ఫులు దిద్దుటలో సహకరించిన పండితవర్యులు శ్రీ బి. భీమరావుగారికి, శ్రీ వి. మురళిగారికి మా అభినందనలు.

'కావ్యనిదానము' అను గ్రంథమును ముద్రణ గావించి ఇచ్చిన విశ్వనాథ్ ప్రింటింగ్ ప్రెస్ యజమానులు రామిరెడ్డి గారికి, వారి పనివారలకు మా అభినందనలు.

శ్రీ రూపనగుడి కృష్ణమూర్తి రావుగారు గ్రంథకర్త గారి పెద్దకుమారులు, వీరు కూడ 'కావ్యనిదానము' అను గ్రంథమును ప్రచురించుటకు సాయశక్తుల కృషి చేసినారు.

మేము ప్రచురించిన గ్రంథముల నన్నిటిని అనంత పురము జిల్లా గ్రంథాలయ సంస్థతోపాటు ఇతర జిల్లా గ్రంథాలయ సంస్థలుకూడా కొని, ప్రోత్సహించినందులకు వాటి పాలకవర్గమునకు మా గౌరవాభి వందనములు. మున్ముందు మా ప్రచురణలను కొని, పోత్సహించి, గ్రంథ కర్తయొక్క ఇతర అముద్రిత రచనలు వెలుగు చూచుటకు ప్రోత్సహించవలయునని విజ్ఞప్తి చేయుచున్నాము.

కవిగారి అముద్రిత రచనలు యింకను పెక్కులుకలవు. వానిని సాహిత్య పోషకులు, సాహిత్య సంస్థలు వెలుగు లోనికి తీసుకొని వచ్చినచో సాహిత్య రంగమునకు మిగుల నుపకారముగా నుండును.

అచ్చుతప్పులను ముఖ్యమైనవాటిని పట్టికలో కను పఱచినాము. చదువరు లీ తప్పులను సవరించుకొందురని తలచుచున్నాము.

ప్రకాశకులు,
మహానంది పబ్లికేషన్స్, గుంతకల్లు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 6 | సంచలమే | సంచలనమే |
| 34 | 13 | ఇట్లు లార్య | ఇట్టు లార్య |
| 51 | 8 | వ్యంగార్థము | వ్యంగ్యార్థము |
| 51 | 15 | పసువుల | వస్తువుల |
| 72 | 3 | జీవికము | జీవితము |
| 74 | 6 | తప్పఁదలఁచిన | తప్పుదలఁచిన |
| 74 | 24 | కావ్యమె | కావ్యమై |
| 75 | 9 | మానస | మానవ |
| 79 | 7 | వర్జుప్వవర్తు | వర్దుస్వవర్తు |
| 92 | 23 | యెంతొడలు | యెం తడలు |
| 96 | 15 | ఒద్యుమ్నుఁడు | బ్రిద్యుమ్నుఁడు |
| 98 | 11 | కిట్లి | కిట్లు |
| 106 | 19 | దేనెలు గులిడి | దేనెలఁగ్గు లిడి |
| 109 | 22 | యీా స్వమం | యీా శ్యమం |
| 124 | 21 | కుత్సి హృదయ | కుత్సిత హృదయ |
| 125 | 22 | వల్ల ఘుండనగా | వల్ల ఘుఁడనగా |
| 129 | 18 | తథ్య బెమ్మోయిం | తథ్యం బెమ్మోయిం |
| 132 | 1 | నా పదతి | నాసుదతిం |
| 132 | 5 | యని | నేమో యని |
| 133 | 15 | మెత్తఁజడినట్లు | మెత్తఁబడినట్లు |
| 134 | 6 | దడసైన | దడవైన |
| 135 | 2 | [illegible] | వెఱ్ఱిబలము |

# పీఠిక

సాహితీశిల్పి కీ॥ శే॥ శ్రీ రూపనగుడి నారాయణరావు గారు రచించిన "కావ్యనిదానము" అను విమర్శ వ్యాసము లతోఁ గూడిన గ్రంథమును జదివి యమందమైన యానంద మొందితిని. కీ॥ శే॥ శ్రీ నారాయణరావుగారితో నాకు ప్రత్యక్ష పరిచయము లేదు. కాని వారి గ్రంథములు కొన్ని చదువుటయు, మిత్రులు శ్రీ కైప నాగరాజ ద్వారా వారి పాండితీ ప్రతిభలు వినుటయు మాత్రము సంభవించెను. శ్రీ నారాయణరావుగారు బహుముఖ ప్రజ్ఞాదురంధురులు. మహా పండితులగుటయే కాక యోగిపుంగవులైన శ్రీ యరవిందుల భక్తులు. వారు రచించిన కొన్నిది గ్రంథములను శ్రీ నారా యణరావుగారు తెనుఁగులోని కనువదించుటయే కాకుండ వారి జీవిత చరిత్రమును గూడ వ్రాసి, ప్రచురించిరి. ఇవి కాక వారు రచించిన గ్రంథము లింకను పెక్కులు కలవు. అందు మాతృభాషాబోధిని, మనస్తత్వ శాస్త్రము కొన్ని నాటకములు, కొన్ని వాచకములు, కొన్ని ఖండ కావ్య ములు, కొన్ని వ్యాకరణ గ్రంథములు, కొన్ని కథాగుచ్ఛ ములు. ఇన్ని గ్రంథములు రచించిన వారి యీ రచనను గూర్చి యెవ్వరుగాని యుపోద్ఘాతము వ్రాయవలసిన యవ సరము లేదు. ఐనను మిత్రులు, వారి మనుమలునైన శ్రీ కైప నాగరాజగారి యానతి మీఱలేక యీ నాలుగు వాక్య ములు వ్రాసితిని.

శ్రీ నాగరాజగారు గుంతకల్లు రైల్వేశాఖలోఁ బని చేయుచున్నారు. వారికి కవిపండితులన్నను. సాహిత్యమన్నను

అపారమైన యభిమానము. వారు పలువురు కవులను, పండి
తులను గుంతకల్లు పట్టణమున కాహ్వానించి, వారిచే నుప
న్యాసములు కావ్యపఠనములు చేయించి, యథోచితముగా
వారిని సత్కరించి పంపుచుందురు. రైల్వే సంబంధముగా
ప్రఖ్యాతి గాంచిన యా పట్టణమున సాహిత్య సౌరభమును
గూడ ప్రసరింపఁ జేయుటకు నిరంతర కృషిచేయు సహృ
దయశేఖరులలో వారొకరు. నేను గూడ వారి యాహ్వా
నముపై గుంతకల్లున కరిగి యుపన్యాసము గావించి, వారి
యాదరమును జూఱఁగొన్నవాఁడనే. వారే కాదు; వారి
బంధువులలోఁ బలువురు మంచి సాహిత్యాభిమానులు, కవి
పండితులు ఉన్నారు.

"కావ్యనిదాన" మను నీ గ్రంథమున పదుమూఁడు
వ్యాసములున్నవి. ఈ వ్యాసములన్నియు కావ్య కళాస్వరూప
స్వభావములను నిర్ణయించునట్టివే. 'నిదాన' మనఁగా 'నాది
కారణము' వైద్యవిషయమున రోగనిర్ణయమను నర్థము
గూడ దానికున్నది. ఏ కావ్యమునకైన కావ్యత్వము నొసంగు
నాది కారణములును, కావ్యముల కుండవలసిన లక్షణము
లును నిందు చర్చింపఁబడుటచే దీని కీనామ మొసంగఁబడినది.
దీని నొక విధముగా సారస్వత విమర్శ సూత్రవివరణ గ్రంథ
మని చెప్పవచ్చును. ఇందు కళలకు, కావ్యలక్షణములకు,
కవిత్వమునకు సంబంధించిన పెక్కు విషయములు విశదీకరింపఁ
బడినవి. ఇందలి మొదటి మూఁడు వ్యాసములును కళలకు
సంబంధించినవి. మన పూర్వులు కళల నఱువది నాలుగు
తెఱఁగులుగా విభజించిరి. ఇవియే చతుష్షష్టి కళలు. వీనిలో

కొన్ని యానంద ప్రదాన దక్షములైనవి. కొన్ని జీవితోప యోగకరములైనట్టివి. మొదటి వానిని లలిత కళలనియు, రెండవ వానిని నుపయోగ కళలనియు చెప్పవచ్చును. ఉప యోగకళలనే (శ్రీ) నారాయణరావుగారు 'ఫలితకళ' లని పేర్కొనిరి. వస్తువిషయములందు నియమబద్ధముగా నుత్పన్న మైన సామరస్యసంచలనమే లయ యనియు, నదియే శిల్పుల చేతియందుఁ గల సృజన శక్తియనియు, రవీంద్రుఁడిచ్చిన నిర్వచనము ననుసరించి "సంపూర్ణమైన లయ సామంజస్యము కలిగియుండునదే కళ" యని (శ్రీ) నారాయణరావుగారు నిర్ణయించియుండిరి. ఈ లయ సామంజస్యము పరుసవేది వంటిది. అది తాను స్పృశించు ప్రతి వస్తువునకు నొక విధ మైన విశిష్టత్వము నొసంగి దానిని తేజోవంత మొనరించి యా వస్తువునకును, సహృదయుల యాత్మలకును ననుసం ధాన మొనగూర్చును. దాని వలన సహృదయు లానందము ననుభవింతురు. ఈ విధముగా (శ్రీ) నారాయణరావుగారు కళ కిచ్చిన నిర్వచనము మిక్కిలి సమంజసమును, హేతువాద పూర్వకమునై యున్నది. రెండవ వ్యాసమున కళోత్పత్తి యెట్టి సందర్భములలో జరుగునో, యందుకు కారణము లేమో, వారు చక్కగా వివరించియున్నారు. ఏ దేశము నందైన శాంతి విశ్రాంతులు పుష్కలముగా నున్నప్పుడే యందలి మానవుల శక్తి సామర్థ్యములు కళారూపమున పరిణమించుట కవకాశముండునని వారి యభిప్రాయము. "కళాభ్యుదయము — పరిణామములు" అను మూఁడవ

వ్యాసమున వారు గానాభినయ నాట్య నాటకములెట్లుత్పన్న ములై పరిణామము పొందినవో శాస్త్రీయముగా నిరూపించి యున్నారు.

అవస్థానుకరణమున కభినయమని పేరు. ఇది యాహా ర్యము, వాచికము, ఆంగికము సాత్త్వికము అని నాలుగు విధములు. భారతదేశమున పూర్వకాలము నుండియు నాట్య కళకు ప్రోత్సాహ మబ్బుచుండినట్లు తెలియుచున్నది. అది యొక్కొక్క ప్రాంతమున నొక్కొక్క పేరుతో ప్రఖ్యాతి నొందియున్నది. భరత నాట్యము, కథాకాళి, మణిపురీ నృత్యము, గార్భానాట్యము, రాసక్రీడ మున్నగునవి యట్టి వానిలోఁ గొన్ని వంగ మహారాష్ట్ర ప్రాంతములందలి కొం దఱు భరతనాట్య శాస్త్రమును పఠించుటచేఁగాక, యజంతా చిత్రములను, లోకమును గమనించి తమ నాట్యకళ నభి వృద్ధి చేసికొని యున్నారు. గానము, సంవాదము, అభి నయము, అనుకృతి యనువాని సమాహారమే నాటకమైనది సంస్కృత నాటకములు గ్రీకునాటక సంపర్కములచేఁగాక స్వతంత్రముగనే యుద్భవించినవని, శ్రీ నారాయణరావు గారు భావించి కొన్ని యుదాహరణముల నొసగియున్నారు. నాటకరంగము యొక్క పతనోత్పతనములకు కారణములను గూడ వారు పరిశీలించియున్నారు. తరువాత వా రాంధ్ర నాటకరంగ వికాసమును గూడ పరిశీలించి చలన చిత్రముల మూలమున నాటక రచనా ప్రదర్శనములకు ప్రతిబంధ మేర్పడినదని యభిప్రాయపడినారు.

నాల్గవ వ్యాసమున వారు చిత్రకళ, స్థాపత్యము, కావ్యము అనువానిని గూర్చి పరిశీలించియున్నారు. చిత్రకళ యనఁగా చిత్రలేఖనము, స్థాపత్యమనగా ప్రతిమారచనము. ఈ రెండు కళలును మనదేశమున పూర్వకాలముననే యభి వృద్ధి చెందియుండినట్లు, ప్రతిమా నాటకము, ఉత్తర రామ చరితము, అగస్త్య రచితమైన సకలాధికారమను వాస్తుశిల్ప విషయ గ్రంథము మున్నగువాని యుదాహరణములనుబట్టి నిరూపించియున్నారు. చారిత్రకముగా నా రెండు కళల యభివృద్ధిని గూర్చి వారు కావించిన పరిశీలనము మిక్కలి ప్రశంసాపాత్రముగా నున్నది. రామాయణ భారతముల కాలమునుండియు భారతదేశమున కావ్యసరవంతి పద్య గద్య చంపూ స్తోత్రాది రూపమున నెట్లు ప్రసరించియున్నదో వారు వివరించియున్నారు.

ఐదవ వ్యాసమున కళా ప్రయోజనము విశదీకరింపఁ బడినది. అది సౌందర్యమునకును, విద్యాబుద్ధులకును, తత్త్వ మునకును సంబంధించియుండునని యరవిందులు చెప్పిన విషయమును వారు చక్కగా విపులీకరించియున్నారు. ఈ సందర్భమున వారు ప్రాచ్య పాశ్చాత్య విమర్శకుల యభి ప్రాయములను గూడ పరిశీలించియున్నారు. లలిత కళలు — వాని ప్రయోజనమను వ్యాసమున వారు వెలువరించిన భావములు, వారి విమర్శన పాటవమును, బహుగ్రంథ పరి శీలనమును వ్యక్తము చేయుచున్నవి. లలిత కళలు స్వచ్ఛంద

వాతావరణమున వృద్ధిహొందునుగాని, నిర్బంధమున వృద్ధి పొందదని వారు వెల్లడించిన యభిప్రాయము సత్య సముపేతము.

లోకమున సారస్వతము, వాఙ్మయము, సాహిత్యము అను పదములు మూడును స్థూలముగా నొకే యర్థమున వాడఁబడుచున్నవి. కాని వ్యుత్పత్తులనుబట్టి పరిశీలించినచో వానియందు భేదమున్నది. రససహితమైనదే సాహిత్యము. వాక్యములతోఁ గూడినది వాఙ్మయము. సరస్వతికి సంబంధించినది సారస్వతము. దీనినిబట్టిచూడ స్వరూపమున నీ మూఁడును నుత్తరోత్తర విస్తృతములని తెలియవచ్చును. కవికి ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము అను మూఁడు లక్షణములుండవలెనని సంస్కృత లాక్షణికులు చెప్పియుండిరి. వీరికే కావ్య హేతువులని పేరు. శ్రీ నారాయణరావుగారు కవికి భావన, రసజ్ఞత,, ఉపజ్ఞ, ప్రతిభ యను నాలుగు లక్షణములుండవలెనని తెలిపి వాని స్వరూపములను వివరించి యున్నారు. తరువాత జీవితమునకును, కళకును గల సంబంధమును తెల్పి వారు — కళ పురుషార్థ సంపాదనమునకు తోడ్పడునని విశదీకరించియున్నారు. కవిత్వమును పలువురు ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులు పలువిధముల నిర్వచించి యున్నారు. అవి యన్నియు సత్యములే కాని యందే యొక్కటియు కవిత్వము యొక్క సమగ్ర స్వరూపమును వెల్లడింపఁజాలదు. శ్రీ నారాయణరావుగారు పలువురు ప్రాచ్య పాశ్చాత్య కవి లాక్షణికుల నిర్వచనములను బ్రిద

ర్శించి యవి యతివ్యాప్తి దోషమునకో, యవ్యాప్తి దోష మునకో గుఱియై యున్నవని నిరూపించియున్నారు.

పదునొకండు, పండ్రెండు వ్యాసములు శ్రీ నారాయణరావుగారి సర్వకావ్య పరిశీలనమునకు నికషోపలములని చెప్పఁదగినవి. వారు సంస్కృతాంధ్ర కవుల కావ్యముల నుండి పెక్కుదాహరణముల నొసంగి యే కవిశైలి యెట్టిదో యెవరి భావము లెట్టివో తెలిపి కవిత్వ లక్షణములను సోదాహరణముగా నిరూపింప యత్నించి యున్నారు. పెక్కు లక్షణముల కలయిక కలిగినప్పుడుగాని యుత్తమ కవిత్వ స్వరూపము సాక్షాత్కరింపదని వారి యభిప్రాయము. తిక్కనార్యుని కవిత్వమను వ్యాసమున వారు కీచకుఁడు, ద్రౌపది, సుదేష్ణ యను వారి శీలములను చక్కగా పరిశీలించి, తిక్కన, కాళిదాసు, షేక్స్పియర్, డాంటే మున్నగువారి కోవకు చెందిన వాఁడనియు; భావప్రదర్శనమునందును, రసనిర్వహణమునందును, ఔచిత్య పరిపోషణమునందును, యథార్థ రూపకల్పనమునందును, సమయోచిత శబ్దప్రయోగము నందును, కృతహస్తుఁడనియు, శ్రీనాథాదులవలె వాచ్యకవి గాక భావకవియై భాసిల్లు చుండుననియు నిరూపించి యున్నారు. తుది వ్యాసమున వారుత్తమ కవిత్వ లక్షణములు దెల్పి కవిత్వమందలి వస్తువు, శైలి మున్నగువాని స్వరూప స్వభావములను వ్యక్తము చేసియున్నారు.

శ్రీ నారాయణరావుగారి వ్యాసములను బఠింపఁగా వారికి కళలయందును, కవిత్వమునందును, శిల్పము నందును, కాళిదాసు, తిక్కనాది మహాకవుల రచనలయం

డును గల యభిప్రాయములు తేటతెల్లములగుచున్నవి. వారు తమ యభిప్రాయముల కన్నింటికిని ప్రాచ్య, పాశ్చాత్య లాక్షణికులనేకాక యరవిందులను, టాగూరును గూడా సాధారముగా గ్రహించియున్నారు. వారెడనెడ సంస్కృతాంధ్రాంగ్ల కవుల గ్రంథముల నుండియును, వేదోపనిషదాదులనుండియు నొసంగిన యుదాహరణములనుబట్టి వారి విజ్ఞాన మెంత విస్తృతమో తెలియవచ్చును. వారి యభిప్రాయము లన్నియు యుక్తియుక్తములును, సర్వజన శిరోధార్యములునై యున్నవి. వారి భాష సరళమై, ధారాళమై, భావవ్యంజకమై, నిర్దుష్టమై యలరారుచున్నది.

ఈ గ్రంథము విశ్వవిద్యాలయములందలి కళార్థులందఱికిని సాహిత్య విమర్శన సూత్రముల నెఱుఁగుటకును, లక్ష్యలక్షణ సమన్వయ విధానము నభ్యసించుటకును అవశ్య పఠనీయ గ్రంథరాజమై యున్నది

శ్రీ శైవ నాగరాజుగారు వారి తాతగారు రచించిన అమూల్యములైన యితర గ్రంథములను సాహిత్య వ్యాసములను కూడ త్వరలో ప్రచురించి, ఆంధ్రభాషకును, సాహిత్యాభిమానులకును, అభ్యుదయానందములు చేకూర్తురుగాక యని విశ్వసించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని,
పూర్వాంధ్ర శాఖాధ్యక్షుఁడు
ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు,
7-8-1977.

# అభిప్రాయములు

**K.** Venkatesa Acharya,
Head of the Dept. of Telugu,
Govt. College, Guntakal.

రావలసినంత ప్రచార ప్రతిష్ఠలు రాని రచయితలు రాయలసీమలో చాలమంది ఉన్నారు. అట్టివారిలో శ్రీ రూపనగుడి నారాయణరావుగారొకరు. ఆంధ్రదేశంలో ఏనకేన ప్రకారేణ ప్రచార ప్రాపకాలు తెచ్చుకొన్న అదృష్టవంతులు చాలమంది; వారి అదృష్టం కంటే ఈ 'సాహితీశిల్పి' సామర్థ్యం చాల గొప్పది.

రావుగారి దర్శనం చాల విశాలమయింది. ప్రాక్పశ్చిమ దిగంత సంచారి అయిన దర్శనంతో కళాతత్త్వ సమీక్షచేస్తూ ఉన్నప్పుడూ, దివ్యమానవ లోకాల రేఖలను చెరిపివేస్తూ సమన్వయాన్ని చూసేటప్పుడు, కళలలోని చలనానికీ సహృదయునిలోని సంవేదనకూ ఒక లయను వెదికేటప్పుడు, రచయితగా, "కావ్యనిదానం" లో, రావుగారెంత కృతార్థు లయినది తెలుస్తుంది.

అరవింద రవీంద్రుల వచనలలోని భావసౌకుమార్యము, తాత్త్విక చింతనా రచయితలో బాగా కనిపిస్తాయి. "గౌతమబుద్ధ" "ఉన్మత్తరాఘవము" "సౌందరనందము" "విప్రనారాయణ" - ఇవి వేరువేరు వస్తువులను తీసికొని చేసిన రచనలయినా, ఈ అన్నింటిలోను ఒక సామాన్య సంవేదన ఉంది; భావ సంబంధి అయిన ఒక మాధుర్యం వుంది;

తాత్త్విక ప్రపంచానికి వేసిన ఒక పూలబాటవుంది - ఈ అన్నింటినీ తనవే తనవిగా చేసికొన్న "సాహితీ శిల్పి" కళలను గూర్చి సమీక్షించుటలోనూ ఒక అందాన్ని చూపించారు.

లలిత కళలనుగూర్చి ఒక కళాకారుడెంత సానుభూతితో చెప్పవచ్చునో అంతగానూ చెప్పటం జరిగింది ఈ గ్రంథంలో.

"కామక్రోధాది రాహిత్యమే శాంతి. నిత్యనైమిత్తిక, లౌకిక, వ్యవహార నిర్వహణమునకై యవశ్యము కావలసిన దేహామయ, ప్రాణమయ, మనోమయ శక్తులు వ్యయమై పోఁగా వాని పునస్సంపాదనకై పనిమాని యుండుటయో, యిష్టమయిన వేఱుపనినిఁ జేయుచుండుటయో విశ్రాంతి" మొదలయిన నిర్వచనములు.

ఔపనిషదమయిన దైహిక, తాత్త్విక భావచ్ఛాయలతో ఆలోచనను రేకెత్తించేవి అనేకాలున్నవి.

కవిత్వ నిరూపణమనే శీర్షిక క్రింద ఆంధ్రసాహిత్యములోని ప్రసిద్ధ రసవద్ఘట్టాల ప్రస్తావన విస్తారంగా జరిగింది.

సాహిత్య విద్యార్థులు కానివారికి అభినివేశాన్నీ, సాహిత్య విద్యార్థులకు మంచి అభిరుచినీ కలిగించే చక్కని రచన యిది.

గుంతకల్లు　　　　　　　　కే. వేంకటేశ ఆచార్య.

11-4-77

## S. D. Thirumala Rao

Member: The P.E.N. All-India Centre, Bombay
Founder-Member: Indian Association for History of Philosophy and Science, Ujjain

కవిత్వమునకు సన్మానములు, గండపెండేరములు లభించును, నాటకాలకు బంగారు పతకములు. "వన్సురులు" లభించును. నవలలకు — ముఖ్యముగా నేడుమోవలు వ్రాయుచున్న నవలలకు — చలనచిత్ర భాగ్యముభించును. చిన్నకథలకు అక్షరలక్ష లబ్బును — కాపీలమ్ముడునల పోవుట వలన! సాహిత్య విమర్శనకు? కష్టనిష్ఠూరములు లభించును. విమర్శ కృతజ్ఞతారహిత ప్రక్రియ. అయినను, సాహిత్యములో విమర్శనకు మహత్వపూర్ణస్థానమే ఉన్నది. ఉదాహరణకు పాశ్చాత్య సాహిత్యములో విమర్శ వహించిన పాత్ర గొప్పది. ఇంగ్లీషున మాథ్యూ ఆర్నాల్డ్, వాల్టరు పాటరులు, ఫ్రెంచిలో సైంటుబ్యూ, పాల్ వాలెరీలు, రష్యను భాషలో టాల్‌స్టాయి, జర్మనులో ఎకర్‌మన్, హెర్డర్, లెస్సింగులు, ఇటాలియనులో క్రోచే వ్రాసిన సాహిత్య దార్శనిక విమర్శలు ఆ యా భాషల సాహిత్యములకు ఓజస్సు తేజస్సు తెచ్చిపెట్టినవి. ఒక సాహిత్యపుటున్నతిని తెలిసికోవలెనన్న, అందలి విమర్శస్థాయిని స్థాలీపులాక న్యాయమున పరీక్షించిన చాలును. తెలుగు వ్యాకరణదీపము చిన్నదని వెనుక శ్రీ చెళ్లపిళ్ల వారు అనియుండిరి. ఇప్పుడు వ్యాకరణ దీపము పెద్దదిగనే మండుచున్నది. తెలుగు విమర్శ మాత్రము మినుకు మినుకనుచున్నది.

ప్రకృత గ్రంథము "కావ్య నిదానము" ఆంధ్ర సాహిత్య విమర్శనా దీపావళికి ఇంకొక దీపకళిక. గ్రంథ కర్తలు "సాహితీశిల్పి" బిరుదాంచితులు, కీర్తిశేషులు శ్రీ రూపనగుడి నారాయణరావుగారు. ప్రాతతరము వారైనను, కందుకూరి, చెళ్ళపిళ్ళలు వయస్సుమీరిన కొలదీ, ఆధునికత సంతరించికొనినట్లు, ప్రగతిశీల పరిశీలకులు. "కావ్య నిదానము" లోని విషయమును దిఙ్మాత్రముగ సమీక్షింతును.

ఇందు కళ, అభినయము, నాట్యము, లలితకళలు, సారస్వతము, సాహిత్యము, జీవితము-కళ, కవిత్వ నిర్వచనము, తిక్కనార్యుని కవిత్వమువంటి సదాసక్తిదాయక విషయములపై పదుమూఁడు వ్యాసములున్నవి. శ్రీ నారాయణరావుగారికి ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్యాలంకారిక మతములు కరతలామలకములు. వీరిపై ఆధునిక వేదర్షి అరవిందుల ప్రభావము ఎక్కువగా వున్నట్లు కన్పించును. అందుకే శ్రీ నారాయణరావుగారి దృక్పథములో వేదాంత కాంతులు ప్రసరించినవి. "కావ్య నిదానము" లోని కొన్ని ఆసక్తికర భావపరిశీలన చేయుదము. "కళ యనఁగ నేమి" యను వ్యాసములో, కళ లయగామంజస్య సమన్విత మని ప్రతిపాదింపబడినది. సాహిత్య, సంగీత, నృత్య, చిత్ర లేఖన, శిల్ప, వాస్తు కళలు, భావలయ, శబ్దలయ, చలన లయ, రేఖవర్ణలయ, ఉపరితలలయ, వ్యోమలయల వలన ఆవిర్భవించుచున్నవి అని నేను నా "సాహిత్య తత్వము - శివభారత దర్శనము" లో విశదీకరించినాను. చరాచర ప్రకృతిఅంతయు లయమయము. లయలయమైనవిలయమగును.

"అభినయము, నాట్యము, నాటకము" అను వ్యాసములో సినీమాలు ప్రబలి నాటక ప్రదర్శనమునకును, నాటక రచనమునకును ప్రతిబంధకములై యున్నవి అని శ్రీ నారాయణరావుగారు అనుచున్నారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను రష్యను సాహిత్యములు చూచినను, మనదేశముననే బెంగాలి, మరాటి, ఇటీవలి కన్నడ సాహిత్య నాటకరంగములను పరిశీలించినను, నాటక సినీమా రంగములు ఒకదానితో నింకొకటి పోటీపడి వృద్ధిపొందుచున్నట్లు కనిపించునే కాని, ఒకదాని కింకొకటి ప్రతిబంధమయినట్లనిపించదు. తెలుగులో నాటకము అను పదమునకు సార్థకత చేకూర్చు రచన యున్నదా అని నా అనుమానము — "కన్యాశుల్కము" తప్ప. దాని నెవ్వరును ఇప్పుడాడరులెండు. మనకు శిశిర కుమార భాదురి, శంభుమిత్రలు లేరు, మన కిట్టి నాటక దర్శకులు లేరు. బళ్లారి రాఘవ, మొన్నటి వేంకటేశ్వరరావు తర్వాత నాటకీయ నటులు కఱవైరి. మనవి మెలోడ్రామాలే కాని డ్రామాలు కావు. మన నాటకములు సినీమాలవలె ఆడబడుటచేతను, సినీమాలు నాటకములవలె తీయబడుటచేతను, రెండును చెడినవని నాకు తోచును.

"కవి కుండవలసిన ముఖ్యలక్షణములు" అను వ్యాసమున, భావన, రసజ్ఞత, ఉపజ్ఞ, ప్రతిభ అని ప్రతిపాదించిరి. వీని నన్నింటికీమించి కవికుండవలసిన లక్షణము "కవిత్వము" అని నా అభిప్రాయము. కవిత్వము అను పదమును మనము కవి చేయు రచనకు వాడుచున్నాము. కాని నిజమునకు కవిత్వము అనిన "కవితనము" (గురుత్వము వలె) ఈ అర్థముతోనే కవిత్వము అను పదము ఋగ్వేదమునందు కలదు,

"కవిత్వ నిర్వచనము" అను వ్యాసములో ఎన్నియో కవిత్వ నిర్వచనము లీయబడినవి. ఈ వ్యాసములో వ్యాస కర్తలు, "గోవువలని పరియోజనము నుడువుట సులభము కాని, దాని స్వరూపమును నిర్వచించుట సులభము కాదు. అటులనే కవిత్వమిదియని నుడువవచ్చును కాని కవిత్వ తత్వ స్వరూపమును నిర్వచించుట యసాధ్యము గాకపోయినను సులభసాధ్యము కాదు. కవిత్వ స్వరూపము ఎండమావుల వలె దూరమునుండి కాన్పించును కాని దానిఁ బరిశీలింప సమీపమునకుఁ జనుచో నది దవ్వులఁ బోవుచుండును" అని పోలికముగ స్పష్టముగ చెప్పినారు. ఇందు భేదాభిప్రాయము లుండవచ్చును. గో పరియోజనమును, గో స్వరూపమును నిర్వచింప వచ్చును. కాని. "గోత్వము" అను దానిని నిర్వచించుటకు కాదు. అటులనే కావ్యమును నిర్వచింపవచ్చును. "కవిత్వము"ను నిర్వచించుట యసాధ్యము. కవిత్వమునకు ఎండమావులపోలిక సరిపోదు. ఎండమావులు, లేనివి ఉన్నట్లు తోచును. కవిత్వము వున్నది లేనట్లు తోచును — నిర్వచనమునకు పూనుకొంటిమా? ఎండమావులు దవ్వులకే కన్పించును. కవిత్వము మన యెదుటనే వుండును. కవిత్వమును ముత్యములోని లావణ్యముతోఁ బోల్చుట సమంజసతరము. ఆనందవర్ధనుఁడు ఇట్టి భావమునే చెప్పినాఁడు. కవిత్వమును లక్షణములద్వారా కాక, లక్ష్యములద్వారా, అనఁగా మహాకవుల రచనా వ్యాసంగముల ద్వారా అనుభవమునకు తెచ్చుకొనుట సులభతరమైన మార్గము అని చెప్పిన శ్రీ నారాయణరావుగారి తీర్మానము సహృదయాంగీకార యోగ్యము. ఇదొక్కటే మార్గమని

నా అభిప్రాయము కూడ. ఈ భావసరణి ననుసరించి శ్రీ నారాయణరావుగారు తిక్కన కవిత్వము నుండి యెన్నియో ఉదాహరణములిచ్చి, ఉత్తమ కవిత్వమిట్లుండవలెనని సోపపత్తికముగా నిరూపించినారు. తిక్కన విరాటపర్వము నుండి మాత్ర ముదాహరణము లిచ్చినారు. తిక్కన కవిత్వము. పర్వములు సాగినకొలది రసవత్తత, ఉదాత్తత సంతరించు కొనును. స్త్రీ, శాంతి. అనుశాసనిక పర్వములలోని తిక్కన కవిత్వము మహోద్భాతముగా నుండును. ఏమైనను, "కవిత్వ నిరూపణము – తిక్కనార్యుని కవిత్వము" అను వ్యాసము "కావ్య నిదానము" లో తలామానికము వంటిది. ఇది డాక్టరేటు సిద్ధాంత వ్యాసములను బోలును.

కళింగ తెలంగాణములు విప్లవ సాహిత్యమునకును. సర్కారు జిల్లాలు భావ, అభ్యుదయ కవిత్వములకును, రాయలసీమ సాహిత్య విమర్శనకు నెలవులని నేననుకొను చుందును. నా యీ సిగమనమునకు అచ్చపు రాయలసీమ వారైన శ్రీ రూపనగుడి నారాయణరావుగారి "కావ్య నిదానము" బలము చేకూర్చినది. సాహిత్య విమర్శనోద్దేశము కవిత్వ మెడల మంచి అభిరుచి కల్గించుట అయిన, ప్రస్తుత గ్రంథము సఫలీకృతమయినదని యే నా వినమ్రాభిప్రాయము. ఇట్టి విమర్శన వ్రాసిన శ్రీ నారాయణరావుగారు చిర స్మరణీయులు.

అనంతపురం — సద్దేశాయి తిరుమలరావు.

4—4—1977.

# సమర్పణము

ఏ సాధు జీవ

అగ్ని ప్రమాదమునకుఁ జిక్కి

తన ప్రియభర్తను, వృద్ధజననీ జనకులను

అసంఖ్య బంధు మిత్రులను శోకార్ణవమున ముంచి.

తాను నాకలోకమునకుఁ జనెనో. అట్టి భక్తితత్పరకు,

ప్రశాంత జీవన సౌందర్య గ్రహణైక ప్రసన్నమతికి.

నా కడగొట్టుపుత్రికి, శ్రీమతి సీతాలక్ష్మమ్మకు, ఆమె

యాదరాభి మానములకుఁ గడుఁ బాత్రమై తనరిన

'కావ్య నిదానము' అను గ్రంథమును విమర్శనాత్మ

కముగా రచితంబైన ఈ గ్రంథము

నామె సంస్మరణ చిహ్నంబుగా

సమర్పణము గావించు చున్నాను.

కృతి కర్త.

# ప్రశంస

శా॥ శ్రీ లక్ష్మీయుతమూర్తి, సర్వవిభవ
శ్రీయోమసంఘాత, లో
కాలిప్రస్తుత పంచ హేతివిలస
ద్వ్యాపార లోకావనో
ద్వేలారంభుడు వెంకటేశ్వరుడు సం
ప్రీతిన్సదాజ్ఞాన వి
ద్యాలంకారుని బ్రోచు సద్గుణుని శ్రీ
యవ్వారి నారాయణున్॥

సీ॥ ఎవ్వానిసంపద యెవ్వేళ సాహితీ
సేవకై మిగుల వెచ్చింపబడును,
ఎవ్వాని మధురవాగీరిత ప్రీతి విష
యంబు విజ్ఞతతోడ నలరుచుండు;
ఎవ్వాని సహవాస మే జడాత్మునికైన
భాషాభిమానంబు ప్రబలజేయు,
ఎవ్వాని సంకల్ప మెనలేని నిస్స్వార్థ
కార్యోన్ముఖంబయి గ్రాలుచుండు

తే॥గీ॥ అట్టి యవ్వారి నారాయణప్ప కవుల
కల్పశాఖగ జగమున ఖ్యాతిగాంచి
జన్మసార్థక్యకృత్య విశ్వాసగరిమ
దనరుఁ దనసాటివారిలో ధన్యుడనగ॥

క॥ కృతులెన్నో! కవులెందరో!
నుతగతి నీసత్కృతులకు నోచుకొనంగా
మతిగలిగిచేర నీదరి
వితథమనోరథతఁ దిరిగి వెళ్లుటగలదే !

క॥ జనమాన్యత గురునమ్రత
ధననిస్పృహాత స్వతంత్ర ధర్మస్థితియుం
దనయంతవలిచి వచ్చెను
నినుఁబొందగ కావ్యరసిక నిపుణాగ్రసరా !

తే॥ పావనంబయ్యె నవ్వారివంశ మిలను
నీభవంబున, మఱినీవు ప్రాభవమును
గాంచినాడవు తద్వంశకలనఁ జేసి
అతులగుణగేయ నారాయణప్ప సుకవి॥

ప్రకాశకులు.

# కావ్య నిదానము - రెండు మాటలు

(కుంటిమద్ది శేషశర్మ)

ఏతద్గ్రంథకర్త, శ్రీ రూపనగుడి నారాయణరావుగారు వీరి దౌహిత్రులు శ్రీ కైప నాగరాజగారు ముద్రిత కావ్య నిదాన గ్రంథప్రతిని తెచ్చియిచ్చి దీనిపై నిష్పాక్షికమైన మీ అభిప్రాయము వ్రాసియుండని అర్థించినారు.

గ్రంథకర్తలు శ్రమకోర్చి, తమ భావములకు రూపు దీర్చి, గ్రంథరూపమున వెలికిఁ దెచ్చుచున్నారు. తెచ్చినా, "ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యే" అని కాళిదాసన్నట్లు విజ్ఞులు మంచినదన్న మెప్పుపడసిననే గదా విలువ.

ఐనా, "బోద్ధారో మత్సర గ్రస్తాః" అంటాడు భర్తృహరి తెలిసినవారికి మాత్సర్యమట. అది ఒక్కపట్టున మెప్పుదలను ముట్టఁజెప్పదు. అందుకే "ఏనామ కేచిదిహ నః ప్రియన్త్యవజ్ఞాం, జానంతు తే కిమపి తాన్ప్రతి నైషయత్నః। ఉత్పత్స్యతే మమతు కోపి ప మానధర్మాసకాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ"

మత్సరగ్రస్తులకు గాదు నా ప్రయత్నం. మద్భావాను గుణ భావనా వాసితులు, ఈ విశాల ప్రపంచంలో, అనంత కాలంలో, కలుగకపోరు. వారు నా గ్రంథాన్ని ఆదరించకనూ పోరు అంటాడు భవభూతి.

అన్ని కాలములలోనూ అన్ని రకములైన భావములు గలవారూ ఉందురు. కువిమర్శకులు, దుర్విమర్శకులూ లేక

పోలేదు. ఉన్నదున్నట్లు చెప్పినమా అన్యథా భావించు టయూ అరుదుగాదు.

అట్టిచో నిష్పాక్షికంగా చెప్పడము కత్తిమీది సాము. అదీగాక, ఒక్కనికి మంచిదిగా కనిపించినది, దృష్టిభేదమును బట్టి వేరొక్కనికి భిన్నముగా కనిపించనూ వచ్చును.

అందుననూ సాహిత్యమున, భావలహరి, వాని వాని మేధాప్రకృతినిబట్టి ప్రవహించును. తాను దలచిన దాని కుపపత్తులు తన ప్రజ్ఞ కొలది నిరూపించగలడు; మరొక్కడు దానిని ప్రత్యాఖ్యానించనూగలడు.

పరికించుడు :– "దీనివల్లభుఁడనఁగా నిలనొబగు నొంపెసగ వర్ధిల్లువాఁ డెవ్వఁడొక్కొ" అను తిక్కన పద్యములోని సౌందర్యమును వివరించుచు, 128వ పుటలో "ఇక్కడ వల్లభుండనఁగా. అనుటలో నెంతో గంభీరార్థమున్నది. దీనికి ప్రియులుండవచ్చును. మగఁడని పేరుగాంచి, తాళి కట్టినవాఁడెవ్వడో అను ధ్వని స్ఫురించు చున్నది" అని గలదు. ఇందు, ద్రౌపదీ సౌందర్యాకృష్ణ మనస్కుఁడగు కీచకుఁడు, ద్రౌపది కులాదివిషయముల నాలోచించు చున్నాఁడు, తల్లిదరిదుర్లెవ్వరు? పేరేమి? ఇత్యాదిగా.

ఇచ్చట "అల్పాక్షరంబుల ననల్పార్థ రచన" అను గుణమును గ్రంథములలో గొప్పగా కీర్తించుచున్నను – అనల్పాక్షరములతో అల్పార్థమును వెల్లడించుట గుణముగా కీర్తించినారు. గ్రంథకర్త. "కొన్ని సందర్భములందు చుట్టు మాటలతో భావమును వెల్లడిచేయుట రసోద్దీపకమై యుండును" అని.

ద్రౌపదీ రూపాతిశయ ముగ్ధుఁడగు కీచకుఁడు, "దీని పేరేమి" అనుటకంటే "దీని నామాకృతిగా నోచి వడసిన వర్ణంబు లెవ్వియొక్కో" అనెడి వ్యాయోక్తిలో నొక్క గౌరవభావము, ఒక గాంభీర్యమును ఒక సొంపును నున్నవి" అనుట రమణీయముగా నున్నదనుటలో విచికిత్స లేదు.

కాని, ఇక్కడ వల్లభుండనఁగా, - దీనికి ప్రియులుండ వచ్చును. మగండని పేరుగాంచి తాళిగట్టిన వాఁడెవ్వఁడో" అను ధ్వని స్ఫురించుచున్నది" అని వ్రాయుటలో ఔచిత్యము కొరవడినది.

వల్లభశబ్దము, ప్రాణప్రియుఁడు, ప్రాణకాంతుఁడు ఇత్యాదులవలె భర్త అను నర్థము నివ్వవచ్చును. కాని, "తాళిగట్టిన మగఁడెవ్వఁడో, అని "వల్లభ" శబ్దమునకు ధ్వని, అని వివరించుట. ద్రౌపదీపాత్రను, ఆమె యెడ మరులుకొన్న కీచకుని ఉదారమైన భావనను కించపరచుట యని నా తలంపు. వల్లభుఁడనుటకు తాడుగట్టిన వాఁడనుట కంటే, ప్రేమాస్పదుఁడని వ్యాఖ్యానించుటయే సమంజసము.

తాళికట్టుట, కట్టించుకొనుట, విధిలేకయైనగావచ్చును. నిర్బంధమువల్లనైన గావచ్చును. ఇష్టములేకున్నను, వష్టాష్టకమైనను తాళిగట్టుట భర్తయను వ్యవహారము పర్పడవచ్చును కానీ వల్లభుఁడుగాఁ బనిలేదు, వలవల్ల - సంవరణే అను ధాతు జన్యమైన వల్లభ పదము కౌగిలికి పాత్రమని ప్రేమాస్పదుడునని అర్థమొసఁగుచున్నది.

"తొలుత నీవే నేనై, నేనే నీవై యుంటిమి. కాలము గడచినకొలది ప్రేయసీ ప్రియులమైతిమి, ఇప్పు డాలుఁమగ

లముగనున్నా'' మన్న యొక్క కాంత విలాపముండనే యున్నదిగదా! ఇట్టిపట్టుల భిన్నాభిప్రాయములు, విమర్శనా దృష్టితో గమనించిన పొడగట్టకమానవు. కాని యవి యంత ప్రధానములు గావు. తాను పూనిన కృతి నెట్లు సాగించినాఁడనునదే గమనార్హము.

పాఠకుఁడు, విమర్శకుఁడు, కవి అనునదొక త్రికము పాఠకుఁడు తాను చదివినది 'లేక విన్నది, తన అనుభూతికి. సంస్కృతికి అనుగుణముగనున్న, ఆనందించును; ఉబ్బి గంతులు వేయును. తన్మయుఁడగును.

కాని, 'ఎందుకంత ఉద్రిక్తత' అని ప్రశ్నించిన, అది నాకు నచ్చినది. నన్నాకర్షించినది అని చెప్పగలఁడు; కాని, తనకు నచ్చుటకు కారణమేమి? 'ఎట్టులుండిన ఆకర్షకము' అను ప్రశ్నలకు కార్య కారణ నిరూపణ పూర్వకముగ విడమరచి చెప్పజాలఁడు. అది విమర్శకుని సొత్తు. విమర్శకుఁడు, శబ్దముల సౌశబ్ద్యము, మాధుర్యోజః ప్రసాదాదులను, కూర్పులోని పొందికను, అర్థస్ఫూర్తిని, విశదీకరించి, గుణ దోషముల నిరూపించగలఁడు.

''మన్మథ చంద్ర సమాన మూర్తి'' అనుట కంటే, మకరాంక శశాంక మనోజ్ఞమూర్తిలో శ్రవణ సౌహిత్యము నిండుకొనియున్నది. బిందుపూర్వక కకారముల యనుప్రాస మనోజ్ఞతను తెచ్చి యిచ్చుచున్నది గదా! దానినే ''రతిపతి నిశానాథ హృద్యస్వరూపః'' అన్న తకారానుప్రాసమునకు తోడు భావసౌష్ఠవము మనోజ్ఞతమము, ఏలన,

అది ప్రవరుని వర్ణనము. అతని అందము అచ్చర లేమకు గూడ మరులు గొల్పజాలినదిగా ప్రతిపాద్యము. మచ్చగల చంద్రునివంటి వాఁడనుటకంటే నిశాకాంతకు ప్రాణవల్లభుఁడైన రేరాజువంటి వాఁడనుటలో అర్థగాంభీర్యము తట్టకమానదు. గతిపతి పదము గూడ మకరాంకుని కంటే రసస్ఫోరకము. భాషాసరస్వతి యనుటకంటే భాషాయాంగీర్యవతి అనుట కర్ణారుంతుదము.

ఇట్లు విమర్శకుఁడు గుణదోషముల నిరూపించగలఁడు. ఇక కవి, తాననుభవించిన, యూహించిన భావములకు రూపుఁగల్పించి, సువర్ణరంజితముల గావించి, పఠితలకు, విమర్శకులకు, కనువిందు, శ్రోత్రపర్వము గావింపగలఁడు. వాసివాని ప్రతిభా వ్యుత్పత్తుల కొలఁది సహృదయహృదయాహ్లాదకరత్వ మాపాదించగలఁడు.

మన గ్రంథకర్త స్వయము కవి. అనేక గ్రంథముల రచించినవాఁడు. విమర్శకుఁడనుటకు ప్రకృత గ్రంథమే సాక్ష్యము. పాఠకుఁడు గానిదే విమర్శకత్వము కవయితృత్వము గల్గనేరవు గదా!

ఇట్టి సాహితీ శిల్పి కలమునుండి జాలువారిన దీ కావ్యనిదానము. అసలుకు నిదానమను పదమే విలక్షణమైనది. దానిని ఎన్నుకొని నామకరణమొనర్చుటలోనే విమర్శకుని దృష్టివైశిత్యము గోచరించు చున్నది.

ఆలస్యము అనుటకు తెనుఁగువారు, "నిదానము" అను పదమును వాడుట అలవాటు. నిదానమే ప్రధానము అనునది సామెతయైపోయినది.

ఇది ఆ నిదానము కాదు. "నిదానం త్వాది కారణం" అని అమరము. కావ్య సౌందర్య మూలకారణముల నిరూపించఁ బూనుకొన్న గ్రంథకర్త తన గ్రంథమునకు – నిదానమని నామముంచుటలోనే ఆతని దృష్టివైశిత్యము, అల్పాక్షరముల ననల్పార్థ రచన గలవు.

ప్రాచ్య పాశ్చాత్య మతానుసారము కావ్యోత్పత్తి హేతువులు, కావ్యస్వరూప విచారణము తొలి ప్రకరణములతో నిరూపితములు.

విమర్శనా విషయము కావ్యనిదానమేయైనను. లలిత కళలు, ఫలిత కళలు అని వింగడించి, గాన, చిత్రలేఖన, నటనములకును, కార్యకారణ విమర్శ గావింపఁబడినది.

సామాన్య పాఠకునికిగాక, విషయ తత్త్వ జిజ్ఞాసువునకు ఆవశ్యకములగు విషయములు, నాతివిపులముగా నిరూపితములు. 10 వ ప్రకరణమున కవిత్వ మెట్టిదన్న విషయము విపులముగా విమర్శితము, వట్టి స్వరూప నిరూపణము లాక్షణికునికినీ, పఠితకునూ, తలబరువైన విషయమే. అంత మాత్రముగాక తుది ప్రకరణములలో రసవంతములగు నుదాహరణములతోఁ జదువరుల మనముల నలరించు రచన సాగించినాఁడు సాహితీశిల్పి రూపనగుడి నారాయణరావు,

ఉబుసుపోకకుగాక, కర్తకు పఠితకునూ ప్రయోజనాత్మకమైన రచన యిది యని మదభిప్రాయము.

అనంతపురము, ఇట్లు,

6–4–77 కుంటిమద్ది శేషశర్మ.

# కావ్య నిదానము

## —: సమీక్ష :—

"మనమున నున్న నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యసమ్మదం
బనఘ కథాముఖంబున హితాహిత బోధ యొనర్తు రింపుగాఁ
గనుఁగొనుకంటె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రి యార్థముల్
ఘనమతు లెల్లవారికి నకారణ బంధులుగారె తత్కవుల్ ॥"

కవికర్ణ రసాయనము (1—8)

లోకమునకంతకు నకారణబంధువులైనవారు కవులు. అట్టి కవి వ్రాసినది కావ్యము. ఆ కావ్యవిమర్శనా పథకమును ప్రదర్శించునది ప్రస్తుత గ్రంథము "కావ్యనిదానము." ఈ గ్రంథమును రచించినవారు, కీ॥ శే॥ సాహితీశిల్పి రూపనగుడి నారాయణరావుగారు.

*కృతికర్త పరిచయము:—* ఈ కృతికర్తలగు నారాయణ రావుగారు రాయలసీమయందలి ప్రసిద్ధ కవి రచయితలలో నొకరు—రాయలసీమ సాహితీ క్షేత్రమున నెన్నో రత్నము లుదయించినవి — అట్టి రత్నములలో రూపనగుడి వారొక రనుటలో నతిశయోక్తి యేమాత్రము లేదు. సత్యోక్తియే.

*కృతులు:—* ఆధునికాంధ్ర సాహిత్యమున పద్య గద్య రచనలు రెండింటను వైపు వాటము లెఱిగిన జాణలు నారాయణరావుగారు, వారు నలుబదియొక్క గ్రంథములను రచించిరి.

*వచన రచనలు:—* అరవింద వాఙ్మయము—ఆంగ్లాను వాదములు. అద్యతన కాలమున అరవింద వాఙ్మయమును

తెలుగులో నావిష్కరించినవారు రూపనగుడివారే–వానిలో చాలా గ్రంథము లముద్రితములుగా నుండుట విచారకరము.

ఆంగ్లము – ఆంధ్రానువాద సామర్థ్యము – ఆధునిక యుగమున – నాంగ్లభాషనుండి తెనుగునకు ననువాద మొనరించినవారిలో వీరిని సిద్ధహస్తులని, అగ్రగణ్యులని చెప్పనొప్పును–ముఖ్యముగా, "అన్నీ ఒక్క యెత్తు. అగస్త్యుడు ఒక్కడూ ఒక్క యెత్తూ" అన్నట్లుగా తక్కిన రచనలు వేఱు–అరవిందుని రచనలు వేఱు–అవి బహుగంభీరములై తాత్త్విక సౌరభము గలిగియుండును. అరవిందుని ఆంగ్ల రచన లాంధ్రభాషలో ననువదించుట యసాధ్యమైనను శ్రీ నారాయణరావుగారు వాని నాంధ్రీకరించి కృతకృత్యులైరి. మచ్చున కొక యుదాహరణము చూపుచున్నాను.

*Nirvana*:– "The city, a shadow picture without tone floats, quivers unreal forms without relief flow. a cinema's vacant shapes; like a reef. Foundering in shoreles gulfs, the world is done. (Page 156)

"లేదహంతయుఁ, బ్రకృతియున్ లేదు; లేవు
వ్యక్తమవ్యక్తమును, మఱి యాపురంబు
వికసనము లేక యెటువంటి విరతి లేక
తమిని గనిపించుఁ జలనచిత్రంబు వోలె" (పుట 156)

"అరవిందుని యాంగ్ల రచనలే కాదు; ప్రసిద్ధాంగ్లేయ విమర్శకాగ్రణ్యుల రచనలను ననువాదము గావించుట యందును వీరు తేరినవారు–రెండుదాహరణములు :–

" Poetry is the art of producing pleasure by the just expression of imaginative though and feeling musical language." (Page 79)

"ఛందోబద్ధమైన భాషలో భావనాకలితములగు తలఁపులను, రసములను యథారీతి నావిష్కరించి, తన్మూలమున హృదయోల్లాసమును జేకూర్చు కళయె కవనము. (పు. 79)

రవీంద్రుని రచననుండి యొక యుదాహృతి :-

Rhythm is a movement generated and regulated by the harmonious restriction. This is the creative form in the hand of the artist(P. 4)

వస్తువిషయములందు నియమబద్ధముగా నుత్పన్నమైన సామరస్యపు సంచలనమే లయ. (ఇది శిల్పుల చేతియందు గల సృజన శక్తి.) (పుట 4)

యనువాదములలో – అముద్రితములైన యనువాద రచనలన్నియు ముద్రితములైనయెడల శ్రీ నారాయణరావు గారికి ఆధునాతనాంధ్ర వచన వాఙ్మయమున నెట్టి విశిష్ట స్థానము గలదో తేటపడగలదు.

కావ్యనిదానము :– నేడు తెలుగు భాషలోగల సాహిత్య విమర్శక గ్రంథములలో–కావ్యనిదానము గణనీయమైన కృతి. శీర్షికలు చూచిన నీ విషయము విశదమగును.

*గ్రంథ ప్రణాళిక – విషయోన్మీలనము:*

ఈ గ్రంథ ప్రణాళిక యొక నిర్దిష్ట క్రమముతో కూడినది. కవిత ఒక కళ–అందుచే తొలుత 'కళ' యన

నేమో. నిర్వచనము—తెలుపబడి—ఆ వెనుక. కళాభ్యుదయ పరిణామములు — లలిత కళావిభాగములు వివరింపబడినది. కవిత్వము లలితకళలలోనిది, అది తెలుగుసాహిత్యమున నెట్లు సమన్వయము జెందినది—తిక్కనాది మహాకవుల కవితా రచనలబట్టి విపులీకరింపబడినది — ఇది సరియైన సాహిత్య విమర్శక పద్ధతి: విషయోన్మీలన క్రమము నిందు చక్కగ పాటింపబడినది.

*విషయ వివేచనము—కళోత్పత్తి సిద్ధాంతములు:*

1) భయాశ్చర్య ప్రేమరసములే మూలకారణము.
2) లౌకిక ప్రయోజన వ్యవహారములు.
3) ధైర్య శౌర్య సాహసాది కార్యములు.
4) స్వేచ్ఛ, అభిరుచి, ఆహ్లాదము-ఆత్మావిష్కరణము,
5) శాంతి విశ్రాంతులు. 6) అభ్యాసము క్రీడాప్రవృత్తి.

*కళాభ్యుదయ పరిణామములు:*

గానము-అభినయము—నాట్యము—నాటకము-చిత్రకళ స్థాపత్యము-కావ్యము-ఇందు స్థాపత్యము అనగా శిల్పము. శిల్పకళావిశేషము లిందు చక్కగా వివరింపబడినవి.

*కళా ప్రయోజనములు:—* 1) సౌందర్యవిషయము 2) విద్యాబుద్ధుల విషయము 3) ఆత్మ విషయము.

*లలిత కళలు:—* 1) గానము 2) చిత్రకళ 3) కవిత్వము—ఈ మూడును ఆత్మకు సుప్రశస్తమైన విద్యాసంస్కారము గలిగించును.

## సారస్వతము – వాఙ్మయము – సాహిత్యము

1) సరస్వతి అధిష్ఠాన దేవతగా గలది సారస్వతము.

2) వాక్కుల మయము వాఙ్మయము. వాక్కునకు అధి దేవత సరస్వతియేగాన రెండింటికి భేదమత్యల్పము.

3) రససహితమైన కవితారచన సాహిత్యము.

### విషయ సమన్వయము :–

ఈ గ్రంథమునపై కళాలక్షణము లన్నింటికి–తొలుత సంస్కృత భాషాసాహిత్యముతోను, నావెనుక తెలుగుభాషా సాహిత్యముతోను సమన్వయము చేయబడుట – మిక్కిలి సమీచీనమై ప్రశంసనీయముగా నున్నవి. ఇది సార్వత్రిక ముగా తెలుగు సాహిత్యమునకే సంబంధించినదిగాన – కళా లక్షణములన్నియు–తెలుగు సాహిత్యము తోడనే నఖండ ముగా సమన్వయము చెందుచున్నది. ఈ ప్రత్యేక లక్షణమే– దీని నితర సాహిత్య విమర్శన గ్రంథములనుండి వేఱుపఱు చుచు విశిష్టతను చేకూర్చినది.

రచనా విధానము:– ఇందలి రచనా విధానము తక్కిన విమర్శ గ్రంథములకంటె యొక ప్రత్యేకత సంతరించు కొన్నది. గ్రంథ లక్షణములు:–

1) గ్రంథ మధ్యమున నాంగ్లభాషాపంక్తుల నుదాహ రించినను వెనువెంటనే తెలుగులో నా వాక్యముల ననువదిం చుట. తెలుగున తొలుత నీ విధానము పాటించినవారు వీరేశ లింగముగారు – ఇందు వాక్యములనేగాక ఆంగ్ల పదములకు వెంటనే తెలుగులో పారిభాషికము లిచ్చుట గలదు. ఈ

కాలమున కొన్ని సాహిత్య విమర్శక గ్రంథములలో, పాశ్చాత్య విమర్శకుల గ్రంథములనుండి ఆంగ్ల వాక్యములు, భాగము ఉదాహరించియు, వానికి తెలుగు అనువాదమీయక పోవుట కన్పట్టుచున్నది. (ఉదా॥ సన్నిధానము సూర్య నారాయణశాస్త్రిలుగారి కావ్యాలంకార సంగ్రహము.) కాని యిందట్లు లేకుండుట ప్రశంసనీయము.

2) సంస్కృత శ్లోకముల నిచ్చి వెంటనే తాత్పర్యము తెలుగులో నిచ్చుట – దీనికి ఆద్యులు వీరేశలింగముగారే. ఈ తరువాత ఈ పద్ధతి కొన్ని విమర్శన గ్రంథములలో పాటింపబడుటలేదు. ఇందు పాటింపబడుట విశేషము.

3) ప్రతిపాదిత విషయముల విభజనము. ఇందు ప్రతిపాదిత విషయములు మనస్సునకు హత్తుకొనునట్లు చక్కగా విభజింపబడినవి.

(ప్ర 8) *కవికుండవలసిన లక్షణములు:*

1) భావన 2) రసజ్ఞత 3) ఉపజ్ఞ 4) ప్రతిభ.

(13 ప్ర.) *కవిత్వ లక్షణములు–వస్తువు, శైలి.*

కావ్యవస్తువు మూడు విధములు, 1) ప్రత్యక్షము 2) భావాధికారము 3) అమూర్త విషయములు.

శైలి విన్యాసము ఆరు విధములగు హేతువులు

1) నవ్యకల్పన 2) సూక్ష్మత 3) మనోవృత్తి 4) అపరిచిత వస్తువు 5) ఆనందస్మృతి 6) అభిరుచి.

4) *నిర్వచనములు–సూక్తులు*

1) విశ్వసృష్టి యంతయు భగవంతుని కావ్యమేగదా.(పు.4)

2) సంపూర్ణమైన లయసామంజస్యము పరుసవేది వంటిది.(5)

3) కామక్రోధాది రాహిత్యమే శాంతి (పుట 10)
4) అవస్థాను కరణమే అభినయము (పుట 20)
5) కళలవలని ప్రయోజనము సూక్ష్మము నగాధము (పు.46)
6) జీవాత్మ పరమాత్మ యొక్క స్వస్వరూపము (పుట 97)
7) మానవుడు క్షమగలిగియుండుట సర్వతోభద్రము.(పు111
8) ఇంద్రియసుఖ మీ కవి కావ్యము లీజాలును. (పుట 122)
9) సాత్విక దార్ఢ్యములేని భీరురాలు! (పుట 132)
10) శైలి యనునది దాని వహించుపాత్రవంటిది. (పు. 160)
11) భావము ననునది జలబిందువు వంటిది. (పుట 160)
12) భావమునకు భాషకు నవినాభావ సంబంధము. (పు.160)

5) పూర్వకవుల కృతుల నుండి పద్యము లుదాహరించునపు డందలి కఠినపదములకు పుటయడుగున నర్థము లిచ్చుట—ఈ పద్ధతి యెంతయు మెచ్చదగినది — ఇదివఱలో విమర్శకులు పద్యము లుదాహరించిరేగాని అర్థములనీయలేదు, ఇందీయబడినవి — ఇతర విమర్శకు లనుసరింపదగినది.

6) ఇందు 'శైలి' అని పారిభాషికపదము వాడబడినది. దీనిని నేడు తెలుగు సాహిత్య విమర్శకులందఱును వాడుచునే యున్నారు గాని, మన ప్రాచీనాలంకారిక గ్రంథములలో నీ శైలి పదమూ గన్పట్టదు — వానిలో శైలిని రచనారీతి యందురు — సంస్కృత కావ్యములలోను దీనికి ప్రయోగము లేదు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో 'శైలి' శబ్దము వాడినాడు.

ఇట్టి ప్రత్యేక రచనా విధానముతో నొప్పుచు నీ గ్రంథము—నారాయణరావుగారికి 'సాహితీశిల్పి' నామమును సార్థకము చేయుచున్నది.

*తెలుగు సాహిత్యము — కావ్యకళా విమర్శన.*

ఈ కృతియందు కవిత్వ నిరూపణము- తిక్కనాచార్యుని కవిత్వము—అనునది మకుటాయమానమై యున్నది. ఇరువది యేడు పుటలలోనున్న యీ శీర్షికలో తిక్కన విరాటపర్వమున ప్రదర్శించిన — నాటకీయత - పాత్రపోషణ-రసజ్ఞత-ఔచిత్య నిర్వహణ — అత్యద్భుతముగా చిత్రింపబడినది — కొందఱు విమర్శకులు భావించినట్లుగా — సైరంధ్రి-కీచకుల శృంగారము రసాభాసముకాదని, అది తిక్కన శృంగార రసౌచిత్య నిర్వహణకు ప్రతీకయని-యిందు సోపపత్తికముగా, మూలపద్యవ్యాఖ్యాతులతో నిరూపింపబడినది—విరాటపర్వము భారతమునందొక పర్వమేయైనను నది యొక ప్రత్యేక కావ్యశిల్ప కళా ఖండముగా నెట్లు పరిణామము నెందినది, యిందు సువ్యక్తము గావింపబడినది.

*తిక్కన — ప్రపంచకవులలో స్థానము:*

తెలుగు సాహితీ విమర్శకులందఱు తిక్కనను కవి బ్రహ్మగా నారాధించిన వారేగాని వారెవరును తిక్కనకు ప్రపంచ కవులలో స్థానమీయలేదు—తిక్కనకు ప్రపంచ కవులలో స్థానమీయొక్క గ్రంథమునందే గలదు-చూడు క్రింది వాక్యములు—

"కవితిక్కన కాళిదాసువలె షేక్స్పియరు డాంటీల వలెఁ బ్రపంచమందలి యుత్తమకవి తరగములోఁ జేర్పఁ బడుట కర్హుఁడగుట కెట్టి సంశయమును లేదు." (పుట 149)

పైవారిలో షేక్స్పియర్ సుప్రసిద్ధాంగ్ల కవిసార్వభౌముడు. డాంటీ లోకోత్తరుడైన జర్మనుకవితా పట్టాభి

పి క్తుడు-ఇతడును ప్రపంచ కవులలో నొకడు-కాళిదాసు అభిజ్ఞానశాకుంతలము చదివి ఆనందము పట్టలేక గంతులు వెచిన దీతడే.

*ప్రాచీనకావ్య ప్రగాఢ పరిచితి:*

గ్రంథకర్త లీ గ్రంథమున-తిక్కన కవికి హెచ్చు ప్రాధాన్య మొసంగినను, ఆయన నన్నయ మొదలు-కృష్ణ దేవరాయల వఱకు-అనగా భారతము మొదలు ప్రబంధ యుగమువఱకు గల కావ్యముల నన్నింటిని జీర్ణించుకొన్న వారని యీ గ్రంథము సావధానముగా నవలోకనము చేసిన వారికి గోచరింపగలదు,

తిక్కన తరువాత-అల్లసాని పెద్దన మనుచరిత్రయందు ప్రాధాన్య మున్నది-ఆవెనుక సందర్భానుసారముగా నీక్రింది గ్రంథములు నుదాహృతములైనవి. కాలక్రమము ననుసరించి కూర్చినది,

నన్నయ భారతము -నన్నెచోడుని కుమారసంభవము, పాల్కురికి సోమనాథుని బసవపురాణము, కేతన దశకుమార చరిత్రము-శ్రీనాథుని శృంగార నైషధము, కాశీఖండము, హరవిలాసము, పోతన భాగవతము దశమ స్కంధము, తిమ్మన పారిజాతాపహరణము, తెనాలి రామకృష్ణుని పాండు రంగ మాహాత్మ్యము, పింగళి సూరన కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము. రామరాజ భూషణుని వసుచరిత్ర;

మొత్తముపైని యీ నూతన విమర్శక గ్రంథమున పదునైదు ప్రాచీన కావ్యము లుదాహృతములైనవి — ఈ కాలపు విమర్శనలలో శివకవులగు నన్నెచోడ, పాల్కురికి

సోమనాథుల గ్రంథములు సాధారణముగా చేకొనబడవు. ప్రస్తుత గ్రంథమునందీ రెండును గ్రహింపబడుట ఈ గ్రంథ ప్రత్యేక విశిష్టతకు తార్కాణము.

ఇట్లు విషయ వివేచనచేత నీ గ్రంథము భాసించుటయే గాక, భాషావిషయమున ప్రత్యేకత వహించియున్నది. తక్కిన సాహిత్య విమర్శక గ్రంథములవలె నిదియును గ్రాంథిక భాషలోనే వ్రాయబడినది-కాని వానియందు లేని రెండు గ్రాంథిక భాషాలక్షణము లిందు పాటింపబడుట విశేషము. అవి (1) అర్ధానుస్వారము. (2) శకటరేఫము. ఇందర్ధానుస్వార నియమ మవ్యభిచరముగా పాటింపబడినది.

తెలుగు సాహిత్యమున నాధునిక యుగమున విమర్శ ప్రధాన స్థానము నాక్రమించినది – సాహిత్య విమర్శక గ్రంథములు కొలదిగానే వెలువడినది–అవి ఉత్తమ స్థాయిని నున్నవి. అట్టి ఉత్తమ స్థాయిలోనున్న నీ సాహిత్య విమర్శక గ్రంథము 'కావ్యనిదానము' కళాశాలలో పఠనీయ గ్రంథముగా నుండదగినది.

విశ్వవిద్యాలయాధికారులు, కళాశాలాధికారులు దీని నాదరింతురు గాక! ఆంధ్రసాహిత్య ప్రపంచమున నీ గ్రంథ మధిక ప్రచారము బడయునుగాక!

'కళాప్రపూర్ణ' నిడుదవోలు వేంకటరావు. M. A.
(Retd. Head of the Dept. of Telugu, Madras University
Fellow A.P. Sahitya Academi HYDERABAD - 44.
15—4—77.

శిరోమణి, విద్వాన్
కలచవీడు శ్రీనివాసాచార్యులు,
సంస్కృతోపన్యాసకులు.

శ్రీ సత్యసాయి
మహిళా కళాశాల,
అనంతపురము.

సాహితీశిల్పి శ్రీ రూపనగుడి నారాయణరావుగారు రచించిన 'కావ్యనిదాన' మను విమర్శనాత్మక గ్రంథమును పరిశీలించు నవకాశము నాకు గలిగినది. ఏతద్గ్రంథకర్త కలము నుండి పలువిధముల ప్రక్రియలలో సాహిత్యరచనలు వెలువడి నవి. అవన్నియు నింతకుముందే సాహితీ రసజ్ఞుల ప్రశంసల నందుకొన్నవి. కవిగా-విమర్శకుడుగా శ్రీ నారాయణరావు గారు ప్రసిద్ధినందిరి. ప్రస్తుత 'కావ్యనిదాన' మను కావ్యము విమర్శనాత్మకమైనది.

గ్రంథ నామకరణమునందే రచయిత వైలక్షణ్యమును ప్రదర్శించెను. 'కావ్యలక్షణము,' కావ్యస్వరూపము పేర్లనే కము లింతకుముందు ప్రాచీనాలంకారికులచే తమ గ్రంథ ములకంగీకరింపబడినవి. కాని 'నిదాన' మను పదమును వారెవ్వరు నుపయోగింపలేదు. "నిదానం త్వాది కారణ" మ్మని యమరము. కాగా కావ్యోత్పత్తికాదికారణమును వివరించుచు, క్రమముగా తదభివృద్ధిని సోదాహరణముగా రచయిత యీ గ్రంథమునందు నిరూపించిరి, కళానిర్వచన ముతో నారంభించి, సంగీత, చిత్రలేఖన-నాట్యా భినయాది లలిత కళల స్వరూప స్వభావములను క్షుణ్ణముగా విమర్శించి చివరకు తత్ప్రయోజనమును హృదయంగమముగా వ్యక్తీ కరించిరి. సారస్వత-వాఙ్మయ సాహిత్యములను పదములకు చక్కని నిర్వచనోదాహరణముల నొసగుట వీరి ప్రత్యేకతను నిరూపించుచున్నది. జీవితమునకును కళకును సన్నిహిత

సంబంధముగలదని యందరందురుగాని యీ సంబంధ మెట్టిదో సులభశైలిలో సామాన్యులకు సహిత మర్థమగునట్లు వీరు రచించిరి.

పిమ్మట క్రమముగా కవిత్వ నిర్వచనమునకు గడంగి, పూర్వాలంకారికుల వివిధ మతములను, సంప్రదాయములను తెలిపి కవిత్వమనగా నేమియో, సహృదయుల హృదయముల నదెట్లు అలరించుచున్నదో వివరించుటకు పూర్వ కవుల రచనల నుండి వివిధములైన యుదాహరణముల నొసగిరి. వీరిచ్చిన యుదాహరణములను చదువునప్పుడు పాఠకుడు కవితామృతపాన సౌఖ్యమనుభవించు ననుటలో సందేహము లేదు. ముఖ్యముగా వీరు నన్నయ్య-తిక్కన-శ్రీనాథుడు-పెద్దన మున్నగు ప్రాచీనకవుల కవితల నుదాహరించిరి. ఆయా పద్యములను వ్రాయుచు, వానియందలి కవితా శిల్పములను కనులకు గట్టినట్లు వివరించిరి. దీనిచే ప్రకృత రచయిత యొక్క కవితా రసజ్ఞత తెలియుటయేగాక-యితరుల కా కవితల సొబగులను సాక్షాత్కరింప చేయగల్గుట విదితమగుచున్నది. బోధకులుగా పనిచేసిన వీరికిది 'సహజశక్తి' యనుట సత్యము.

ఇన్ని విషయములతో గూడిన యీ విమర్శగ్రంథము పాఠకులకు బహుళ ప్రయోజనములను సమకూర్చగలదనుటలో సందేహములేదు. కావ్య విషయ విశేషముల నెఱుగగోరు సాహితీప్రియులందరి కీ గ్రంథ ముపదేష్టగాఁ బనిచేయగలదు. ఇట్టి యుత్తమరచనల నాదరించుట సాహితీప్రియుల కర్తవ్యమని మనవి చేయుచున్నాను.

15-4-77 కలచవీడు శ్రీనివాసాచార్యులు.

# కావ్యనిదానము

## 1. కళ యనఁగ నేమి?

బొగ్గునకును, వజ్రమునకును వస్తుతత్త్వమునం దెట్టిభేదము లేకున్నను, మొదటిది నల్లనై, మవ్వమై, తేలికయై, సర్వసామాన్యముగ నెక్కడను గన్పట్టునదై యున్నది. మఱియొకటి దేదీప్యమానమై, కఠినమై, బరువై, మిక్కిలి యపురూపముగాఁ గనఁబడునదై యున్నది. ఏకపదార్థమగు జలము ద్రవరూపమగు వర్షముగను, ఘనరూపమగు వర్షోపలముగను, వాయురూపమగు నావిరిగను గోచరించుచుండును. కమలము పేఁడవలెఁ బృథ్వ్యాది పంచభూతములతో నేర్పడినదైనను, దాని రూపము, రంగు, దళములపొందిక, పరిమళము మన కానందమిచ్చును. ఏల? పదార్థములందలి యణువుల సంయోగము ఏకరీతిగ నుండక, పలువిధములుగా నుండును. ఏ వస్తువులయం దణుసంయోగము లయాన్వితమై (rhythmic) యుండునో, యవి తేజోవంతములై, జీవకళ గలవియై యుండును.

బొగ్గు, వర్షము, పేఁడ – యివి వజ్రమునకంటెను, వర్షోపలముకంటెను, కమలమునకంటెను మిక్కిలి యుపయుక్తములై యున్నను మనము మొదటివాని నంతగాఁ బ్రేమింపక రెండవవానినే ప్రేమింతుము. బుద్ధుని దంతమువలన బౌద్ధులకె ప్రయోజనము లేకున్నను, దానికై వారొక యాలయముఁ గట్టించి దాని నొక దివ్యవస్తువుగాఁ బూజించు

చున్నారు. వంశపారంపర్యముగాఁ బ్రాప్తమైన యొక యలంతి వస్తువును మనమెంతో ప్రేమించి, దానిని భద్రముగా మన పుత్ర పౌత్రాదులకు నొక గొప్పయాస్తిగ వదలుచున్నాము. ఈ సంగతులం బట్టిచూడ వస్తువులు తమ కేవల ప్రయోజనముం బట్టికాక, అవి పుష్పమువలెఁ దమ సహజరామణీయకముం బట్టియు, మనయం దవి పుట్టించు భావసాహచర్యముం బట్టియు, భావనాప్రేరణం బట్టియు, వానిపై మనము వ్యాపింపఁజేయు తలఁపులం బట్టియు - అనఁగా వానివలన మనసున నేర్పడు లయసామంజస్యముల (rhythmic harmony) బట్టి, మన కవి ప్రియములగుచుండును.

తీర్థక్షేత్రాదులను దర్శించునప్పుడు మన మనంబు హర్షప్లావిత మగుచుండును. వానియం దుండు నొక దివ్యశక్తియె యందులకుఁ గారణము. ఈ శక్తి వాని యందలి నిసర్గరామణీయకమునుబట్టి కలిగినదై యుండవచ్చును, లేదా మహాత్ములు వానిపైఁబఱపిన భక్తిభావములఁబట్టియు, సదాలోచనలఁబట్టియుఁ బొడమినదై యుండవచ్చును. మహాత్ముల తలఁపులు మహాశక్తిమంతములై యుండును. వానిని వెదచల్లిన మహాపురుషులు దవ్వులనున్నను, దేహము వదలియున్నను వారి తలఁపులు లయసామంజస్యముగలవి యగుటచే సజీవములై యుండి యెంతో పనిచేయుచుండును. రామాయణ మహాభారత కావ్యములు మహర్షులగు వాల్మీకి వ్యాసులచే రచింపఁబడినవి కావుననే యందలి భావములు మహాశక్తిసమన్వితములై, లయసామంజస్యము గలవియై, మహాప్రభావవ్యాపకములై యున్నవి. ఈ కావ్యములు

నాఁటికిని, నేఁటికిని, రేపటికిని లోకమునందు వెలసి, లోకమును బవిత్రవంతముగఁ జేయుచుండెడివి.

దేశచరిత్రను జదివినవారికి బొంబయి నగరదర్శనము కంటెను తుంగభద్రానదీతీరమందలి పాడ్వడిన విజయనగర (హంపి) దర్శనమే యెక్కువ సొంపుగూర్చునదిగా నుండును. విజయనగరసామ్రాజ్యముయొక్క పూర్వౌన్నత్యము స్మృతిపథమునఁదోఁచి వారి మనంబులు లయాన్వితము లగును. తిరుపతికొండమీఁది వేంకటేశ్వరవిగ్రహమును అందలి శిల్పసౌందర్యమునుబట్టి హిందువు లారాధించుట లేదు; కాశియందలి విశ్వేశ్వరుఁడును లింగమూర్తియేకదా. ఆ మూర్తులందు నొక దివ్యశక్తి యున్నదని విశ్వసించుటచే, వారి హృదయములు భక్తిభావయుక్తములై లయాన్వితంబులు కాఁగ, వారు వానిని నర్చించుచుందురు. 'ఒథెల్లో' నాటకములోఁ బ్రారంభమున భార్యాభర్తలు సరాగులై యుందురు; తుదకు భర్త తన భార్యను జంపి, తానును నాత్మహత్య చేసికొనును. ఈ నాటకము విషాదాంతమైనను దిదృక్షువుల కానందమిచ్చుటేల? అందలి నాయికానాయకుల జీవితప్రవృత్తి లయాన్వితమైయున్నది కావుననే, ఒక త్రాగుఁబోతు తన భార్యను జంపుచో మన మయ్యోయందుముగాని నాటకీయరసం బుప్పతిలదు. అది యొక శోకవార్తమాత్రమై, కళారచనగాఁ గూర్పఁబడకపోవుటచేత రసోత్పత్తి కందవకాశములేదు; లయ యేర్పడదు. కాని జీర్ణవిజయనగర (హంపి) దర్శనమువలనను, తిరుపతి వేంకటేశ్వర కాశీవిశ్వేశ్వర విగ్రహదర్శనములవలనను అంతశ్చైత

న్యమునందు లయ యుత్పన్నమై యానంద మొదవుచుండును. ఈ నిదర్శనములఁబట్టి విచారింప, లయ బాహ్యవస్తునిష్ఠమయ్యో వ్యక్తి మనోనిష్ఠమయ్యో యుండునని స్పష్టమగుచున్నది.

లయ యననేమో యించుక తెలిసికొందము. "వస్తువిషయములందు నియమబద్ధముగా నుత్పన్నమైన సామరస్యపు సంచలమే లయ. ఇది శిల్పుల చేతియందుఁగల సృజనశక్తి" యని శ్రీరవీంద్రుఁడు నుడువుచున్నాఁడు. జగచ్ఛిల్పియగునీశ్వరునందుఁబోలె సామాన్యశిల్పియగు మానవునందును నీశక్తి * యుండును. ఈశక్తిచేత నీశ్వరుఁడు పుష్పమును, బ్రహ్మాండమును సృష్టించునట్లు, మనుష్యుఁడు చిత్తరుబొమ్మను, మహాకావ్యమును సృష్టించుచున్నాఁడు. పుష్పమువలనను, బ్రహ్మాండమువలనను నీశ్వరుని యనంతక్రియాశక్తి వ్యక్తమగునట్లు, కవిసృష్ట తన రచనలవలన సుందరవస్తుప్రదర్శనముగావించి మానవజీవిత తత్త్వార్థముల నెఱుకపఱచి జీవాత్మపరమాత్మలకుఁ గల సంబంధమును వెల్లడించి సత్యసౌందర్యానందములఁ జేకూర్చును.

విశ్వసృష్టియంతయు భగవంతుని కావ్యమేకదా! ఈశ్వర సృష్టి స్వతంత్రమైనట్లు, మానవుని కళాసృష్టియు స్వతంత్రమే యగును గాని కేవల మనుకరణమగుటలేదు. ఉత్తమమైన కళ సంపూర్ణమైన లయసామంజస్యముం బడసియుండును. రేఖావర్ణసామంజస్యముగల చిత్తరువు దీపకళికవలె, నక్షత్రమువలె

---

* Rhythm is a movement generated and regulated by the harmonious restriction. This is the creative form in the hand of the artist. — Tagore.

నిల్కడగానుండునట్లు కాన్పించినను, దానియందు సంచలనసామంజస్య మమరియుండుటవలన, అది సజీవమై అనఁగా జీవకళ గలదియై యుండును. కళాసామంజస్యము లేని చిత్తరువు జీవకళ-జీవసంచలము లేనిదై యుండును. మానవుని యుచ్ఛ్వాసనిశ్శ్వాసములు, హృదయస్పందము, తలఁపులు మున్నగునవి లయసామంజస్యము గలిగియుండుటచేతనే యతఁడు ప్రాణవంతుఁడై తేజోవంతుఁడై యుండుట. ఈనిదర్శనములంబట్టి చూడ లయసామంజస్యము సకలసృష్టికిఁ దేజమును, జీవమును, క్రియాప్రవృత్తిని, ఉత్తమత్వమును నిచ్చునదై యుండుననుట తెల్లము.

సంపూర్ణమైన లయసామంజస్యము పరుసవేది వంటిది. అది స్పృశించు ప్రతి వస్తువునకును నుత్తమత్వమొసంగి, దానిని దేజోవంతముగాఁ జేయును. మఱి యావస్తువునకును చూపఱయాత్మకును ననుసంధాన మొడఁగూర్చును. ఇట్టి లయసామంజస్యముంబడసి, శక్తిగలిగి, పరిణతిగాంచిన రచనయే కళ. ఇట్టి కళ సత్యమయినది, సుందరమైనది, ఆనందమును విస్తరింపఁజేయునది. ఈ యానంద మొక సంవిద్విశేషము. ఇది ప్రతిజీవియందును బీజావస్థయందుండును. "కళ బీజావస్థయందుండు నానందమును బ్రచురమైన యనుభవావస్థకుఁ దెచ్చి చర్వ్యమాణ మొనర్పఁజాలును." నిజముగా కళ రచయితయొక్క యాత్మసంస్కృతిని నివేదించు నొక రచనావిశేషము. ఈ రచనా విశేషమువలనఁ దలఁపులు సైతము సజీవములై యుత్తమాకృతినిబొంది సాక్షాత్కృతములగుచుండును.

కళ లఱువదినాల్గని మన పూర్వులు చెప్పిరి. ఈ సంఖ్య నానాఁటికి వృద్ధియగుచుండును. చతుష్షష్టికళలలో లేని విమానకల్పన, అణుబాంబురచన, అంతరిక్ష సంచరణ, సమర్థమగు నౌకానిర్మాణము మున్నగువానినిగూడ నీకళలకుఁ జేర్పవచ్చును. ఈకళలను ఫలితకళలనియు, లలితకళలనియు రెండు వర్గములు చేయవచ్చును. ఐహిక వ్యవహారములకుఁ బ్రయోజనపడునవి ఫలితకళలు (useful arts); ఐహికాముష్మిక సుఖదాయకములు లలితకళలు (fine arts). ఈ గ్రంథమందు ఫలితకళల గుఱించికాక, లలితకళల గుఱించియే నుడువుచున్నాము. కావునఁ గళలన్న లలితకళలనియే తెలియవలయును. కవితారచనము, చిత్రలేఖనము, చిత్రరంజనము (painting), గానము, నృత్యము, ప్రతిమారచనము (sculpture) వాస్తు నిర్మాణము – ఇవియే ప్రధానమైన లలితకళలు.

* * *

## 2. కళోత్పత్తి

ఆదిమమనుష్యుఁడు మెఱుములనుగని, యుఱుములను విని యాశ్చర్యచకితుఁ డయ్యెను; అత్యుష్ణ శిలాద్రవమును వెగఁజిమ్ము నగ్నిపర్వతములను, నోరు విచ్చి సర్వమును దిగ మ్రింగు భూకంపములను, కడు గభీరమును నపారమును తిమి తిమింగిల సంయుతంబును నగు మహాసముద్రింబులను, సింహ శార్దూలాది క్రూరజంతు సమాకీర్ణంబులగు మహారణ్యంబులను గాంచి భయోద్విగ్నుఁడయ్యెను. ఇట్లతఁడెంతయు గడు భయం

కరములగు రుజాజరామరణములు తన్ను నిరంతరము వెన్నంటుటను జూచి, యదృశ్యమును, బ్రతికూలమును, బలవత్తరమును నగు శక్తులకుఁ దాను గుఱియగుచుండుటను దెలిసికొనియెను; తనకుఁ గీడుచేయు నీశక్తులను దయ్యాములుగను, భూతములుగను నూహించి, వానిని బ్రార్థించుటకును, నుతించుటకును, పూజించుటకును, మఱి వాని కాహుతులిచ్చి తృప్తిపఱచుటకును గడంగెను. అనఁగాఁ దద్విషయమై పొడమిన భయాశ్చర్యములు వాని చిత్తమున భక్తిభావమును నంకురింపఁజేసెను. భక్తియనునది యొక విధమైన ప్రేమయె కదా! క్రమక్రమముగాఁ దనయందలి యీ యాశ్చర్యరసము బహిఃప్రపంచమును దెలిసికొనుటకుఁ గారణముకాఁగా, పెంపందిన ప్రేమరసము అంతఃప్రపంచమును దెలిసికొనుటకుఁ బ్రేరకమాయెను.

ఆదిమజనులు ఋతుభేదములందలి ప్రకృతి వికార విచిత్రములను గాంచినప్పుడును, ఎడనెడ సంభవించు చంద్రసూర్యగ్రహణంబులం జూచినప్పుడును, సంభ్రమాశ్చర్యములు తమ్ముఁ బ్రేరేపఁగా, వారు చిందులు ద్రొక్కుచు, నియమరహితములును విలక్షణములును నగు పాటలఁ బాడుచుఁ, దమ హృదయోద్వేగమును బ్రకటించుకొనుచుండిరి. ఆ చిందులె నృత్యముగను, ఆ విలక్షణములగు పాటలె గానముగను కాలక్రమమునఁ బరిణతిఁగాంచెను. ఇట్లు కొంతకాలము చనఁగాఁ బలుకుందోడుగ వాద్యములను నిర్మింపఁగలిగి, వారు సంగీతమును కవిత్వమును జేయఁగడఁగిరి. వారు పౌరుష పరాక్రమములు గలిగి వేఁటాడి చంపిన వన్యమృగముల రూపములను దమ

నివసించు గుహాకుడ్యములమీఁద వన్నెలతోఁ జిత్రింపసాగిరి; మఱియు వానిని శిలలందుఁ జెక్క సాహసించిరి. వీనినుండియె చిత్రలేఖనము, చిత్తరంజనము, ప్రతిమారచనము వికాస మొందెను.

మానవజీవితము సుఖదుఃఖాన్వితము. అందు నాదిమ జనుల జీవిత మధిక దుఃఖభాజనంబై యుండెను. వారు గృహములఁ గట్టుటఁ దెలియక, శీతవాతాతపవర్షములకు గుఱియై గిరిగుహాలలో వసించుచు, ఆహారనిమిత్తము జంతువుల వేఁటాడుటకై శిలాశస్త్రములు నిర్మించి, యడవులందును, సముద్రములందును సంచరించి, యెన్నో యాపదలం గుడుచుచు, అగ్నియొక్క యుపయోగము దెలియక పచ్చిమాంసమును, కందమూలఫలములను దినుచు, జంతుచర్మములతోడనె దేహాచ్ఛాదనము చేసికొనుచు, క్రూరజంతువులతోఁబలె ప్రకృతితోడను బోరాడుచుఁ దమ జీవితమును బహుక్లేశముతో నడుపుకొనుచుండిరి.

అడవులలోఁ గార్చిచ్చులకుఁజిక్కి కాలి మ్రగ్గిన మృగాదుల మాంసమును భక్షించి, యది రుచ్యముగా నుండుట గమంగొని, మాంసమును వండుటకై యగ్నిని నుత్పత్తిచేయఁబూనిరి. ఎండుచెట్లకొమ్మల రాపిడివలన నగ్నిపుట్టుటఁ జూచియుండుటచే, వారు శుష్కదారువుల ఘర్షణముచేసి యగ్నిని రవులఁ గొలిపి దాని నుపయోగింపసాగిరి. తరువాత రాళ్ళను మలఁచి తొలిచి పాత్రలఁజేసి యుపయోగింప నేర్చిరి. అటుపిమ్మట బంకమంటితో కుండలుచేయ నభ్యసించి, యా పాత్రలందు మాంసాదులను వండ నారంభించిరి.

దైనందినోపయోగములకు శిలాశస్త్రములను, మృణ్మయపాత్రములను, చర్మవసనంబులను జేయుచుండగా, వారికి దన్నిర్మాణమందు గౌశలము హెచ్చెను. అంత వారికా నిర్మాణకార్యములు శ్రమైకసాధ్యములగు పనులుగా నుండక క్రీడలవలె దోపసాగెను. అంత వారు మఱింత యుత్సాహమును శ్రద్ధనుగలిగి, బుద్ధిని వినియోగించి, తాము నిర్మించు వస్తువులను సుందరతరములుగను, కావలసినయంతకంటె నెక్కువ పరిమాణమునను నుత్పత్తి చేయసాగిరి. ఇట్లు మానవులు దమ యవయవ కండరములను మెదడిని నుపయోగించి, వస్తువులను సుందరతరములుగను, ఆటవలె నవలీలగను జేయుచుండగా, వారి ప్రాణమయ మనోమయశక్తులు (Vital and mental forces) అభివృద్ధి గాంచెను. కాలక్రమమున భాషయు బరిణతిగాంచి, లిపియు నిర్మితమయ్యెను; జనసంఘంబులు నధిక సంఖ్యాకములయ్యెను. అప్పుడొక తెగవారికిని మఱియొక తెగవారికిని బోరాటము లుద్భవంబందెను. అందు బెక్కండ్రు నిహతులగుచుండిరి; తన్నాయకులును ప్రాణములు గోల్పోవుచుండిరి. ఆ యుద్ధములలో ధైర్యశౌర్య పరాక్రమములం బ్రదర్శించిన వీరుల ధీరకార్యములను శాంతిసమయములందు వర్ణించుటకును, అభినయించుటకును జను లుత్సాహపడిరి.

ఈ వర్ణనాభినయములె కావ్యనాటకములకు బీజావాపములయ్యెను. ఇట్లు నాగరికత కొంత వృద్ధియై దీర్ఘకాలము శాంతి నెలకొనినప్పుడు, కళావిదులు ప్రజాసామాన్య సాంసారిక సన్నివేశ సందర్భములను బ్రదర్శించుటకును

గడంగిరి. దీనఁ దమ యాత్మావిష్కరణాభిలాషను దీర్చు కొని ప్రజనుగూడ సంతోషపఱచుచుండిరి. ఇట్లు కావ్యమును, నాటకమును నభివృద్ధిగాంచెను. ప్రప్రథమమున నివి మోటుగా నుండెను. మఱియు కవులు హృదయోద్వేగము తమ్ముఁ బ్రేరేపఁగాఁ దమ యుదాత్త నూత్న భావములను గేయములందును, పద్యములందును గూర్చి గానము చేయసాగిరి; నాటకముల రచింపఁగలిగిరి. ఈ కళారచన యభ్యాసవశమునఁ గ్రీడాప్రవృత్తిగా నగపడి యుత్సాహజనకముగాను, ఆనందప్రదముగాను నుండెను.

యుద్ధముల విడుమరలవలనఁ బ్రజలకును దీర్ఘశాంతి యొదవఁగా, ఆ శాంతి సమయములందు వారు లలితకళలను వర్ధిల్లఁజేసిరి. ఇట్లు విశ్రాంతి యధికముగానుండు శాంతి సమయములందు లలితకళలు వికసించి, జనుల హృదయములను సంస్కరింపఁజాలిన వగుటచే నవి నాగరకతా చిహ్నములై భాసిల్లెను.

శ్రాంతి విశ్రాంతు లననేమి? కామక్రోధాది రాహిత్యమే శాంతి. నిత్య నైమిత్తిక, లౌకిక, వ్యవహార నిర్వహణమునకై యవశ్యము కావలసిన దేహమయ, ప్రాణమయ, మనోమయ శక్తులు వ్యయమైపోఁగా, వాని పునస్సంపాదనమునకై పనిమాని యుండుటయో, యిష్టమైన వేఱుపనినిఁ జేయుచుండుటయో విశ్రాంతి లేక విరామమగును. శాంతి విశ్రాంతులవలన మానవుల శక్తి సామర్థ్యములు నిలువయై, వర్ధిల్లి, యిష్టమైన సృష్టికార్యములఁ జేయుటకవి వారిని బ్రేరేపణ చేసెను. ఉత్సవదినంబుల

లందు శిల్పులు తమ రచనలను బ్రదర్శింపఁగా, జనులు వాని యందలి రససౌందర్యములను నాస్వాదింపఁగలిగి సుఖ సంతోషములం గాంచుచుండిరి.

ఈ సంగతులం బట్టిచూడ కళోత్పత్తి విషయమై తేలిన సిద్ధాంతము లివి :—

1. కళోత్పత్తికి మానవునిలోఁగల భయాశ్చర్య ప్రేమ రసములే మూలకారణములు.

2. లౌకిక ప్రయోజన వ్యవహారములు — అనఁగా నైహిక జీవితావశ్యకములు తీరినతరువాతనే ! జనులకు సుందరమగు బాహ్యప్రపంచముమీఁదను, ఇంపైన భావ ప్రపంచముమీఁదను దృష్టినిలిచి, వారు కళాసృష్టికిఁ గడంగుదురు.

3. ధైర్య శౌర్య సాహసోదారాది కార్యములందు జనులకుండు నభిరతి కళాప్రేరకమై పరఁగును.

4. కళలయందును, నాటకములందుఁబోలె, స్వేచ్ఛ, అభిరుచి, ఆహ్లాదము, ఆత్మావిష్కరణము నుండుటచే, కళలానందదాయకములై యుండును.

5. నాగరకతా చిహ్నములగు శాంతి విశ్రాంతు లొదవినప్పుడే, మానవుని శక్తిసామర్థ్యములు నిలువమై, వృద్ధిపొంది కళాభిరచనారూపముగాఁ బరిణమించును.

6. అభ్యాసవశమున కళాభిరచన క్రీడాప్రవృత్తిగా నగపడి యానందదాయకమై యుండును.

* * *

# 3. కళాభ్యుదయ పరిణామములు

(గానము, అభినయము, నాట్యము, నాటకము.)

ఆర్యులాదిమజనులు కారు; వారు నాగరకులు. వారు సింధునదిని దాఁటి యార్యావర్తమును నాక్రమించుట కెన్నో వేలేండ్లకుఁ బూర్వమే, వేదములు పుట్టినవి. వేదము లపౌరుషేయములని చెప్పుదురు. వేదములను రచించిన వారు సామాన్యమగు మానవ బుద్ధిచేఁ బ్రబోధితులుగాక, యంతరుత్పన్నమగు ప్రజ్ఞానమునకు భగవదనుగ్రహము తోడుపడఁగాఁ బొడమిన దివ్యప్రజ్ఞతో వానిని రచింపఁ గలిగినవారు; వానిని రచించిన మహర్షిబృందము మానవ దేహములతో గోచరించు భగవంతుఁడే యగును కనుకనే వేదము లపౌరుషేయములని ప్రసిద్ధి. వేద ఋక్కులను రచించినవారు మంత్రకర్త లనఁబడక మంత్రద్రష్ట లనఁ బడుదురు.

హైందవార్యు లనాగరకులు గాక ప్రతిభోన్నతులై యుండిరి. ఆర్యశబ్దమె వారి సంస్కృతిని సూచించుచున్నది. వీరు మధ్యాసియానుండి వచ్చినట్లు చరిత్రకారులు నుడువు వారు; 'తిలక్' మహాశయుండు ఉత్తరధ్రువమండలము నుండి వీరు వచ్చిరని వచించువాఁడు. ఎక్కడనుండి వచ్చినను, వీరి సంఖ్య యధికము కాఁగా, శ్రుతిపారంపర్యముగా వచ్చు వేదములనె యాధారము చేసికొని కళలను వికసింపఁజేసిరి. ఋగ్వేదమునుండి సంవాదమును (dialogue) వాద్యమును, యజుర్వేదమునుండి యభినయమును, సామవేదము

నుండి గానమును, అథర్వవేదమునుండి రసమును గ్రహింపఁ గలిగిరి. ఇట్లు తాము గ్రహించిన గీత, నృత్య, వాద్య, గానరసములను మేళవించి, సంగీతవిద్యను గనుఁగొనిరి. మఱి వేదములు ఛందోబద్ధములు. అంతేకాక వేదఋక్కు లందుఁ గవిత్వము గోచరించును. ఇందలి కవిత్వమే యాది లౌకిక కవిత్వమున కాదర్శమై యుద్బోధకమయ్యెను. వేదములందుఁ జిత్రకళా ప్రశంసలున్నవి. కావున హైందవ చిత్రకళాభ్యుదయమునకును వేదములె యాధారభూతములు. వేదములు విరాట్స్వరూపుని నిశ్వాసములు — అనఁగా భగవచ్ఛక్తిస్వరూపములు. కావున సర్వమున కవి యాధారభూతములు. భగవచ్ఛక్తి వలననే యింద్రియములు; ఇంద్రియార్థములగు స్పర్శ, శబ్ద, రూప, రస, గంధములు; మనస్సు, జ్ఞానము, చైతన్యము — సర్వము సముత్పన్నమైన దని హిందువు లంగీకరించుచున్నారు. మఱి హైందవ కళా శిల్పాభ్యుదయమునకు వేదమొ లేక విశ్వకర్మయొ యాధారమని చెప్పినచోఁ బాశ్చాత్య కళాభ్యుదయమున కేది యాధారభూతమని చెప్పవలయును? సర్వమునకుఁ గారణమైన యొకానొక యాదిశక్తియె సకల కళాభ్యుదయ మునకును గారణమని చెప్పుటవలన మనము మూల కారణముంగూర్చి యెక్కువగాఁ దెలిసికొన్నవారమగుట లేదు. అనురాగరసమునఁ దేలుచున్న క్రౌంచ మిథునమం దొక దానిని వ్యాధుఁడు గూల్చినప్పుడు, ఆ దృశ్యముం జూచిన వాల్మీకి హృదయ ముద్వేగయుతమై, ఆ యుద్వేగము

లయాన్వితంబగు * శ్లోకరూపమున బయలువెడలెనను గాథ
గానకవిత్వాభ్యుదయమునకుఁ జక్కని మూలకారణమును
దెల్పుచున్నది. ఈ గాథవలనఁ దేటపడు విషయములను
వేఱు కొన్ని నిదర్శనములం గైకొని వివరింపఁ గడంగెదము.

గానము;- తల్లి యొడిలోని శిశువునకు రంగుల గిలకను
జూపినప్పుడు, అది నవ్వుచుఁ జెంగనలు వెట్టును. ఇంటఁ
దప్పటడుగులిడు శిశువు క్రొత్త కుక్కను గాంచుచోఁ,
భయమున నఱచుచుఁ దల్లి పజ్జకుఁ బరుగిడును. అడవిలో
నెలుఁగుబంటిని గాంచిన బాటసారి దిగులునఁ గెలార్చుచుఁ
బాఱిపోవును. తలుగుఁగొలికి సడలింపఁబడిన దూడ
యుల్లాసముతో 'అంబా' యని యఱచుచు గంతులు వైచును.
రణరంగమున కురుసేనలం గనుఁగొన్న యుత్తరుఁడు గరు
పాఱిన మేనును, దలఁకు మనమును, ఱిచ్చపడిన చూపునునై
తొట్రుపడుచు, దిగులుసొచ్చి బృహన్నలతోఁ, 'దేరు
మరల్పు, ప్రాణములు తీపు' అని నుడివెను. కీచకుఁడు
కావించిన యవమానంబునకు సంతప్త హృదయయగు ద్రౌపది
రాత్రి వంటయింట నిద్రించుచున్న భీమునికడకుఁ జని 'మంద
మంద భాషణంబుల' నతని సంబోధించెను. ఈ నిదర్శనములం
బట్టిచూడ హర్షామర్ష శోక భయాది మనోవికారములు గలిగి
నప్పుడు దేహమందలి కొన్ని కండరంబులు సంకోచించి,
స్వర భేదములను, అంగచేష్టలను గలిగించుచుండుననుట
స్పష్టము. మనసున కుల్లాసము గలిగినప్పుడు మనుష్యుఁడు

* శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః ।
యత్క్రౌంచ మిథునా దేకమ్ అవధీః కామమోహితమ్॥

నప్వును, కేకలువేయును, కేకిసలుగొట్టును; కోపము గలిగి నప్పుడు వాని మోమును నేత్రములును నెఱ్ఱనగును; ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు తీవ్రమగును; గుండెదడ హెచ్చును; కంఠస్వరము బిగ్గరయగును. శోకతప్తయగు స్త్రీ తన రొమ్ము మోదుకొనుచుఁ బనవి పనవి యేడ్చును. భయమువలన వైవర్ణ్యము, వణఁకు, స్తంభము, పలాయనము (Flight), కంఠగద్గదము, స్వేదము గలుగును. ఈ బాహ్యచిహ్నముల కనుభావములని పేరు. ఈ బాహ్యచిహ్నము లన్నియు దేహమందలి కండరచలనముల వలననె కల్గుచుండును. రొమ్మును (chest), స్వరపేటికను (larynx), కంఠనాళము లను గదలించు కండరములు మనోవికార తీవ్రతలం బట్టి సంకోచమందుచుండును. ఈ కండర సంకోచ భేదములం బట్టి ధ్వని యుచ్చ నీచ సమాన స్వరభేదముల నందుచుండును. కావుననే రసభావములు తీవ్రమైనప్పుడు కంఠస్వరముసైతము తీవ్రమగుచుండును. హర్షామర్షాశ్చర్యభయములు గలిగి నప్పుడు ధ్వని యుచ్చగతినొంది మాటలు గట్టిగను, అనునాద యుతముగను (sonorous), కంచు మ్రోగినట్లును వెల్వడు చుండును. రహస్యములు పల్కునపుడు (రహస్యములు పల్కుటయు నొక యావేగవశముననె కావున) ధ్వని నీచగతిని బొంది మాటలు గుసగుసలు వోవును. సామాన్య సంభా షణమునం దెట్టి యావేగమును లేకపోవుటవలన ధ్వని సమాన గతిని బొందియుండి, తత్సంభాషణము శ్రమరహితమై యుం డును. ఉచ్చనీచగతులందు బయలువెడలు వాక్కులు ఆవేశ పూర్ణములై యుండుటవలన శ్రమైకసాధ్యములై యుండును.

ఆవేగమనఁగా మనోవికారము. ఇది కలిగినప్పుడు భాషణము ఉచ్చనీచగతులఁ బొందుచుండునట్లే, రాగము సైతము మనస్సునందుఁ బొడమిన యావేగము ననుసరించి యుచ్చనీచగతుల నందుచుండును. కావున శృంగారాది రసముల కాశ్రయభూతములగు హర్షామర్షాది భావములను బ్రకాశపఱచునదై నియత నియమములతోఁ గూడిన స్వర సమ్మేళనమె గానము. మానవుని యాయా రసభావ ప్రభేదములంబట్టియు, వాని యతిశయములంబట్టియు స్వరము మంద్ర మధ్య తారములనెడి స్థాయిభేదములను, ఆరోహణావరోహణగతులను బొందుచుండును. ఈ స్వరగతి ప్రభేదములె శాఖోపశాఖలుగాఁ బెరిగిన గానవృక్షమునకు బీజాంకురము. ఈ స్వరగతిభేదముల యావిష్కరణము చిత్తావేగమున కనుగుణముగా నుండుట యవశ్యము గావున, గీతము - సుందరపద నిబద్ధమై, ఆ గీతమును బ్రకాశపఱచు రాగ మా గీతమందలి రసభావద్యోతకమున కనురూపమై యుండవలయును. అప్పుడే యది యాహ్లాదజనకమై యుండును. సంగీతమును బ్రేరేచుటకుఁ జాలినంత రస పోషకములుకాని భావములను గీతములందుఁ బొందుపఱచి యట్టి గీతములను బాడఁగడంగుటవలనను, భావములు రస సంవర్ధకములై యుండియు వాని కనురూపములుగాని పదములం గూర్చి గీతము లల్లుటవలనను, నెట్టి ప్రయోజనము నుండదు. ఇట్టి గీతము లస్వాభావికములు గావున నశాస్త్రీయములై, అశాస్త్రీయములుగావున వసమీచీనంబులై యుండును. వైద్య జ్యోతిషాది గ్రంథములందలి శ్లోకము

ల్పిందులకు నిదర్శనములు. అనురూప స్వరభావ సమ్మే
ళనము గలిగి గీయమానములుగ నుండు గేయంబులె
యత్యుత్తమములైనవి.

గానాభినయాది కళలు బహుప్రాచీన కాలమునుండి
మన భారతదేశమునం బాదృతి గాంచుచున్నవి. తుంబుర
నారదులు రంభాద్యప్సరసలు గాననాట్యములం దారితేఱిన
వారలేకదా! అర్జునుఁడు విరాటరాజు తనయయగు నుత్తరకు
నాట్యమును నేర్పినట్లు భారతమునందుఁ జదువుచున్నాము.
మౌర్యుల కాలమందు ఉత్తర హిందూస్థానమున గానాది
కళలు,శిల్పములు, నతిశయించినట్లు, దక్షిణమునఁజోళ పాండ్య
రాష్ట్రములందుఁ దత్సమానకాలమున గానాది కళలు శిల్ప
ములు వెలసియుండెను. ఆంధ్రులు సంగీత నాట్య చిత్రలేఖ
నాది కళలయం దాదరము గలవారని 'గాథాసప్తశతి' లోని
యనేక గాథలు నుడువుచున్నవి. గుప్తుల కాలమున (క్రీ. శ.
330—600) సకల కళలకును నుత్తేజనంబుండెను. సముద్ర
గుప్తుఁడు సంగీత సాహిత్యములందు మిక్కిలి ప్రవీణుఁడై
"కవిరాజు" అను బిరుదు వహించెను. విక్రమాదిత్య, శ్రీహర్షుల
కాలములందును, తరువాత రాజపుత్రుల కాలమందును,
గానాది కళల కాదర ప్రోత్సాహములుండెను. జయదేవుఁడు
'గీతగోవింద' మను గేయ గ్రంథమును పండ్రెండవ శతా
బ్ద్యారంభమున రచించెను. అజంతా సాంచీయందలి చిత్రము
లా కాలమందలి రాజన్యులు సంగీత నాట్యాది కళల కెంత

ప్రోత్సాహము సంగిరో వెల్లడి చేయుచున్నవి. 'శివకవులు' రచించిన 'శివతత్త్వసారము,' 'బసవపురాణము,' 'పండితారాధ్య చరిత్రము,' 'పల్నాటివీర చరిత్రము,' మున్నగు గ్రంథములఁ జదువఁ గాకతీయుల రాజ్యపాలనము నందు సంగీత నాట్యకళల కధిక వ్యాప్తియు, జనాదరణము నుండినట్లు తెలియుచున్నది. 'గురునానకు' (1469-1539) గానము చేయుచు జనులకుఁ బ్రబోధించుచుండెను. శ్రీ కృష్ణదేవరాయల కాలమందును, దానికిఁ బూర్వాపరము లందును, కళలకుఁ బ్రోత్సాహముండినది. రామరాజ భూషణ కవి "సంగీత కళారహస్యనిధి" యై యుండెను. మొగల్ చక్రవర్తులును కళాభివృద్ధికిఁ బాటుపడినవారే. బాబరు కవియు గానకళాభిజ్ఞుడై యుండెను. హుమయూన్, అక్బరు, జహంగీరు పాదుషాలు గాన చిత్ర కళలకు, స్థాపత్యమును మిక్కిలి ప్రోత్సాహించినవారు. ఔరంగజీబొక్కఁడే రాగవిరాగియై యుండెను. షర్షా సైతము గానాభిజ్ఞుఁడై యుండెను. అక్బరు గేయములను దానే రచించి, తానే పాడుచుండెడి వాఁడు. అతని యాస్థానమునఁ బెక్కండ్రు గాయక గాయనులుండిరి. వారిలో తాన్‌సేన్ (ధనసేనుఁడు) ప్రఖ్యాతిగాంచిన గాయకుఁడు. ఇతడు హిందువుగానుండి మసల్మాను మతమును స్వీకరించినవాఁడు. ఇతఁడు గానాలాపనము చేసి మత్తిల్లిన యేనుఁగును సాధుచేయఁగల్గెను; మఱి 'మేఘ

రెంజి,' 'మలయమారుతము' అను రాగముల నాలాపనము
చేసి, మేఘములు గర్జించునట్లును, చల్లగాలి వీచునట్లును
జేయుచుండెనట. అక్బరు కాలమున గానకళాభిజ్ఞురాలును,
భక్తురాలునగు రాణీ మీరాబాయి యుండినది. అక్బరునకు
గాన రసాస్వాదన ప్రీతి యధికముగా నుండినదనుట కీ కథ
నిదర్శనమై యున్నది; అక్బరు చక్రవర్తి యొక సామాన్య
హైందవ పౌరుని వేషము వేసికొని, తన యాస్థాన గాయకుఁ
డగు 'తాన్ సేన్' ని వెంటఁగొని, మీరాబాయి భక్తిగానము
వినుటకై హైందవ దేవాలయమునకు వెళ్లి, యామె పర
వశత్వమునఁ జిలుకు గానరసమును గ్రోలి హృష్టుఁడై, తన
కంఠమందలి రత్నాల సరమును పుష్పమాలతో జేర్చి యామె
దోసిట నిడెనట. పీష్వాల కాలమందును కళలకు వెనుఁబాటు
కలుగలేదు. కర్నాటక గానకళను నభివృద్ధి చేసిన త్యాగయ్య
గారును, బందొమ్మిదవ శతాబ్ద్యారంభమున నుండినవారే.
విదేశీయులయిన యాంగ్లేయుల ప్రభుత్వము వలనఁ గళల
కంతగా ప్రోత్సాహ ముండలేదు. అప్పుడు కళాభివృద్ధి
యంతయుఁ బ్రజలమీఁదనే యాధారపడి యుండెను. 'సినీ
మాలు' వచ్చిన తరువాత జనులకు గానరసాస్వాద నాపేక్ష
యతిశయించి, యిప్పుడిప్పుడు స్వరాజ్యము వచ్చుటవలనను,
'రేడియోల' సంఖ్య హెచ్చుటవలనను, కళోత్సాహము
ప్రబలుచున్నది.

* * *

# అభినయము - నాట్యము

ఉపన్యాసకుల భాషణ ధోరణి వారిచిత్తావేశములఁబట్టి మాఱుచుండును. ఒక ప్రవక్తచేయు నుపన్యాసమును వినుచో, అభిరుచిలేని సామాన్య విషయములం గూర్చి పలుకు నప్పు డతని స్వరము కాల్వయందలి జలమువలె వేగములేక తిన్నగాఁ బాఱుచుండును; ఉదాత్తవిషయములం గూర్చి వక్కాణించినప్పు డతఁడు ఆవేశవ్యగ్రుఁడై యుండి చూపులు దువ్వును; చేతులు దిప్పును; చిందులు ద్రొక్కును; మఱియు నతని కంఠస్వరము ఉచ్చగతినిబొంది, సముద్రమందలి యలలవలె కాలపరిమాణ గతులతో స్పందించు చుండును. ఈ కాలపరిమాణ గతులె యేక, త్రిపుట, రూపకాది వివిధ తాళగతులకు మూలములు. ఈ తాళ గతుల నాశ్రయించి, యభినయమును (కుండలీ, పేరణీ, దండ లాసకాది) నృత్యభేదములును మద్భవించెను.

అవస్థానుకరణమే యభినయము. అభినయము చతుర్విధము. ఆహార్యము, వాచికము, ఆంగికము, సాత్వికము అని. భూషణాదులచేఁ గలిగినది యాహార్యము, వాక్కులచేఁ గల్గినది వాచికము, అంగవిన్యాసముచేఁ గల్గినది యాంగికము, సత్వముచే - రోమాంచాదికముచేఁ గల్గినది సాత్వికము. ఈ చతుర్విధాభినయముల వలన భావార్థములుఁ దజ్జన్య రసంబులుఁ బ్రకటింపఁబడుచుండును. అభినయమునకు లోకమే ప్రమాణము.

నటరాజయిన పరమేశ్వరుఁడు నాటకమునకు మూల పురుషుఁడు. నాట్యకళయందుఁ బ్రసిద్ధులు బ్రహ్మ, మాధవుఁడు, నందికేశ్వరుఁడు, నారదుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, హనుమంతుఁడు, విఘ్నేశ్వరుఁడు, షణ్ముఖుఁడు, రావణుఁడు, బృహస్పతి, అర్జునుఁడు; స్త్రీలలో గౌరి, ఉష, రంభాద్యప్సరసలు, ఉత్తర మున్నగు వారెందఱో యుండిరి.

మన భారత గ్రంథమునుబట్టి చూచినను, సంస్కృత నాటకములఁబట్టి విచారించినను, ఆ యా కాలములందు నాట్యకళకుఁ బ్రోత్సాహ ముండినట్లు తెలియుచున్నది. మధ్యకాలమున నది కొంత యధఃస్థితి గాంచియుండినను, ఇప్పుడు తలయెత్తుచున్నది. వంగదేశమునను, దక్షిణాపథమునను భరతశాస్త్ర ప్రకారము భావ రాగ తాళములతోఁ గూడిన నాటకము వాడుకలో నున్నది. కేరళదేశములో భావ తాళ ప్రధానమైన 'కథాకళి' యను నామమున నాట్యము వెలయుచున్నది. గుజరాతునందు భావ రాగ ప్రధానమైన 'గర్బా' నాట్యమునం దెక్కువగా స్త్రీలే పాల్గొనుచున్నారు. వీరు రాసక్రీడ, గోపికా వస్త్రాపహరణము మున్నగు మధురరస కల్పితములైన విషయములను గూడ నభినయించి, శృంగారరస మొలికింపఁ జేయుచుందురు. అస్సాములో రాగతాళములంతగా లేక భావము మాత్రము ప్రధానముగాఁగల మణిపురావృత్తము వ్యాప్తిలో

నున్నది. ఇందు మూకాభినయ మెక్కువగా నుండును, గాన నిది యధికతర భావనాశక్తి నపేక్షించునదై యున్నది; ఈ నృత్యము కేవల సాంకేతికమై యుండును. కోయలు, ఎఱుకలు, లంబాడీలు, బోయలు, కాఁపులు మున్నగు గ్రామ్యజనులు పండుగలందును, పెండ్లిండ్లయందును తేరుతిరునాళ్ల యందును కోలాటము వేయుచు, చిందులు త్రొక్కుచు, పాటలు పాడుచుఁ, దమ నాట్యాభిలాషను నావిష్కరించుచుండుట మనము చూడఁగలము.

మన దేశమందలి వంగ మహారాష్ట్రాది ప్రాంతములలో నాట్యము గౌరవదృష్టితోఁ జూడఁబడుటచేత సత్కులీన బాలికలు, నవయువతులు నాట్యకళాభ్యాస కుతూహలాయత్తచిత్తలై యున్నారు. పురుషులు యనేకులున్నారు. వీరిలోఁ బలువురు భరతనాట్యశాస్త్రాభిజ్ఞులేగాక, అజంతాలోని నృత్యచిత్రములను, లోకమును గమనించి, తమ నాట్యకళను నభివృద్ధి చేసికొన్నవారయి యున్నారు. వీరు గాన సమ్మిశ్రితమగు నాట్యముతోడనే రమణీయముగా భావప్రదర్శనము చేయఁగలుగుచున్నారు.

ఆంధ్రదేశము నాట్యకళాభివృద్ధియందుఁ జాల వెనుకఁబడియున్నది. ఆంధ్రజనుల దృష్టి నాట్యకళమీఁద నింకను బోకుండుట చింత్యము. విద్యాశాలలలో బాలికలకు నాట్య

కళను నేర్పఁబూనుట యత్యావశ్యకము. ఇటీవల బాలికా పాఠశాలలందు నాట్యకళ కొద్దిగా బోధింపఁబడుట శుభ సూచకము,

నాటకము :-

గానమును, సంవాదమును, అభినయమును, అనుకృతిని మేళవించి, వానిని సాహిత్య సూత్రములకుఁ బొందుపఱచి కవులు నాటకములను రచింపఁ గల్గిరి. అనఁగాఁ బ్రత్యేక కళలై యున్న సంగీతము, నాట్యము, కవిత్వము నభివృద్ధి గాంచినప్పుడు అవి యొక్కచోఁ గూర్పఁబడగాఁ నాటక మాయెను. సంస్కృత నాటకములు, గ్రీకునాటకములతో సంపర్కమునఁగాక స్వతంత్రముగనే యుద్భవించినవని 'బాబు శ్యామసుందరదాసు' మొదలగు పండితుల యభిప్రాయమై యున్నది. 'అమృత మంథన' మను నాటకమును దేవత లాడిరఁట. కంసవధ. వాలంబవధ, చాణూరమర్దనము అను నాటకము అప్సరసలచేఁ బ్రదర్శింపఁబడినవని 'పతంజలి' చెప్పుచున్నాఁడు. క్రీస్తుపూర్వము నాల్గవ శతాబ్దికిఁ బూర్వ ముండిన భరతముని తన నాట్యశాస్త్రములో నాట్యరంగ మును, దానికిఁ గావలసిన యుపకరణములను రచించు పద్ధ తులను వచించినాడు. 'పాణిని' 'శిలాలి' కృశాశ్వులను నాటక కర్తల పేళ్లను నుదాహరించి యున్నాఁడు. కనుక భార తీయ రూపక రచనాసరణి పాణిని పతంజలుల కాలము నాఁటికే, యనఁగా క్రీ. పూ. రెండవ శతాబ్దియందు సంపూ

ర్ణ ముగ నేర్పడియుండెను. శ్రీ పురాణము సూరిశాస్త్రిగారు తమ 'నాటకోత్పల' మం దిట్లు నుడువుచున్నాఁడు. "మహావీర స్వామికి రెండువందల సంవత్సరముల పిదప నివసించిన 'భద్రబాహు' స్వామి రచించిన కల్పసూత్రములలో నీక్రింది కథను నుదాహరించి యున్నాఁడు. ఒక సాధుశిష్యుఁడు గురుసన్నిధానమున కాలస్యముగఁ జేరెను. ఏల నీ జాగని గురు వడుగ, 'దారిలో నాట్యావలోకమునఁ గొంత తడవయ్యె' నని యంతేవాసి సమాధాన మిచ్చెను. అందున గురువు నటులు ప్రయోగించెడి నాటకాదులను సాధకులు చూడఁ గూడదని వారించెను. మఱియొకసారి యిటులనే నటీప్రయుక్త రూపకమవలోకించి కాలయాపన మొనర్చి వచ్చిన శిష్యుఁడు, నటప్రయుక్తమైనను, నటీప్రయుక్తమైనను, మానవ విలోకనము సాధువులకు గర్హ్యమగునని వారింపఁబడెను. ఈ సంగతులంబట్టిచూడఁ క్రీస్తు పుట్టుట కనేక శతాబ్దులకుఁ బూర్వమే యార్యావర్తమున నటీనట ప్రయుక్తములగు నాటకములు వీధులలో నాడఁబడుచుండెనని తేలుచున్నది.

నాట్యము, చిత్రరచన, సంగీతము మున్నగు కళల యందు గౌతమబుద్ధున కభిమానముండినట్లు, 'లలితవిస్తార' మను బుద్ధ జీవిత చరిత్రమందుఁ జెప్పఁబడినది. బుద్ధుని సమకాలికుఁడగు బింబిసారుని యెదుట నొక దాక్షిణాత్యుఁడు బుద్ధుని జీవిత నాటకమును బ్రదర్శించినట్లు తెలుపఁబడి యున్నది. శోభావతీ నగరాధీశుని సమక్షమునఁ గూడ

బుద్ధనాటకము ప్రయోగింపఁబడినట్లు క్రీ. శ. 300 వర్షమున నా భాషలోఁ బరివర్తింపఁబడిన 'అవదాతీ' శతకములో వ్రాయఁబడినట్లు తెలియుచున్నది. తరువాత భాస (క్రీ.పూ. నాల్గవ శతాబ్ది), సౌమిల్ల, కవిపుత్రులు నాటకములు రచించిరి. భాసుని నాటకము లిటీవల దొరికినవి; ఇవి తెనిగింపఁబడినవి గూడ. సౌమిల్ల కవిపుత్రుల నాటకము లెందైన నున్నవో, అలభ్యమై పోయినవో కాలము చెప్పవలసియున్నది. భాసాదుల పిదప కాళిదాస భవభూతులు తమ యతిశయ కౌశలముతోఁ కథాకల్పనా చమత్కృతియు, రసభావపుష్టియు, పాత్రౌచితియుఁగల నాటకములు రచించిరి. కాళిదాసుని మూఁడు నాటకములలో నుత్తమమైనది శాకుంతలము. ఇందు మర్త్య స్వర్గలోకములు రెండును జోడింపఁబడి, సన్నిహితమొనర్పఁబడినవి. ఈ నాటకముం జదివి 'గీటే' యను జర్మనీదేశపుఁగవి యానందము పట్టలేక నాట్యము సల్పెను. ఇందుఁ గరుణరసము చిప్పిలు పద్యములుండి, యది శిలనైనను గరగింపఁజాలును. కాళిదాసకవి నాల్గవ శతాబ్దినో, అంతకుఁ బూర్వమునో యుండెనని యందురు. భవభూతి యెనిమిదవ శతాబ్దిని రచించిన మూఁడు నాటకములలో 'నుత్తర రామచరిత' శ్రేష్ఠమైనది. శూద్రకుఁడు భాసుని 'దరిద్ర చారుదత్త' మను నాటకము ననుసరించి 'మృచ్ఛకటిక' నాటకమును రచించెను. ఇతఁడు కాళిదాసుని కంటెఁ బ్రాచీనుఁడని కొందఱు చరిత్రకారులు నుడువు

చున్నారు. ఈ 'మృచ్ఛకటిక' కాళిదాస భవభూతుల నాటకములకంటె విలక్షణమైన కథాచమత్కృతి కలిగియున్నది. క్రీస్తుశకపు ఏడవ శతాబ్దపువాఁడగు శ్రీహర్ష మహారాజు 'ప్రియదర్శిక,' 'నాగానందము,' 'రత్నావళి' యను నాటకములను రచించెను, ఇవి కాళిదాస భవభూతుల నాటకములవలె మిక్కిలి ప్రౌఢములు గాకున్నను స్వాభావిక వర్ణనలు గలిగి కొంత గౌరవము నరసియున్నవి తొమ్మిదవ శతాబ్దిని భట్టనారాయణుఁడు 'వేణీసంహారము' ను, విశాఖదత్తుఁడు 'ముద్రారాక్షసము' ను రచించిరి. ఇవియు నూతన మార్గమును ద్రొక్కినవే. ముద్రారాక్షసమున స్త్రీపాత్రయే లేదు. అటుతరువాతఁ బదియవ శతాబ్దిని రాజశేఖరుఁడు 'కర్పూరమంజరి,' 'బాలరామాయణము,' 'బాలభారతము' అను నాటకములను; పదునొకండవ శతాబ్దిని 'కృష్ణమిశ్రుఁడు' ఆధ్యాత్మిక విషయమైన 'ప్రబోధ చంద్రోదయ' నాటకమును, పదుమూఁడవ శతాబ్దిని 'జయదేవుఁడు,' 'ప్రసన్న రాఘవ' మను నాటకమును రచియించిరి. ఇవియె సంస్కృతమందుగల ప్రసిద్ధ నాటకములు.

పదుమూఁడవ శతాబ్దికివల ముసల్మానుల రాయిడికిఁ గాబోలు నాటక ప్రయోజనము లడుగంటెను. దీనిఫలముగా హిందూదేశమున నాటకరచన విరళమయ్యెను. కాని కాశీ ప్రాంతముల 'రాసలీల' అను పేరితోడను, వంగదేశమున 'యాత్ర' అను నామముతోడను, మహారాష్ట్రమున కీర్తన

లను నభిదానముతోడను, ఆంధ్రదేశమున 'భాగవత' గాథలను నామధేయము తోడను, శ్రీకృష్ణ చరితలను, భాగవత కథలను బ్రదర్శింపసాగిరి. ఇందు ముద్రాభినయము, తాళప్రస్తరణము, నృత్యము ప్రధానాంశములు. జనులీ ప్రయోగములఁ జూచి యానందించు చుండువారు. ఈ నాటక ప్రయోగములు 'కూచిపూడి భాగవతము' అని యాంధ్రదేశమున వెలసినవి. ప్రాచీన సంస్కృత నాటకములు, నాటక రంగములఁ బ్రయోగింపఁబడక, పఠనీయములుగ మాత్రముండినవి. కాని యాంగ్లేయుల సంపర్కమువలన మనదేశమున నాంగ్ల విద్య ప్రబలఁగా, సంస్కృతాంగ్ల నాటకములను నాదర్శములుగాఁ గొని కవులు తమ దేశభాషలలో ననేక రూపకములను నిటీవల రచియించి వానిని బ్రయోగింపఁదొడంగిరి.

సంస్కృతమందలి రసవన్నాటకములన్నియు నాంధ్రభాషలోనికి ననువదింపఁబడినవి; కాని స్వతంత్ర నాటకములు తెనుఁగునఁ బందొమ్మిదవ శతాబ్ది తుదివఱకు నుద్భవం బందలేదు. 'ఆంధ్రవాఙ్మయ సంగ్రహము' పెక్కు ప్రాచీన స్వతంత్ర నాటకముల పేళ్లను నుడివి కొన్నిటిని నుదాహరించుచున్నది. కాని యవి 'యక్షగానము' లై యుండి, రూపకములని పేరెన్నికఁగన్నవి కావు. పాత్రపోషణము, కథాసంవిధానముఁ గల్గినచరిత్ర రసవన్నాటకము లుండిన నవి యెందు దాగియున్నవో! సంస్కృతమందలి 'ప్రేమాభిరామము' న

కనుకరణమైన 'క్రీడాభిరామ'మను వీధినాటకమొండు తెనుఁగునఁ గలదు. ఇది శ్రీనాథుని సమకాలికుఁడైన తిరుకొండ వల్లభరాయ కృతముగాను, పదియేనవ శతాబ్ద్యారంభమున రచింపఁబడినదై యుండును. ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్రనాటకముగాఁ దలపఁబడుచున్నది. పందొమ్మిదవ శతాబ్ద్యంత్యమున శ్రీ ధర్మవరము రామకృష్ణకవియు, శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారును నాంధ్రమున స్వతంత్ర నాటకములను రచించిరి. అందు మొదటికవి 'ఆంధ్ర నాటక పితామహుఁ' డను బిరుదమును సార్థకముగఁ బడయఁగలిగెను. అటుతరువాతఁ దెనుఁగునఁ బలునాటకము లుత్పన్నములాయెను. కాని పరిష్కృతము 'సినీమా' లనఁబడు వాక్సహిత చలనచిత్రములు ప్రబలి నాటక ప్రదర్శనమునకును, నాటక రచనమునకును బ్రతిబంధకములై యున్నవి.

## 4. కళాభ్యుదయము పరిణామములు - చిత్రకళ, స్థాపత్యము, కావ్యము.

హైందవార్యులు సింధూనదిని దాఁటి, సింధు - గంగా మధ్యభూభాగమును బ్రవేశించినప్పుడు, అది యరణ్యమయమై యుండెను. అక్కడ నమ్మహానదులును, వాని యుపనదులును, నల్లిబిల్లిగా నల్లుకొనియుండుటను ఉత్తర దిగ్భాగమున హిమాచ్ఛాదితములగు నుత్తుంగ పర్వతశ్రేణులు రమణీయ

ములై పెట్టనికోటలై యుండుటను గాంచి వారాకృష్టులైరి. ఆ ప్రదేశములందలి ప్రకృతి సౌందర్యము వారి కానందప్రదమై యుండెను, వారి జనసంఖ్య వృద్ధికాఁగా, వారు అరణ్యములం గొట్టి, బయళ్లేర్పఱచి, సూర్యచంద్రాతప ప్రసారమున కవకాశము గలిగించి, పెక్కు ఋష్యాశ్రమముల నిర్మించిరి: గోవులమందలం బెంచిరి. కృషిచేసి సస్యాభివృద్ధి గావించి ఉదరపోషణము చేసికొనఁగలిగిరి. హిందూ ఆర్యులు నాగరకులగుటవలనఁ బ్రకృతిని, ప్రపంచమందలి సర్వస్వమును స్వల్పకాలభంగురమనియు, పరిణామవిశిష్టమనియు, నశ్వరమనియుఁ దెలిసి, తమలో భాసిల్లు నాత్మచైతన్యమొక్కటే శాశ్వతంబనియు గ్రహించి, నశ్వరమగు బాహ్యప్రపంచమును శాశ్వతమగు నాత్మప్రపంచములో సమన్వయము చేసి, బాహ్యప్రపంచమందలి శోభావిలాసంబులను స్థిరముగా భావనయందు ననుభవించుటకుఁ బ్రయత్నించిరి; ఇంతేకాక యంతఃప్రపంచమందుఁ బొడమెడి సుఖదుఃఖాది భావములయొక్కయు హర్షామర్షాదిగాఁగల యావేశములయొక్కయు రసనుభవము స్థిరముగా భావనయం దనుభవించుటకును బ్రయత్నించిరి. ఈ బాహ్యాభ్యంతరమందలి యీ సౌందర్య రసానుభూతికిఁ, జిరస్థాయిత్వ మిచ్చుటకు మహాత్ములు పేర్మోద్విగ్నులై చేసిన గభీరప్రయత్న ఫలములే చిత్రలేఖనము, చిత్రరంజనము, శిలాతక్షణము, కవితారచనము, రసాభిజ్ఞులకు సౌందర్యానుభూతి గల్గినప్పుడు, తదనుభూతి యాత్మావిష్కరణ ప్రేరకమగుట సహజమే కదా.

## చిత్రకళ — స్థాపత్యము

చిత్రలేఖనము, చిత్రరంజనము (Painting)) స్థాపత్యము:— స్థాపత్యమనఁ బ్రతిమా రచనము, గృహ దేవాలయాది వాస్తునిర్మాణము. ఇవి పరికర సాధనములు, కవిత్వము యొక్కయు, గానము యొక్కయు, నాట్యము యొక్కయు సాధనములు, స్పర్శవేద్యములుగానివి (Intangible); కావున నమూర్తములు. చిత్రలేఖనమునకు లేఖినియు, మసియు, కాగితమో, పటమో, పలకయో కుడ్యమో కావలసియుండును. చిత్రరంజన చిత్రలేఖనములు సమతలముమీఁదఁ జిత్రింపఁదగినవి. ఇవి శాశ్వతముగా నిలుచునవిగాక, కాలక్రమమున మాసిపోవునవి. స్థాపత్యమునకు ఘనపరిమాణముగల శిలాలోహ దార్వాదులు కావలసియుండి, యివి యులితోఁ జెక్కఁబడి తీర్పఁబడుచుండును. దారుప్రతిమలు శిలాలోహప్రతిమలవలెఁ జిరకాలముండవు.

చిరకాలమునుండి మనకుఁ జిత్రకళయం దభిరుచి గలదు. స్త్రీల వస్త్రముల యంచులుఁ, జెఱఁగులు హంసాదుల చిత్రములతో నలంకరింపఁబడుచున్నవి. గృహప్రాంగణములందు స్త్రీలు చిత్రవిచిత్రములగు రంగవల్లులం దీర్చుచుందురు. మనపాత్రలు వివిధాకృతులుగలవై, చిత్రితములై, సుందరములై యుండును. సంస్కృతాంధ్ర గ్రంథములందుఁ బలుతావులందుఁ జిత్తరువుల సౌందర్యచర్చ

లున్నవి: ఉషాకన్య తనకలలోఁగాంచిన వరుని వర్ణింపఁగా, ఆమె చెలికత్తెయగు 'చిత్రరేఖ' యా వరుని రూపమును చిత్రింపఁగలిగినది. భారతమునందలి మయసభావర్ణనముం జదువఁ బ్రాచీన కాలపుఁ జిత్రకళా స్థాపత్య నైపుణ్యము భాసము కాఁగలదు. భారతమందు మయసభా వర్ణనము 'నన్నయ' యిట్లు గావించినాఁడు :—

సీ॥ సురుచిర హరినీల కిరణజాలంబులఁ
బద్మరాగారుణ పద్మములను,
రాజిత రాజీవ రాజహంసావళి
నిర్మల సౌవర్ణ కూర్మములను,
కమనీయ వైడూర్య కుముదంబులను వజ్ర
మీన మౌక్తిక నవఫేనములను,
మరకత శైవలోత్తరముల విలసిల్లఁ
గొలనని సన్మణిస్థలము సూచి

ఆ॥వె॥ పలుఁగురాల కుడ్యముల రుచుల్ గప్పిన
జలములున్న యెడలు వెలయఁజూచి
యననుపస్థలంబయని జనులెఱుఁగక
యుండునట్లుగా మయుండుచేసె."

ప్రప్రథమమున నాదిమ చిత్రకారులు ప్రకృతిని నున్నదున్నట్లే చిత్రింపఁగడంగిరి. ఏలన నమకరణము ప్రాణికి సహజము. అందున మనుష్యప్రాణి యనుకరణమును

రూపకల్పనగా మార్చి, సృష్టికిఁ బ్రతిసృష్టి చేయఁగలిగెను మఱియు విశాలమగు ప్రకృతి దృశ్యమును పరిమిత స్థలములో సర్వవివరములతోఁ జిత్రించుట వానికి సాధ్యముకాని దయ్యెను. ఒకవేళ సంపూర్ణ వివరములతో వాఁడు చిత్రింపఁ జాలినను, నా చిత్తరువు సువిస్పష్టతలేక యస్తవ్యస్తమై యుండెను; అది దృష్టికవబోధముగను, హృదయంబున కింపుగను లేకుండెను. అట్లగుటఁ జిత్రకారుఁడు చిత్రణములను జిత్రించుచోఁ బ్రకృతిని నున్నదున్నట్లుగాఁ జిత్రించుట మాని, భావప్రదర్శనమునకుఁ గావలసిన కొన్ని దృశ్యవిషయములను మాత్రము, తన బుద్ధిని నుపయోగించి, యేరికొని, వానినె ప్రదర్శింపఁ బూనెను. మనుష్యరూపమును జిత్రించునప్పుడును, శిల్పి వాని యాంతరమును సూక్ష్మదృష్టితోఁ బరిశీలించి, గ్రహించి, వాని మనఃస్థితినిబట్టి వాని ముఖమునఁ గనుపట్టు మార్పులను గమనించి, వాని స్వస్వరూపమును చిత్తరువున నాలిఖింపఁ గడంగెను. ఇట్లు చిత్రింపఁబడిన చిత్తరువులు జనులకు సులభావబోధములుగను, హృదయరంజకములుగను నుండెను. ఇట్టి చిత్తరువులఁజూచి కవులును హృష్టులై, సృష్టికిఁ బ్రతిసృష్టి చేయుటకాని, సృష్టిని ననుకరించుటగాని నిజమైన కవిత్వము కాదనియు, బాహ్యావృత్తములందము యాత్మానుభవముతోఁ జేర్చి యావిష్కరించుటయే నిజమైన కవిత్వమనియుఁ దెలిసికొనఁగలిగి, యట్లె కవితారచన చేయఁగడంగిరి.

ప్రాచీనార్యుల కాలమునాఁటి శిలా శిల్పములేమియు నిప్పుడు కన్పడవు. భాసరచిత 'ప్రతిమానాటకము'ను బట్టియు, భవభూతి కృతమైన 'యుత్తరరామచరిత'ను బట్టియు జూడ, రామాయణ కాలమునాఁటికె మూర్తిశిల్పము, చిత్రకళ, యుండినట్లు తెలియుచున్నది. సింధుదేశమందలి 'మొహింజా దారో'ప్రదేశము త్రవ్వబడినప్పుడు దొరకిన వస్తువులను, ముద్రికలను బట్టి పరిశీలించిన, ఆ కాలమందలి (క్రీ॥ పూ॥ 5000) జనులు చిత్రితరమణీయ మృణ్మయ పాత్రలను, వెండిబంగారు భూషణములనువాడుచుండినట్లును, గజాశ్వములుగలిగియుండు నట్లును దెలియుచున్నది. వీరార్యులుకారు. భరతవర్షమును నాక్రమింపవచ్చిన యార్యులు వీరికంటెఁ బ్రాచీనులు. ఆర్యులు క్రమక్రమముగా వింధ్యాద్రులను దాఁటి దక్షిణప్రాంతము లకు దిగిరి. ఇట్లు దక్షిణమునకు వచ్చిన యార్యులలో అగస్త్య ముని మొదటివాఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడయ్యు విదర్భ రాజతనయ యగు 'లోపాముద్ర'ను వివాహమాడి, భార్యా సమేతుఁడై, బహుశిష్యగణ పరివారముతో దక్షిణమునకువచ్చి, యందు ఆర్యసంస్కృతిని వ్యాపింపఁజేసెను. అగస్త్యుఁడు 'సకలాధికార'మను వాస్తు శిల్ప విషయక గ్రంథమును రచించి నట్లును, తమిళభాషకును, దాని లిపికిని మూలపురుషుఁడై నట్లును చెప్పుదురు. దక్షిణమందప్పుడు పాలించుచుండిన పాండ్యరాజతని ప్రోత్సాహమునఁ గొన్ని శివాలయములు నిర్మించినట్లు తెలియుచున్నది. అగస్త్యుఁడు 'కాంభోజము'

నకుఁ (Combodia) బోయి, యందును కొన్ని శివాలయములు నిర్మించి, యటనుండి 'శ్యామ' దేశమునకు (Siam), 'బర్నిాణ ద్వీప'మునకును(Borneo), కుశద్వీపమునకును, వరాహద్వీపము నకును, శ్యాక్యద్వీపమునకును (ఇవి 'శుండా' ద్వీపసమూహ ములోనివి కాబోలు)బోయినట్లును తెలియుచున్నది. 'సుమత్రా,' 'జావా'ద్వీపములందును శివాలయములె కాక, అగస్త్యాలయ ములు నున్నవి. వీనినిబట్టి చూడ అగస్త్యుఁడు కాకపోయినను అగస్త్య గోత్రజులా ద్వీపములకు వలసపోయి యందువెలసి నట్లు తోఁచుచున్నది. అగస్త్య విగ్రహములు శివగురుఁడను పేరనో, భట్టారకగురుఁడను పేరనో నేఁటినికిని పూజలందు చున్నవి. జావా ప్రాగ్భాగమున నుండు నగస్త్యవిగ్రహమును, ఆతని శిష్యుఁడగు 'తృణబిందు'ని విగ్రహమును మిక్కిలి సుం దరముగా నున్నవని చెప్పుదురు. ఇట్లులార్యసంస్కృతి యార్యా వర్తమునుండి తరలి దక్షిణ ప్రాంతములకును, కాంభోజ, శ్యామ చంపామలయాది దేశములకును, సుమిత్రా, జావా, బోర్నియో మున్నగు నతి ప్రాచ్య ద్వీపములకును ప్రాఁకి యందు విరాజిల్లెను.

సంస్కృత నాటకములంబట్టి విచారించిన, గాన చిత్ర కళలకుఁ బ్రాచీనకాలముననే యాదరప్రోత్సాహము లుండి నట్లు తెలియుచున్నది. అవంతిదేశపు రాజగు ప్రద్యోతుఁడు తన కుమార్తెయగు వాసవదత్తను, యువకుఁడును గానవిద్యా ప్రవీణుఁడును వత్సదేశపు రాజుమనగు నుదయనునకిచ్చి

పెండ్లి చేయ సంకల్పించుకొని, మాయోపాయముచేత వత్స రాజును బట్టించి, తన రాజధానియగు నుజ్జయినికిఁ దెప్పించి, సుందరియగు వాసవదత్తకు సంగీతమునునేర్పుమని యామెను నాతనికొప్పగించినట్లును, ఆమె కాతఁడా విద్యను నేర్పి వీణా వాదనమందును నిపుణురాలిఁగా జేసి వివాహమాడినట్లును, 'ఘోషవతి'యను పేరుగల యావణియ నామె వడసియుండి నట్లును, భాసరచితమగు 'స్వప్నవాసవదత్త' యను నాటకము వలనఁ దెలియుచున్నది. మఱియు కాళిదాసుని 'శాకుంతల', 'మాళవికాగ్నిమిత్ర' నాటకములందును, భవభూతి కృత మగు 'మాలతీమాధవీయ' మందును, శ్రీహర్షుని 'రత్నావళీ' 'నాగానందము' లందును, వేఱుకొన్ని గీర్వాణ నాటకము లందును నాయకులు, నాయికలు, వీరి చెలికత్తెలు గాన చిత్రి కళలందు నిపుణులై యుండినట్లు గోచరించుచున్నది.

అశోకునికిఁ బూర్వము రచింపఁబడిన శిల్పము లింత దనుక నిలిచియున్న వేవియు లేవు. కాశీ సమీపమందలి 'సారనాథు' నందలి సింహ చిత్రములు గల స్తంభము, 'బారబారు' గుహాకుడ్యముల యద్దపు నున్నఁదనమును నేఁటికిని జూపఱ కాశ్చర్యము గొలుపుచున్నవి. 'కనిష్కుఁడును,' నతని పుత్త్రుఁడగు 'హువిష్కుఁడు'ను (క్రీ॥ శ॥ 120-162) 'పేషావరు' నందును, 'తక్షశిల' యందును, 'అమరావతి' యందును, 'సాంచి' యందును బౌద్ధమ తములను, స్తూపములను, హిందూగ్రీకు సంపర్కమువలన

నేర్పడిన గాంధారశైలిని, పెక్కింటిని నిర్మించెను. అమరావతీ స్థూపచిత్రములు కడుమనోహరముగా నున్నవి. బౌద్ధరాజులనేక దేవళములను, స్తూపములను, రాజమందిరములను గట్టించినందున, శిల్పులకుఁ దమ నైపుణ్యముం జూపుటకు సమయము దొరకెను. 'నాగ్నజిత్తుఁ' డనువాఁడు శిల్పమును గుఱించి యొక గ్రంథమును వ్రాసెను. ఈ గ్రంథమందు మందిరములను గట్టుటను గుఱించియు, విగ్రహ రచనమును గుఱించియు, చిత్రపటములను వ్రాయుటను గుఱించియు, చెప్పఁబడియున్నది. * 'కార్లీ' యందలిచైత్యమండపములును మనోహరములయియున్నవి. 'కుషానుల' తరువాత 'స్వర్ణయుగము' నాఁబరఁగు 'గుప్తుల'యుగమారంభమాయెను. గుప్తరాజు (క్రీ. శ 320—490) బ్రాహ్మణమతమును వర్ధిల్లఁజేసిన పరమ భాగవతులు. వీని కాలమునఁ గళలకుఁ జాలినంత విజృంభణముఁ గలిగెను. కావ్యములు, నాటకములు, చిత్రకళ, శిలాతక్షణము వాస్తువిద్యయుఁ మఱి గణిత, జ్యోతిషశాస్త్రములు కభివృద్ధిగాంచెను. 'నలందా' విశ్వవిద్యాలయము స్థాపించినవాఁడు ప్రథమ కుమారగుప్తుఁడు (427). ఆ కాలమందా విశ్వవిద్యాలయము "చిత్రిత గోపుర పఙ్క్తిచేతను, కోటకొమ్ములచేతను, మనోహరమై, మేఘచుంబిత నక్షత్రశాలలచే మహనీయమై, శీతలచ్ఛాయ

---

* శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి 'హిందూదేశకథాసంగ్రహము' ప్రథమ భాగము : పుటలు 154-155.

లీను తరువాటికలచే సుభగమై, కలువము నెత్తామరలుఁ గలిగి, ప్రకాశమానమగు కొలంకులచే నుల్లసితమై, పలు వన్నెల వల్లభులుగలిగి, పయికప్పులు వింత చాయలనీను నోడుబిళ్ళలతోఁ గప్పఁబడి, దిదృక్షువులకు నానందప్రదమైయుండెను." సముద్రగుప్తుని కాలమున (౩౬౦) నిర్మింపఁబడిన యినుపకంబ మిప్పటికిని తుక్కుపట్టక ఢిల్లీలో నలరారుచున్నది. ఇది యిరువది యడుగుల యెత్తును, పందొమ్మిది టన్నుల బరువును కలిగియున్నది.

భారతతీయ కళాస్రష్టలు తమ యంతఃప్రవృత్తిచేఁ నడుపఁబడినవారయి, కళారచనమునకు రూపభేదము, ప్రమాణము, భావము, లావణ్యము, సాదృశ్యము, వర్ణికాభంగిమమునవెడి షడంగములు అత్యావశ్యకములని యెఱుఁగఁ గలిగి, వానిని నాధ్యాత్మిక పరిచర్యకొఱకై యావిష్కరింపసాగిరి. అజంతా గుహాలయములు చిత్రకళా ప్రశస్తిగలిగి, ప్రాచీన నాగరకతాచారములను, ఆధ్యాత్మిక ప్రవృత్తిని బ్రదర్శింపఁ జాలియున్నవి; మఱియు నవరసరంజులనేకాక భక్తిరసమును గూడ సమకూర్చఁజాలినవై యున్నవి. శ్రీ కె వి. లక్ష్మణరావుగారు వీని విషయమై యిట్లు నుడువుచున్నారు : "ఇట్టి విహారములలో ముఖ్యముగా మధ్య నొక్క విశాలమైన కూటమి (hall)యు, నందుఁ జక్కఁగాఁ జెక్కఁబడిన స్తంభములును, వాని వెనుక భిక్షు నివాసమునకై చిన్న గుహలును నుండును. అజంతా విహారములలో గోడ

లపై బుద్ధుని జీవితములోని కొన్ని ప్రసంగములను, బౌద్ధా చార్యుల చరిత్రలను సూచించునట్టి చిత్రములును చెక్కఁ బడియున్నవి. అందలి స్త్రీ పురుషుల ప్రతిమల యొక్క ముఖవికాసములు సత్త్వవృత్తిని సూచించుచు, ఆహ్లాదజనక ములై యుండును. ఇందుఁ గొన్ని (IX, X) గుహాలయ ములలోని చిత్రములు కుషానుల కాలమునాఁటివని చెప్పు దురు." శ్రీహర్షుని (హర్షవర్ధనుని) కాలమున, నేడవశతాబ్దిని, గళలకుఁ గడుఁ బ్రోత్సాహముండెను. తరువాత నెన్మిదవ శతాబ్దిని శైవులగు చాళుక్యుల కాలమున 'బాదామి' మొదలగు స్థలములందు సుందరములగు దేవళములు నిర్మింపఁబడెను. 'మద్రాసు' సమీపమందలి మహాబలిపురములోని చిత్రిత శిలా రథములను నిర్మింపఁజేసినవాఁడు రాష్ట్రకూటరాజగు అమోఘ వర్షుఁడు, చిదంబరములో నటరాజు యొక్క నాట్యభంగిమ ములు నూటయెనిమిది రకములు రాతిలోఁ జెక్కఁబడినవి యున్నవి. ఇవిగాక దక్షిణదేశమున కంచుప్రతిమలనేకములు వెలయుచున్నవి. వీని యొక్కొక్కటియందును హైందవకళ ప్రకృతి పురుషుల సమ్మేళన మొనర్చుట వ్యక్తమగుచుండును.

అటు పిదప 'రాజపుత్రులు' వెలసిరి. వీరి రాజ్య ములు మిక్కిలి చిన్నవయ్యును, వారు జనరంజకముగాఁ బాలించుచు, గళలకుఁ వాఙ్మయమునకుఁ బ్రోత్సాహ మియ్యఁగల్గిరి. ఈ మధ్యకాలముననె వంగదేశము నేలిన గోపాలధర్మపాలాది 'పాల' రాజులు కళావాఙ్మయములను

నాదరించి, విక్రమశిలానలంద లందలి విశ్వవిద్యాలయములను బోషించిరి. దక్షిణమున చోళరాజులు తంజాపురియం దంద మైన గోపురంబులతోఁ గూడిన శివాలయమును గట్టించిరి. ఆ మధ్యకాలముననె 'సోమనాథము,' 'ఎల్లోరా,' 'బాదామి,' 'రామేశ్వరము,' 'శ్రీరంగము,' 'మధుర,' భువనేశ్వరము, తిరుపతి, మున్నగు స్థలములందు ననేకములగు నాలయములు, గోపురములు శిల్పనైపుణ్యముతో నిర్మితము లయ్యెను. కంచి, శ్రీరంగము మొదలగు క్షేత్రముల విష్ణ్వాలయములును, గిర్నారు, శతృంజయము, ఆబూపర్వతము మున్నగు తావుల శైవాలయములును గట్టఁబడెను. విజయనగర రాజులగు రాయలు (క్రీ॥ శ॥ 1336 – 1565) దక్షిణ దేశమునఁ గొన్ని దేవాలయములను గట్టించుటయే కాక, తమ రాజధానియగు విజయనగరమునందుఁ బెక్కుగుళ్లను, గోపురములను గట్టించి, యందు శిల్పకళను బ్రదర్శింపజేసి నగరంబును శృంగారించిరి; ఇప్పుడివి శిథిలావస్థనుబొంది చెన్నటియున్నవి.

మహమ్మదీయ రాజులనాఁటి శిల్పము ఢిల్లీ సమీపమున వెలయు 'కుటుబ్ మినార్' స్తంభము. 'ఫిరోజ్' (1351–1388) హిందూ, జైనాలయములను ధ్వంసముజేసి, యా సామగ్రితో మసీదులను గట్టించెను. మొగల్ చక్రవర్తు లందఱును కళల నాదరించినవారె. ఢిల్లీ, యాగ్రా పట్టణము

లందలి యెఱ్ఱరాతి కోటలు వీరు కట్టించినవె. ఢిల్లీ సమీపమున నుండు హుమయూన్ సమాధియు, ఫెటపూర్ సీక్రియందలి పంచమహాల్ మున్నగు సుందరమగు కట్టడములును అక్బరు కట్టించినవె ఆగ్రాయందలి 'తాజ్మహాల్' తన భార్యయగు 'మమతజ్ మహాల్' యొక్క గోరిపై 'షాజహాన్' చక్రవర్తి కట్టించిన రమణీయమైన కట్టడము. ఇది ప్రపంచమందుఁ జూడఁదగు వింతవస్తువు లేడింటిలో నొక్కటియని కళాభిజ్ఞులు నుడువుచున్నారు. దీనిని నిర్మించుట కిరువది సంవత్సరములు పట్టెననియు, తొమ్మిదికోట్ల రూప్యములకంటెఁ గొంత ఎక్కువగనే వెచ్చింపఁబడెననియు జెప్పుదురు. ఈపాదుషా నిర్మించిన మయూరాసనము నవరత్నఖచితమై కన్నులకు మిఱుమిట్లు గొలుపుచుండెనఁట. ఈ మయూర సింహాసనము 1739 వ సంవత్సరములో 'నాదర్ షా'చే పరిషియాకు లేవఁదీయఁబడెను. దీనిని మోసిన యమృత శిలాపీఠము ఢిల్లీకోటలోఁ బ్రాణము పోయిన బొందివలె నేటికిని నులివడి యున్నది.

ఈ శిల్ప నిర్మాణములు ఆ యా శిల్పుల వ్యక్తిత్వమును బ్రదర్శించుటయకాక, ఆ యా కాలపు జనుల నైతి ఆధ్యాత్మిక శీలమును వ్యక్తపఱుపఁ జాలినవై యున్నవి

పిమ్మట యూరోపియనుల రాకవలన హిందూదేశమునఁ గలతలు హెచ్చెను. వీరు స్వదేశ సంస్థానాధీశుల యందుఁ బరస్పర స్పర్ధను, ఈర్ష్యను బ్రజ్వలింపఁజేసి,

యొండొరులకు యుద్ధములు ఘటిల్లఁగాంచి, తా మొక్కొ-
క్కప్పు డొక్కొక్క పక్షమును వహించి ప్రతిపక్షులతోఁ
బోరి. హైందవరాజులను దుర్బలులఁగా నొనరించి, రాష్ట్రము
నంతయుఁ గ్రమక్రమముగా నాక్రమించిరి. ఈ సంక్షోభ
కాలమున (1700–1800) నుడువఁదగిన శిల్పములేవియు
నుత్పన్నములు కాలేదు. ఆంగ్లేయులకు దేశమంతయు
స్వాధీనమైనతర్వాతఁ దమ యక్కఱలకొఱకై మద్రాసు.
కలకత్తా, బొంబాయి, క్రొత్తఢిల్లీ మున్నగు ప్రధాన
నగరంబులందుఁ గొన్నిరమణీయములగు కట్టడములను గట్టిం
చిరి, అందులోఁ గొన్ని గగనమును జుంబించు 'సిమెంటు'
సౌధములై యున్నవి. ప్రకృతము ప్రపంచమంతయు శాస్త్ర
జ్ఞాన రచితములయిన ధూమశకటములు, మోటారుబండ్లు,
వాయువిమానములు, ఆకాశబాణ సదృశములైన విమానగ్రా
ములు, వ్యోమమార్గ సంచరిష్ణువులైన నావలు, సముద్రాంత
ర్గాములు, మున్నగు నానావిధ యానసాధనములచేతను,
బాంబులు, అణు బాంబులు, రోగాపాదక వాయువులు,
మారణోప కరణములచేతను, తత్ప్రతీకార సాధన
మారణ కరణములు మున్నగు మారణోప
కరణముల చేతను, తత్ప్రతీకార సాధనముల
చేతను దొల్లాడుచున్నది. ఇవిగాక దూరశ్రవణ, దూర
దర్శన సాధనములు (Telephone, Telegraphy) దూరదృశ్య
సాధనములు (television), రేడియోలు, రాడారులు,
మున్నగునవి ప్రపంచమందంతటను వ్యాప్తిగాంచినవి. చంద్రాది
గ్రహములకుఁ బోవుటకు మానవుఁడుంకించుచున్నాఁడు.

ఇట్టి సాధన సౌకర్యసంపత్తి వలన విశ్వమంతయు నొక్క యిల్లువోలె వెలయుచున్నది. కాని తద్ద్వాచ్ఛిద్రము లంత రించలేదు. శాస్త్రసాధిత నవోపకరణము లన్నియు నన్యో న్య నిధనమునకై వినియోగింపఁబడునను దిగులు మానవ వానీకమును బీడించుచున్నది. మఱి భోజన సామగ్రుల ధరలానాఁటి కానాఁటికి హెచ్చుటచేఁ బ్రజకేవిధముగను నెమ్మది లేదు. కాని యిప్పుడిపుడు ప్రపంచదృష్టి విశ్వ మానవాభ్యుదయము వంక కుఁ జనుచున్నది.

కావ్యము :—

ప్రాచీనార్యుల కాలమునాఁటి శిల్పము లేవియు నిప్పుడు లేకపోయినను, ఆకాలమునాఁటి మహాకావ్యములు-వాల్మీకి వ్యాసుల రామాయణ 'మహాభారత'ములు - నేఁటికిని వ్యాపించి జనామోదముం బడసియున్నవి. ఇవి ప్రాచీనకాల మందలి సాంఘిక రాజకీయ నాగరిక స్థితిగతులను ప్రదర్శింపఁ జాలియున్నవి. రామాయణ కాలమునాఁటి జనసంఘము సహజమగు సాత్త్విక స్వభావము గలిగి యుండి, దుర్నయ మును ధిక్కరింపఁ గలిగిన నైతిక బలముచే నడుపఁబడినది; భారతమునాఁటి జనసంఘము స్వచ్ఛంద ప్రవర్తనము గలిగి, సంకీర్ణమై, కుత్సితమై, యెల్లరులచేతను, విపుల విప్లవముల చేతను, నిరంకుశోద్దండ పరిపాలనము చేతను, సంక్షుభితమై యుండి బుద్ధిబలముచే నడుపఁబడినది. మఱియు రామాయణ, భారత కర్తలగు వాల్మీకి, వ్యాసులు గతించిన బహుశతా బ్దులకుఁ దరువాత వచ్చిన కాళిదాసుని కాలమందు గానము, నాట్యము, నాటకము, వాస్తువిద్య, చిత్రకళ, ఆరామకృషి,

స్వర్ణక్రియ మొదలగు కళలు "సర్వత్ర వ్యాప్తిగాంచి ప్రాశస్త్యముంబడసి, జనుల మహోత్సాహము నాకర్షింపఁగలిగి, వారి జీవితమందును, వారిచైతన్యమందును, దమ ముద్రలను ముద్రింపఁగలెను."* మఱియునప్పుడు భౌతికసుఖోపభోగమే యధిక ప్రాశస్త్యముం బడసియుండెను. ఈతఁడు రచించిన ముఖ్యమగు శ్రవ్యకావ్యములు: రఘువంశము, కుమారసంభవము; దృశ్యకావ్యముల మూఁటిలో నభిజ్ఞాన శాకుంతలము మిక్కిలి ప్రసిద్ధి గాంచినది (పు. 21).

ఇతర సంస్కృత కవులను ఉత్కృష్ట కళారాధకు లగుటవలనను ఆంధ్రకవిత్వమునకు మూలాధారులగుట వలనను వారు చేసిన కృషినిగొంత స్మరింతము.

రామాయణ భారతముల తరువాత నిప్పటికి లభించిన కావ్యములలో బహుప్రాచీనమైనది "అశ్వఘోషుని" బుద్ధ చరిత్రము. అశ్వఘోషుఁడు కనిష్కుని కాలము నాఁటివాఁడు కావున క్రీస్తుశకము ద్వితీయ శతాబ్దినాఁటివాఁడనియుఁగాళిదాసునికిఁ బూర్వపు వాఁడనియు నుడువుదురు. నీతి బోధకమగు 'పంచతంత్ర' మగు వచన కథాగ్రంథమాఱవ శతాబ్దికిఁ బూర్వమే వ్రాయఁబడి పెక్కుభాషలలోనికి భాషాంతరీకరింపఁబడినవి. కాళిదాసుని తరువాతఁ బ్రఖ్యాతుఁడగు కావ్యకర్త భారవి. ఇతడు క్రీస్తుశక మాఱవశతాబ్ది మధ్యమున జీవించియుండి 'కిరాతార్జునీయ' మను పద్య కావ్యమును వ్రాసెను. భర్తృహరి యేడవశతాబ్దియందుండిన వాఁడు. ఇతఁడు నీతి శృంగార వైరాగ్య శతకములను

* శ్రీ అరవిందుల "కాళిదాసు"

రచించి, నైతిక భౌతికాధ్యాత్మిక సంస్కృతులకు, ప్రాశస్త్యముంగనబఱచినాఁడు. 'దశకుమార చరిత్ర'మను గద్య ప్రబంధమును రచించిన 'దండి' కవి యాఱవ శతాబ్దియందుండినవాఁడు. ఇతఁడాకాలమందలి సాంఘిక మతాచారములను దన గ్రంథమున నభివర్ణించెను. బాణుఁడు 'కన్యాకుబ్జము' నేలిన 'హర్షవర్ధనుని యాస్థానకవియైయుండి 'హర్షచరిత్ర' మను గద్యకావ్యమును వ్రాసెను. ఇతడు మొట్టమొదట దుర్వ్యసనతుఁడై యుండి పిదపఁ దన వర్తనమును మార్చుకొనెను. బాణోచ్ఛిష్టంజగత్సర్వమ్మను విమర్శకుల మాటల వలన నితని వర్ణనాసామర్థ్యము స్పష్టమగుచున్నది. తొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున వెలసిన శ్రీ శంకరాచార్యుఁ డద్వైత సిద్ధాంత ప్రవర్తకుఁడై 'శివానందలహరి', సౌందర్యలహరి మున్నగు స్తోత్ర రాజములమ మృదుమధుర వాక్కులను వచించెను. 'శిశుపాలవధ' యను నతి ప్రౌఢకావ్యము నకు బ్రణేతయగు 'మాఘుడు' పదునొకండవ శతాబ్దినాఁటివాఁడు, ఈ శతాబ్ది నాటివారగు బిల్హణుఁడు, క్షేమేంద్రుఁడు వరుసగా 'విక్రమాంక దేవచరిత్రము'ను 'దశావతార చరిత్ర'మును, రచించిరి. ఆకాలముననే 'రాఘవ పాండవీయ'మను ద్వ్యర్థి కావ్యమును 'కవిరాజు' రచించెను. కృష్ణభక్తుఁడును, వంగదేశీయుఁడునగు జయదేవుఁడు మనోహర గేయప్రబంధమగు 'గీతగోవింద' మును బండ్రెండవ శతాబ్ది యారంభమున రచించెను. ఆశతాబ్దినే శ్రీహర్షుఁడు శృంగార ప్రబంధమగు నైషధమును (నలచరిత్రమును) వ్రాసెను. పదునాల్గవ శతాబ్ది చివర అప్పయ్య దీక్షితులు వైరాగ్య శతకము నొకదానిని

రచించెను. కాంచీపురవాసియు శ్రీ రామానుజ మతావలం
బియునగు వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శ'మను కావ్యమును
పదునేడవ శతాబ్దిని రచించెను; ఇందిరువురు గంధర్వులు
విమానముమీఁద సంచరించుచుఁ బలుక్షేత్రముల వర్ణింతురు.
నేఁటి కాలమునను సంస్కృతమునఁ గావ్యములను, మఱి
యితర గ్రంథములను రచించువారున్నారు.

ఇట్లు కవులు నీతి శృంగారాధ్యాత్మిక విషయంబుల
వర్ణించుచు భారతీయ సంపూర్ణ జీవనము కుదురుపడుటకై
పాటుపడువారు. ఉత్తమయుగము యొక్క రాక శ్రీ శంకరా
చార్యులతోఁ గ్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దిని నారంభమా
యెను. అప్పుడు ప్రారంభమైనను దానికి విఘాతములు
పెక్కులు సంభవించెను. పాశ్చాత్య నాగరకత సంపర్కము
వలన భౌతిక కాంతియే మనయం దతిశయించినది. నీతి ధర్మ
పారమార్థిక కాంతులును, వానిని బ్రతిపాదించు గ్రంథము
లును దఱుఁగుఁదల గాంచినవి. అయినను మన భారతదేశీయు
లధికమగు నోజశ్శక్తి గలిగియుండి, పునర్జన్మయందును, పున
రుజ్జీవన యందును దఱుఁగని నమ్మకము గలవారగుటచేత
నాధ్యాత్మిక జీవనముపట్ల వారికిఁగల యాదరము స్తంభించి
పోలేదు. శ్రీ శంకరునితోఁ బ్రారంభమై, తరువాత శ్రీ
రామానుజ మధ్వాచార్యుల ప్రోత్సాహముంబడసి మధ్య
కాలమునఁ గృశించిన యీ యాధ్యాత్మిక జీవనము దక్షిణ
దేశమున విజయనగర సామ్రాజ్య స్థాపనాచార్యుఁడగు శ్రీ
విద్యారణ్యులతోడను, వంగదేశమున శ్రీ చైతన్యునితోడను,
ఉత్తరదేశమున శ్రీ గురునానక్ తోడను, మహారాష్ట్రదేశమున

ఛత్రపతి శివాజి గురువగు శ్రీ సమర్థరామదాసుతోడను, బునరుజ్జీవింపఁబడి, శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందుల చేతను, గాంధీమహాత్ముని యాదర్శక జీవనముచేతను, వ్యాప్తిగాంచినది. శ్రీ అరవిందులు పుదుచ్చేరియందుండి యాధ్యాత్మిక యుగముయొక్కయు, భవిష్యదుత్తమ కావ్య యుగముయొక్కయు రాకకై యెక్కువ కృషిసలిపినవారు. వర్తమానకాలమున శ్రీ మాతగారు శ్రీ అరవిందులు గావించిన యాధ్యాత్మిక కృషిని దాము సాగించుచు మిక్కిలి పాటుపడుచున్నవారు. ఉత్తరమున గంగానదీ తీరస్థమైన ఋషికేశమున సన్న్యాసులగు శ్రీ శివానందులు పారమార్థిక జ్ఞానవ్యాప్తి గావించుచు లోకోద్ధరణముచేయుట యందు గణ్యులై యున్నారు.

## 5. కళా ప్రయోజనము

కళలవలని ప్రయోజనము సూక్ష్మమును నగాధమును నై వెలికి గోచరముగాక యుండును; మఱిఁగుననున్న దీని ప్రయోజనమేదోఁ దెలిసికొనుటకుఁ బ్రియత్నింతము.

చరిత్ర, భాష, శాస్త్రము, మతగ్రంథపఠనము మున్నగు వానికంటె నుత్తమతరములు కళలు. కళలు విరామకాలమందుత్పన్నమైనవి గాన, విశ్రాంతియు, విత్తమును, సుఖోపభోగమును ననుభవించు ధనికులకే యవి యుపభోగ్యము లగునుగాని, జనసామాన్యమునకవి నిరర్థకములనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. కాని 'మానవులు తమ యూఁడిగము కొఱకుఁ బ్రకృతి శక్తులను వశపఱచుకొన్నకొలఁదిని, వివిధములగు నుత్పాదక సాధనములను సంపూర్ణస్థితికిఁ దేఁగలి

గినకొలఁదిని, అల్పశ్రమచేత మహత్ఫలములను సాధించు నుపాయముల నెఱింగిన కొలఁదిని, సాంసారిక వ్యవహార నిర్వహణమునకు వలయు జ్ఞానమును నతి శీఘ్రకాలములో గడింపఁగల్గుటకు విద్యావిధాన మొక చక్కని వ్యవస్థకు వచ్చినకొలఁదిని, వారికి విరామమధిక మగుచుండును*. విరామమధిక మగుడు, వారు తమ శారీర కావశ్యకతలఁ ద్వరలోఁ దీర్చికొనఁగలిగి వనితాశృంగారసాంగత్యము, సుఖోపభోగ కాంక్ష, ఆహ్లాదక వస్తువులందుఁ గామన మున్నగు ప్రాణిక (vital) వాంఛలఁ దీర్చుకొనుటకై ప్రయత్నపడుచుందురు. ఈ ప్రయత్నమే జనులను సౌందర్యరసాస్వాదనమునకుఁ బ్రోత్సహించునదియై యున్నది. సౌందర్య ముత్తమకళయందు నిబిడమై యుండును గానఁ గళోపాసనయె సౌందర్యోపాసన యగును.

కళ యొక్క మొదటి పరియోజనము సౌందర్య విషయమైనది; రెండవ పరియోజనము విద్యాబుద్ధుల విషయమైనది; మూఁడవ పరియోజనము ఆధ్యాత్మిక విషయమైనది. ఈ మూఁడు పరియోజనముల గుఱించి శ్రీ అరవిందులు తమ 'కళకుఁగల జాతీయ పరియోజన' మను గ్రంథమున నుడివిన విషయములను నిక్కడ ననువదించుట యుత్తమము.

కళ మానవాభివృద్ధికి నుత్తమమైన విధముగను, సంపూర్ణముగను, బరియోజన పడవలయునన్న సౌందర్యరసము తనపనిని జేయవలసి యుండును. ఈ సౌందర్యరసము తన ధర్మమును నెఱవేర్చిననే కాని మానవలోకము కళ యొక్క పూర్ణ పరియోజనమును బొందుటకు నిజముగా వా యుండదు. మానవాభ్యుదయము యొక్క యొకానొకదశ

యందు సౌందర్యభావ మత్యంత ప్రయోజన పడునట్టిదియై యుండును; అది యారణ్యకజనుని యందలి క్షుద్రకాంక్షల యెడలను వానియావేగోద్వేగముల యెడలను నభిరుచిని మెల్లగం గల్పించి, గడుసుందనమందును, మౌఢ్యమునందును, దుర్నీతి రీతుల యమితత్వములందును అనభిలాషను బుట్టించి, వాని నడవడిని నుత్కృష్టపఱచి శుద్ధము చేయుచుండును. మఱియు నయ్యది వికారరహితమును, సుందరమును, యోగ్యమును, సముచితమును నగు విషయములను బొందవలయునను వాంఛను, బ్రయత్నమును నొడంగూర్చి మానవుని ప్రవర్తనమును సాత్త్వికగుణ ముఖమునకుంద్రిప్పి వానిని సంయమ పఱచు చుండును. శుద్ధసౌందర్య రసమును నాస్వాదించుట వలననె జనులు తమ పాశవ స్వభావమును వీడి, కామ క్రోధాదులను నపనయింపంజాలి, సౌశీల్యమును గడించు కొనంగలుగుదురు.

"శుద్ధసౌంధర్యముండు చోట శుద్ధప్రేమ యుండును; శుద్ధ ప్రేమగల చోట శుద్ధానందముండును. కావున సౌందర్యాభిజ్ఞత నైర్మల్యమును బాఱంద్రోలి నయదయా దాక్షిణ్యసౌజన్యాది సద్గుణములం బెంపందం జేయును. నీతికిని శుద్ధసౌందర్యమునకును సన్నిహిత సంబంధ మున్నది సౌంద ర్యము శుద్ధప్రేమతోంబొత్తు గలసినప్పుడే సౌశీల్యమును సత్ఫలముగలుగును. జన్మయొక్కయుద్దేశము నీతికొఱకై నీతిని ననుష్ఠించుట కాదు; ఆనందమే దాని యుద్దేశము. సౌందర్యా నందముల రెంటిని దిరస్కరించినచో నభివృద్ధి యొదవదు. సౌందర్యానందములను నిమ్నమునుండి యుచ్చమునకుం దీసికొనిపోవలయును; అప్పుడే మానవాభ్యుదయము సమ కూరును.

"జనులయందు సౌందర్య రసాస్వాదన శక్తి యతిశ యించినకొలఁదిని వారి హృదయావేదము లుత్కృష్టములై సంయమమందు చుండును; వారిభావనా పటిమయు వృద్ధియై వారు బుద్ధిచే నడుపఁబడుచుందురు. ఈ బుద్ధి వికసనమువలన వారి యాత్మ వికసితమగుచుండును బుద్ధిని నాత్మ వికా సమున కుపయోగించుకొనని జనుఁడు తన దైవాంశమును నిజపాశవ స్వభావ సంతృప్తికై యుపయోగపెట్టు నీచరాక్షసుఁడై యుండును." ఇందుకుఁ గీచకుఁడు, దుశ్శాసనాదులు ప్రబల నిదర్శనములు.

మన ఋషులు ప్రపంచమంతయు నానందము నుండియే యుద్భవంబంది, యానందమునందే వర్ధిల్లి, యానం దమునందేలీనమగుచుండునని నుడువుదురు.*

'ఆనందమునందు సంతోషము, ప్రేమ, సౌంద ర్యము ననెడిమూఁడు రసములుండును.' బాహ్య ప్రకృతి యందును, మానవుని యాంతర ప్రకృతియందును, మానవుని జీవితమందును స్పందించు 'లయ'ము గురించి, మానవుఁడు తనయందలి దివ్యసౌందర్యమును జూడఁగలిగెను; ఆ సౌంద ర్యమును బ్రేమింపఁ గలిగెను; ప్రేమించి యానందముం బొందగలిగెను. ఈ సౌందర్య ప్రేమానందములె యాత్మ వికాసమునకుఁ బరమ సాధనములు. ఇయ్యవె యవిద్యను బాఱఁద్రోలి విజ్ఞానమునొసంగి జీవాత్మను బరమాత్మతో సంయోగ మొసరింపఁ జాలినది.

---

* "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభి సంవిశంతి."

"సౌందర్యము శుద్ధమనియు, క్షుద్రమనియు రెండు తెఱంగులుండును. శుద్ధసౌందర్యము మానవాభ్యుదయముం జేకూర్చునదియై యుండఁగా, క్షుద్రసౌందర్యము కర్మేంద్రియములను నుద్రేకించి, మలినరసములను బ్రేరేచునదై, జ్ఞానేంద్రియమును బుద్ధిని గలవరపఱచునదై, నిరర్థక సంప్రదాయ సిద్ధములైన మూఢ విశ్వాసములం దాదరము గల్గించునదై, జాతీయగత వైభవ స్మరణాసక్తిని మాత్రము గూర్చునదై, క్రియామాంద్యమును జనింపఁ జేయునదై, మానవాభ్యుదయమునకుఁ బ్రతిబంధకమై యుండును."

కళలయొక్క రెండవ ప్రయోజనమగు విద్యాబుద్ధుల సంస్కారము విషయమును గూర్చి విచారింతము.

ఋషిత్వమున్ననే కాని మానవుఁ డుత్తమ కళారచన చేయనేరఁడు; కనుక నుత్తమశిల్పము లుత్తమ మానవులరచనలే యగును. 'వీని నధిగమించుట వలన మనస్సుయొక్క యవగాహనశక్తి చుఱుకగును; వస్తువులందలి ఛాయామాత్ర భేదములను గనుఁగొను శక్తి సునిశితమగును; వస్తువులను జూచునప్పుడు పైపయిఁగలుగు జ్ఞానమాత్రముచేతఁ దృప్తి పడఁగూడదని బోధించును; మఱియు మనస్సు జాగ్రత్త గలదియుఁ, జుఱుకుఁగాఁ బనిజేయఁ జాలినదియు, గోమలమును, వేగవంతముగను, స్వతఃస్ఫూర్తిమంతమునునగును. కళ యిటువంటి సంస్కృతిని నెట్లొడఁగూర్చునో విచారింతము. అది మొట్టమొదట మనస్సులో బింబములను బుట్టించును. ఈ బింబములు వింగడించుట (పృథక్కరణము) వలనఁదెలిసికోఁదగినవిగాక, యెదురులచిత్తముతోఁదాదాత్మ్య మొందుట వలనఁ

దెలిసి కోఁదగినవై యున్నవి. అనగాఁ గావ్య హృదయమును నెఱుంగుటకుఁ దత్కవి హృదయముతోఁ గొంత తాదాత్మ్య మొందవలసియుండును. కళదయార్ద్రకలితమైన లోపలి చూపును బ్రబలముగా నుద్బోధించు నట్టిది, కళనునిశితమును, సుకుమారమును నైనది; అదితన ప్రవృత్తి వలనహృదయమును సునిశితమును, సుకుమారముగను జేయునది; మఱియు 'లయ' సమన్వితమైనది. కళా రసాస్వాదనమున కలవాటుపడిన హృదయము వ్యంగ్యార్థములను గ్రహించుటయందు సుగ్రాహకమై యుండును. కేవల ప్రకృతి శాస్త్రములను, నధిగమించుట వలన వెలికి మాత్రము దోఁచు వస్తు స్వరూప స్వభావములే యవగతములగును. కాని కళల నధిగమించుట వలన, మానవుఁడు శాస్త్రాది గమము వలనఁగలుగు లాభములనుబొందుటయె కాక, అతని ప్రజ్ఞ క్రొంగ్రొత్త విషయ సంపర్కము వలన (వాడియై) నిశితమై విస్తృతి నందుచుండును; మఱియుఁ దత్ప్రజ్ఞ పసువులయందు నిగూఢమై యడఁగి యుండునట్టియు, నిశ్చిత శాస్త్రోపకరణములతోఁ గొలఁది వెట్టఁగ రానట్టియు వస్తు స్వస్వరూప స్వభావములను సయితమవగతము చేసికొనఁగలుగును. ఒకయుత్తమమైన గేయమును విన్నప్పుడును, ఒకయుత్తమమైన చిత్తరువును దిలకించినప్పుడును వానియెడల మనకనురాగ మొదవఁగా, వానియందు మనమనస్సు నివసించుచుండుట యనుభవవేద్యము. తదనంతరము తద్విమర్శన పొడమఁగా మనచిత్తమునందు మనము నివసింపఁగలిగి, అందుఁబొడము రసమును నాస్వాదించు చుండుము. ఇట్టి రసాస్వాదన తత్ప

రత వలన మనుజుఁడు సౌందర్య రసజ్ఞతను, సుష్ఠుతను, సహృదయతను - అనఁగా విద్యను బడసిన వాఁడై యుండును. ఈ గుణముల కలిమి వలన వాఁడు తనకుఁ దెలియకయే హృదయ సామరస్యముంబొందిన వాఁడై, సౌశీల్యముంబడసిన వాఁడై, జీవితాసక్తిగల వాఁడై సకలకర్మవ్యాపారములందును సదభికాంతను బ్రదర్శించు వాఁడై యుండును. ఈ గుణ ములు మానవ సంఘమునందు వెల్లివిరిసెనా, దాని రసపంవేద నలును, మనోభావములును, వికాసముంబరిణతిఁగాంచి, సామ రస్యమొంది, ఉత్కృష్ట పఱుపఁబడి, యది (యాసంఘము) మధురతరమును బూజ్యతరమును నగును. వేయేల? వివిధ కళారసాస్వాదనమువలన నవరసానుభూతి గలుగఁగా హృద యంబు శుద్ధమయి బుద్ధిసునిశిత మగును.

కళయొక్క మూఁడవ ప్రయోజన మాత్మవిషయమై నది. 'మానవుఁడు 'నేను' 'నే' నని చెప్పుకొనునది యీ జడదేహముగాక యనశ్వరమగు నాత్మయే యగును. ఈ యాత్మను దన్నుఁదాఁగనుఁగొను నట్లు చేయఁజాలినది యాధ్యాత్మికజ్ఞానమే; కావునఁ గళయొక్క యాధ్యా త్మిక ప్రయోజనము మహత్తరమైనది. ఆధ్యాత్మికాభివృ ద్ధికై శాస్త్రములు, (Sciences) మతములుచేసెడి సేవకంటె, గళలుచేసెడి సేవయే యత్యధికమైనది, యుత్తమమైనది. కళలు మనుష్యునకుఁ దెలియకయె వాని కాధ్యాత్మికాభివృద్ధి నొడఁగూర్పఁ జాలినవి. మతమునకును, గళలకును సన్నిహిత సంబంధము నెలకొలింగిన వారమగుటచేతనే, హిందు వులమగు మనము మనగుళ్లను, గోపురములను, విగ్రహము

లను, దేవతాసామగ్రిని జిత్రవిచిత్రముగా, మనోహరముగానలం కృతము చేయుచుందుము. పాశ్చాత్యులకుఁగల కళావిషయమైన దృష్టి వేఱు. ఏకళ సౌందర్యాత్మకములైన భౌతికావశ్యకతలను, బాహ్యజీవితమును, ఉద్వేగజన్యములగు కోరికలనుదృప్తిప ఱుపఁజాలియుండునో యదియె వారికుత్తమమైన కళ. ఈ తృప్తిని బాశ్చాత్యకళ వారికిఁ చేయఁజాలియున్నది. "కాని యుత్కృష్టమైనకళ ఈబాహ్యతృప్తినేకాక, లోపలియాధ్యాత్మిక సత్యమును, వస్తువులందలి యగాధమైన తత్త్వార్థములను, సృష్టిసౌందర్యమును, సృష్టియందలి భగవచ్చైతన్యాభివ్యక్తమలగుటను, ప్రపంచమందలి దివ్యానందమును బడయుటను నలవరించుచున్నది" భారతీయకళ యీయాన్నత్యమును నందుకొనుటకై సర్వవిధములఁ బ్రయత్నముచేసినది, మఱియుఁ జేయుచున్నది.

"ఇట్లు కళావిషయమైన యభిప్రాయము పాశ్చాత్యమున నొక్క పాయగను, ప్రాచ్యమున వేఱొక పాయగను బ్రవహించుచున్నది. ఈ రెంటి సంగమువలన నేర్పడిన కళామహాప్రవాహమే గంభీరమై, సర్వతోభద్రమై లోకమును దనుపారఁజేయఁజాలినది."

"ఉత్తమమైనకళానుభూతి దుఃఖమిశ్రితమును, స్వల్పకాలసంశోభితమునునగు నైహిక సుఖమునేకాక, దివ్యజ్ఞానమును, అఖండప్రేమను, అఖండానందమును నొడఁగూర్పఁ జాలినదై యున్నది. నిజముగ నుత్తమ కళారసాస్వాదన మమృత రసాస్వాదనమే యగును. ఈ రసము మానవుని హృదయమునందుఁ బ్రవేశించుచో, వాని జీవితమును, ప్రవర్తనమును, బరి-

శుద్ధములగును. ఈరసము గంగాప్రవాహమువలె భూతలమున నేఁ ప్రవహించునేని మానవజాతియే పూతమగును. వేయేల?'' కళా రసాస్వాదనము సాంత మగుదానిని క్రమముగా ననంత మగు బ్రహ్మస్వరూపముగా మార్చుటకు సమర్థమైయుండును; అదియే కళచేయవలసిన యత్యుత్తమమైన ధర్మము; అదియే కళయొక్క సంపూర్ణమైన స్వామ్యము; అదియే దాని సమగ్రమైన పర్యవసానము''.

నిజమైన కళ శక్తియుతమై గంగాస్రవంతివలె నిరంతరము ప్రవహించుచుండి, జనులకు రక్తి భుక్తి ముక్తులను నిచ్చుచుండును. అళీకమైన కళ శక్తిలేక మరుభూమియందుఁ బ్రవహించునదియై నీరసమైపోవును. నిజమైన యుత్తమకళ కేవల తార్కిక బుద్ధిచే నడుపఁబడునది గాక, స్వతః స్ఫూర్తిచే నడుపఁబడునదై యుండును. మానవుని మనోబుద్ధులు కేవల భౌతిక వ్యవహారములను నిపుణముగా నిర్వహింపఁజాలుట కేర్పడినవైయున్నను, వాని యాత్యంతిక ప్రయోజనము వేఱు. మనస్సును విచ్చలవిడిగాఁ బోనిచ్చినచో, నయ్యది బుద్ధిని, అంతశ్చేతనను మలిన మొనర్చును; కాని సద్బుద్ధి, సచ్చింతన - యంతశ్చేతనను సంశుద్ధి పఱచి, పైకెత్తి భగవదనుగ్రహము దిగుటకర్హమైనదానిఁగాఁ జేయఁజాలియుండును. భగవదనుగ్రహము గలుగుచో నచంచలమైన ప్రతిభ యుద్భవంబొంది సత్యార్థమును బ్రకాశింపఁజేసి సర్వమును నప్రయత్నముగను నవలీలగను నడుపుచుండును. ఉత్తమ ప్రతిభావంతునివలన నావిష్కృతమగు కళయే నిజమైన యుత్తమ కళ.

పై విషయములం బట్టిచూడఁ, గళ విత్తమును, విరామమును గల శ్రీమంతులకే కాక, సర్వజనులకును నవశ్య మనుభవ నీయమయి యున్నది. కళ ప్రత్యేకజనుల స్వామ్యము కాదు. అది భాషవలెను, శాస్త్రము (Sciences) వలెను సర్వజనసంస్కృతి కావశ్యకమై, సర్వజనాను భోగయోగ్యమై యున్నది. ప్రతిమానవుఁడును గళాచతురుఁడుగా నుండ వలయుననుట యనావశ్యకము; అతఁడు తన కళాభిరుచిని, రసగ్రహణశక్తిని నభివృద్ధిచేసికొన్నఁ జాలును. ఇది యల వర్చుకొన్నచో రుచిరసుందరవస్తువుల యుత్పత్తి యధికమై జనులు తమ దృష్టిని నేదిక్కునకుఁ దిప్పినను నందట్టి వస్తువులే వారి దృష్టిపథమునఁ బడుచుండును. ఇట్టి స్థితివలన జనులు రుచిర సుందర వస్తువులనే మననము చేయుటకల వాటుపడి, చైతన్యాభివృద్ధిని, చైతన్య పూర్ణతను బడయఁ జాలుదురు.

# 6. లలితకళలు: వాని ప్రయోజనము

గానము:-

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసమ్ఫణీ"

గానరసము శిశువులను, పశువులను, సర్పములను బర వశ మొందించును. ఇంతేకాక గానము రాలఁగరఁగించు ననియుఁ జెప్పుదురు. గానము దుఃఖపీడితులను నోదార్చి వారి హృదయములను కుత్తేజన మొనగూర్చును. శాంతిని సిద్ధింపఁజేయును. గానము జనుల హృదయములను భక్తి

శృంగార వీర కరుణ రసంబులతో నింపి వారి జీవితము లకుఁ బలురీతులఁ బ్రయోజన పడుచుండును. సామాన్యమైన వాక్కు గానసంపర్కమున అసమాన్యమై రాణించి, హృదయమున కుల్బణముఁగూర్చి, భావమునకు జీవముపోయుచున్నది. పల్లెపదాలు, గృహ్యగీతములు, అభినయగీతములు, వీరగీతములు, 'తందనాలు' మున్నగునవి సంగీత యుక్తముగాఁ బాడఁబడినప్పుడు గ్రామ్యజనుల జీవితమందలి యుబుసు పోకకుఁ బరీవాహముల్తై యుండును; ఇంకొకరీతిఁ జెప్పినచో నియ్యవి జనుల జీవిత కావ్యమున కలంకారముతై యుండును. "గానము రసములను గంభీరపఱచి-లోఁతునకు దింపి-యారసములను నొకటితో నొకటి సామరస్య మొందఁ జేయును. శ్రుతి లయానుబద్ధమగుస్వరమె గానము కావున, గానము చిత్తమును లౌకిక వ్యవహార ప్రవృత్తినుండి మరల్చి దాని కేకాగ్రతను సమకూర్చును. గానము కర్మేంద్రియజ్ఞానేంద్రియములను, అంతఃకరణమును ఆత్మకొరకై యొక్క మొగిని, శుశ్రూషింపఁజేయును. గానమునందు వాక్కు, శ్రోత్రము, చిత్తము, ఏకస్థాయిని బొందుటచే, నయ్యది మానవునకు నిశ్చల భక్తిని జేకూర్చును." నిశ్చల భక్తి బ్రహ్మానందమునకు దారితీయును. మఱియు జనులకు గానమందుఁ గల యాకాంక్షను బట్టి వారి శీలముండుననియుఁ గావున గానవిద్యను బాలికా బాలురకు నేర్పవలయుననియు "అరిస్టాటిక్" ప్రాజ్ఞుఁడునుడువు చున్నాఁడు. శ్రవణపేయమయిన గానము మానవుని భక్తియుతునిగా, శుద్ధానంద పరవశునిగాఁ జేయఁజాలును. కబీరు, తులసీదాసు, తుకారామ్,

మీరాబాయి, పురందరదాసు, త్యాగరాజు మున్నగు భక్తా
గ్రేసరులు భావాశ్రియమైన సంగీతముతోడనె సంసార
మును దరింప గలిగిరి. షేక్స్పియర్ కవి గానమును గుఱించి
యిట్లు వచించువాఁడు; గానము నాలకించుచో నడవి మృగ
ములె కాక, చెట్లు చేమలు, శిలలు, శిలోచ్చయములు,
వాగులు, వఱంతలు తమ మార్గములను వదలి యాస్వరమును
వెన్నంటి చనుచుండును. గానము నందాదరము లేనట్టియు,
దాని మాధుర్యముచే హృదయాందోళనము నొందనట్టియు
మానవుఁడు వంచనలకును, ద్రోహములకును, కొల్లలకును
దగిన వాఁడయి యుండును. వాని పురుష ప్రయత్నము
అన్నియు నిస్తేజసములై వానియంతః కరణ మంధకార
బంధురమై యుండును. ఇట్టి వాఁడ విశ్వసనీయుఁడై
యుండును. (Merchant of Venice)

## నృత్యము

అవస్థానుకరణమై యభినయము గదా! శరీర హస్త నేత్రా
భినయములచేత భావమును బ్రదర్శించుచు నాడెడు నాట
నృత్యము. నృత్య గీత వాద్యముల కూడిక నాట్యము; నట
నము చేయునట్టి వ్యక్తి గానము చేసి గీతార్థమును హస్తాభి
నయములచేతను, భావమును నేత్రముల చేతను దెలుపును.

యతో హస్త స్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః ॥
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః ॥

ఎక్కడ హస్తము చూపఁబడునో యక్కడ దృష్టియు,
ఎక్కడ దృష్టి నిలుపఁబడునో యక్కడ మనస్సును, ఎక్కడ

మనస్సు నిలుపఁబడునో యక్కడ భావమును మంచవలయును. ఎక్కడ భావముండునో యక్కడ రసం బొదవును

దీనినిబట్టి జూడ భావజ్ఞానముతోఁ గూడిన యభినయము దాని నభినయించువారికిని, దానిని జూచువారికిని, మనోహరముగ నుండుననుట యనుభవైక వేద్యము. ఇందు భావ ప్రదర్శనము కరచరణ నేత్రాద్యంగ సంచలనములతోఁ గూడి యుండుటవలన నియ్యది రసోద్దీపకముగా నుండును. ఇట్టి రసభావానుభవము వలన ఆనందము జనించును. ఆనందమేకదా కళల యొక్క పరమోద్దేశము. నాట్యము పండిత పామరులకును సుభోధమై యభిరుచి జనకముగను, ఆనంద ప్రదముగను నుండును.

అనుకరణాభిలాషవలె, గానాభిలాషవలె, క్రీడాభిలాష వలె అభినయాభిలాషయు శిశువులకు సహజము. ఈ సహజాభిలాషను దీర్చుటకై వారికిఁ బరువులిడు వయస్సు రాఁగనే నాట్యమునేర్పుట కారంభింపవలయును. నాట్యము బాలుర కంటె బాలికల కత్యావశ్యకము. దీనివలన శరీరారోగ్యము, శరీర పుష్టి, శరీర లాఘవము, శరీర సౌందర్యము, శరీర లావణ్యము బెంపొందును. నాట్యమును బిడ్డలకుఁ తల్లిదండ్రులే నేర్పింపఁ బూనుట బహుధన వ్యయైక సాధ్యము గనుక, విద్యాశాలలందే దొరతనము వారు దానిని నేర్పింపఁ బూనుట సమంజసము, మైసొబగును నలవరించుకొన్న బిడ్డలు ముఖ్యముగా బాలికలు, నిరంతరము తమ యారోగ్యమును రక్షించుకొను నభిలాషగలవారై యుందురు; ఏలనమైసొబగు శరీరారోగ్యముమీఁద నాధారపడియుండును.

## చిత్రకళ

చిత్రకళ చూపులతోడనె యర్థము చేసికొన వలసిన కళ. ఇది రేఖల లేఖలతో, వర్ణికాభంగిమములతో బాహ్య జగత్తును, భావజగత్తును ప్రదర్శించునట్టిది. ఇది మూఁగ కళ. స్థలబద్ధము. పరిమితస్థలమందు నొకే క్షణమున గోచరించు నునికిని–ఆకృతిని–చిత్రకారుఁ డావిష్కరింపఁ గలుగును. అతఁడు తన పరికరములతో సంచలనము గల దృశ్యమును, విషయమును, వర్ణింపనేరఁడు. అట్లు చేయ నుంకించుచో నతఁడు పలు చిత్తరువులను లిఖింపవలసి యుండును. ఇట్లు రచించినను దాని ప్రయోజనముండదు. చలన చిత్రముల పటలము (Film) లోని యొక బొమ్మను దాని ప్రక్కనుండు బొమ్మలతోఁ బోల్చిచూచిన, వారి నిర ర్థకత పరిస్ఫుటమగును. కావుననె చిత్రకారుఁడు ఒకే యుత్తమమైన క్షణమును, దేశమును (దృశ్యమును) బహు విచక్షణతో నుపాశ్రయించును. కావ్యమందు సంచలన మున్నది. కవి కాలదేశములందలి విషయములను స్వేచ్ఛగా నావిష్కరింప గలుగును. చిత్రకళాకారునకీ సౌకర్యముండదు. కాని దాని స్థిమితత్వమే నిశ్చలత్వమే దాని కొక ప్రత్యేక మైన ప్రయోజనము నొడగూర్చుచున్నది. కావ్యము వివిధ రసములను నుద్భవింపఁజేసి యాయా రసములకు సంబంధించిన యానందమును ననుభవింపఁ జేయును. చిత్రకళయన్ననో తీవ్రసహానుభూతిని స్తిమిత పఱచి, పరిమితమును. నిగ్రహా త్మకమును నగు నానందముతో మాత్రము తృప్తిపడియుండ వలయునని యుద్బోధించును.

ఒక యుత్తమ చిత్రకారుఁడు తొడలు విఱిగిపడి యున్న దుర్యోధనుని చిత్రమును లిఖించుచో, అతఁడు దుర్యోధనుఁడు చేసిన యాక్రోశపు మూల్గులను చూపఱమనంబునకు వినిపించునట్లు దానిని రచియింపఁ గల్గును. లోతైన యేకైక దృష్టికి దుర్యోధనుని యప్పటి స్థితిపూర్ణముగా గోచర మగునట్లు చేయును. కావ్యకర్తయో వాని యాక్రోశపు మూల్గులను వాని స్థితిగతులను వాక్కుల మూలమున వరసగట్టి యావిష్కరించును. చిత్రకళయు, కవితాకళయుఁ దన తన ప్రత్యేక లక్షణ ప్రయోజనములతో వెలయు చున్నను, రెండవది చేయఁజాలినంత పనిని మొదటిది చేయఁ జాలదు. ఒక నిదర్శనము :—

సీ॥ "పొడసూపి నల్లైన వడిఁబట్ట సమకట్టి
పరికించి కానక బమ్మరించు,
మెలఁగిన యల్లైనఁ బలికింపఁ దలఁచి ని
రూపించ లేమి నఱ్ఱులు వహించు;
కదిసిన యల్లైనఁ గౌఁగిలింపఁ గడంగి
యారసి బొంకైన నలఁతనొందు;
ఒడఁబడ్డ యల్లైన నడరి పైకొనఁజూచి
చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయు;
గీ॥ లలిత వివిధ విహారంబులకు లతాంగి
యొలసి సొలసిన యల్లైన నెలమిఁ గలసి
యభిమత క్రీడ సలుపంగ నప్పళించి
వెదకి రిత్తబయల్ గని విహ్వలించు." — తిక్కన

ఈ పద్యమందు మదనోన్మత్తుఁడైన కీచకుఁడు ద్రౌపదికై పడు భావరతము యొక్క విక్షోభ సంచలనము పొడకట్టుచున్నది. ఈసంచలనమును చిత్రకారుఁడు రూపురూపుగా బ్రదర్శింపనేరఁడు. ఒకవేళఁ బ్రదర్శింపఁ గలిగినను బదికంటె నెక్కువ చిత్తరువులను నాలిఖింప వలసి యుండును. అప్పటికైనను దానా దృశ్య ప్రదర్శనమందు నెగ్గిన వాఁడని చెప్పుట మిక్కిలి సాహసమే యగును. దీనిం బట్టిచూడ భావావిష్కరణమునకుఁ జిత్రకారునికంటెఁ గావ్యకర్తకె యానుకూల్యము లెక్కువగా నున్నవని తెలియుచున్నది.

## వ్యంగ్యచిత్రములు (Cartoons)

వ్యంగ్యచిత్రములు సమకాలీన దోషములను హేళన విధానమున గన్నులకుఁ గట్టినట్లు వ్యక్తపఱచును. ఇవి పండితులకును, పామరులకును సులభావబోధములుగ నుండి హృదయరంజకమై పరఁగుచుండును. కావున నివి హేళన కావ్యములు చేయఁజాలిన పనిని నవలీలఁ జేయఁజాలియుండును. కాని వ్యంగ్యచిత్రము లనేకములు తాత్కాలికాభిరుచి ప్రదములగు వైయక్తిక, సాంఘిక, రాజకీయ మతవిషయక దోషములను మాత్రమెత్తి చూపుటయందాసక్తి గలవై యుండుటచే, నివి చిరకాలము ప్రయోజనముఁ గలిగి యుండవు.

## స్థాపత్యము

ప్రతిమా రచనము, గృహప్రాసాద గోపురాది నిర్మాణము స్థాపత్యమను పేరఁబరఁగును. స్థాపత్యము సహితము చిత్రకళలో నొక మూఁగకళయె. ఇక్కడను లయ సామ

రస్యముండి, యది మానవుని ''భావనాత్మక వివేచన''ను (Man's imaginative reason) స్పృశించుచుండును. గెటీ మహాకవి స్థాపత్యమును 'ఘనీభూతగాన' మని నుడువు చున్నాఁడు. గానము వాక్కుల రూపముగాఁ బ్రవహించి శ్రవణేంద్రియములకు సొంపులు గూర్చునట్లె స్థాపత్యము సైతము శిలాలోహ లోష్ఠ దార్వాదులతో రమ్యాకృతులను నిర్మించి, తదాకృతులకు జీవముపోసి నేత్రేంద్రియ మెదుటఁ బెట్టుచున్నది. యోగికి శరీరమందుఁ బరమాత్మ యంతర్హితమై గోచరించునట్లు, శిలాతక్షకునికి గండశిలయందు సుందర ప్రతిమ లీనమైయుండుట గోచరించును. మఱి యోగి జీవాత్మను నావరించియుండు నుపాధులను దొలగించుటకై తన యంతఃప్రజ్ఞా సముజ్జ్వలమైన సంకల్పమును వినియోగించి తన తపోబలమునఁ దనలోని బరమాత్మను బడయు నట్లు, శిల్పియుఁ దన యులిని సుత్తెను నుపయోగించి బహు శ్రద్ధతోఁ జెక్కి గండశిలలోని సుందర ప్రతిమను గాంచగలుగును. కావున శిలాతక్షకాది శిల్పులను తపోబలముగల యోగులే యగుదురు. స్థాపత్య మితర లలిత కళలవలెఁ జూపఱకు భావోద్వృత్తిని గూర్చి బుద్ధిని వికసింపఁ జేసి ఆనందమొదఁ గూర్చును. 'ఆగ్రా' పట్టణమందలి 'తాజమహల్' అన్యాపదేశక గంభీరభావ గీతమువలె వ్యంగ్య వైభవముగ వెలసి, మనదృష్టి పథమునుబట్టి, సుందరమై, మహనీయమై, విస్మయావహమై, నానార్థక బోధకమై, ఉత్తేజనకరమై, శాంతి జనకమై, ఆనందప్రదమై విరాజిల్లుచుండును.

## కవి రచనము

కావ్య ప్రభావము తక్కిన కళల ప్రభావమునకంటె మిక్కిలి విపులమును, చిరస్థాయియునై యుండును. నృత్య, గాన, చిత్రలేఖన చిత్రరంజన ప్రతిమా రచనాది కళా నిర్మాణమునకును అంతరుత్పన్న ప్రతిభ కావలసియున్నను, కావ్యకళ కది యధికతరముగాఁ గావలసియుండును. కవితా రచన మితర కళలకంటె మిగుల జటిలమును, కష్టమును నైనది. కావుననే కవి స్వానుభవమును, ఆత్మ సంస్కారమును నెక్కువగాఁ బడసియుండుట యత్యంతావశ్యకము.

గానము, చిత్రకళ, కవితారచనము - వీనిని గుఱించి శ్రీ అరవిందు లిట్లు వచించినారు: "ఈ మూడును నాత్మకు సుప్రశస్తమైన విద్యాసంస్కారముం బ్రసాదించును. ఇవి యాత్మను, దాని ప్రవృత్తులను శుద్ధపఱచి. సంయమపఱచి, గంభీరపఱచి సమరసపరచును. ఇట్టిని మానవ జాత్యభివృద్ధికిఁ గార్యకారులై యుండుటవలన వానిని నూరక త్రోసిపుచ్చ రాదు; ఉదాసీన భావముతోఁ జూడరాదు. అవి శీలాభివృద్ధి కరములు కావనియొ, లేదా శీలమును గొంత యభివృద్ధి పఱచు నింద్రియ సుఖమును మాత్రమే యిచ్చునవనియొ తలచి వానిని జిఱుతపఱచుటయుఁ గూడదు. వాని నుపేక్ష సేయుచోఁ గలుగు నష్టములు మెండు. అవి సముచితముగ నుపయోగింపఁబడుచో, విద్యాసంస్కారమును జేకూర్చుట యందును, చిత్తోన్నతిని నలవరించుటయందును, నాగరకాభి వృద్ధిని నొడకూర్చుట యందును, మిక్కిలి సమర్థములై యుండును." ఒక కళావిదుఁడు చిత్రలేఖన చిత్రరంజనమునఁ

ధాను భగవంతుని దర్శించునట్లును, గానమున నాతని పలుకు వినునట్లును, కవిత్వమున నాతని ననుభవించునట్లును వచియించి తన రసానుభూతిని నావిష్కరించినాఁడు.

లలిత కళలు స్వచ్ఛంద వాతావరణమున వృద్ధి పొందునేకాని నిర్బంధమున్న తావులఁ జక్కఁగా లెదుగనేరవు. లలిత కళ లభిరుచి జనకములును, ఆహ్లాదప్రదములును, స్వేచ్ఛాయుతములును నగుక్రీడలయి పరఁగినప్పుడే విద్యార్థులకు వానియందు శ్రద్ధాభక్తులు జనించును. అంత వారు వానియందు సమాసక్తులై క్రీడాబుద్ధితో వాని నధిగమించి రమణీయ కళారచనలను సహితము రచింపఁ గలుగుదురు.

## 7. సారస్వతము, వాఙ్మయము, సాహిత్యము.

సారస్వతము, వాఙ్మయము, సాహిత్యము అను మాటలను నెట్టి నుద్దేశమును లేక విచ్చలవిడిగా (loosely) వాడుచున్నాము. ఈ యొక్కొక్క మాటకును అర్థవ్యాప్తిని నిర్ణయింప దొరకొనుట యావశ్యము.

దివ్యమైన సకలాంతః ప్రేరణములకు మూలకారణభూతురాలగు సరస్వతీదేవతా సంబంధమైనది సారస్వతము. అనఁగా సరస్వతీదేవి యధిష్ఠాన దేవతగాఁ గలిగి సర్వత్ర ప్రసరణగలది సారస్వతమగును. సకల లలిత ఫలిత కళలు, సకలచిత్ర వాస్తు శిల్ప యంత్రరచనలు, శిలాశాసనములు, నృత్యక్రీడలు, వాని గుఱించిన యఖిల విద్యలు, సకల సాంఘిక

రాజకీయ నైతిక మతవిషయక మానసికాధ్యాత్మిక వైదిక గ్రంథములు, వైద్య, జ్యోతిష్య, వాణిజ్య, భూగర్భ, శారీరక జంత్వాది శాస్త్రములు, తర్క వ్యాకరణాది శాస్త్రములు శ్రుతి స్మృతి పురాణేతిహాసములు, దేశచరిత్రలు, మానవ జీవిత చరిత్రలు, ధర్మశాస్త్రములు, భాషా నిఘంటువులు, పురాణనామ కోశములు, విమర్శ గ్రంథములు, విజ్ఞాన సర్వస్వములు, వేదములు, కథలు కథానికలు, నవలలు, నాటకములు, వ్యాసములు, ఉపన్యాసములు, కావ్యములు, ప్రబంధములు, దిన వారాది పత్రికలు మున్నగు వానికెల్లను సరస్వతియె యధిష్ఠాన దేవతగా భారతీయు లంగీకరించు చున్నారు; కావున నివి యెల్లను సారస్వత పరిధింజేరును. సంగ్రహముగాఁ దీనినే జెప్పిన, దేహమును, ఇంద్రియము లను, హృదయమును, బుద్ధిని, ఆత్మను స్పృశింపఁగల సర్వమును సారస్వతమగును. సారస్వత పరిధికి వెలియగు విషయము లట్టేలేవు. గ్రంథపట్టికలు, ప్రయాణ సౌకర్య దర్శనులు (route guides), సామాన్య పంచాంగములు, వట్టి వార్తాపత్రికలు మున్నగునవి సారస్వత పరిధికి వెలియగు పుస్తకములు.

వాఙ్మయ మనఁగా వాక్కుల మయము. పదములె, మాటలె వాక్కులు. ఏకపదమొ, అనేక పదసముదాయమొ పూర్ణ భావమును నిచ్చునేని భాషయగును. భాష ధ్వని (శబ్ద) (sound) రూపమగును, లిఖితరూపముగను, నుండును. ధ్వని రూపముగ నుండు భాష క్షరమైపోవును — చెడును, లిఖిత రూపముగా, అనఁగా నక్షరరూపముగా నుండుభాష క్షరము

కానిది - చెడకుండనుండునవి. కాని ధ్వనిరూపముగా నుండు భాషలోని సంవాదములు, ఉపన్యాసములు, గేయములు, నాటకములు మున్నగునవి గూడ 'రేడియొ' మున్నగు నిప్పటి శాస్త్రీయ సాధనములచేతఁ లిఖితములై చెడనివిగాఁ జేయఁబడుచున్నవిగాన, అట్టి ధ్వనిరూపముననుండు భాష సహితము వాఙ్మయ పరిధిం జేర నర్హమై యున్నది. చిత్తరువులు, శిల్పములు, ప్రతిమలు, యంత్రములు, వాస్తు నిర్మాణములు మున్నగునవి వస్తువులయి, వాక్కులు కావు గావున, నయ్యవి వాఙ్మయమునఁ జేరవు; కాని వాని గుఱించిన గ్రంథములు వాక్కులు గలవగుటచేత, వాఙ్మయ పదవాచ్యమున కర్హములేయగును. కావున వాగ్రూపమైన భాషయందుఁ గాని, లిఖితరూపమైన భాషయందు గాని యుండు సర్వవిషయములు వాఙ్మయ పరిధిం జేరుచున్నవి. ఈ సంగతులంబట్టిచూడ, సారస్వతమునకును, వాఙ్మయమునకును గల వ్యత్యాస మత్యల్పమని తేటపడుచున్నది. సారస్వత పరిధిం జేరు చిత్తరువులు, శిల్పములు, శిల్పయంత్రములు, వాస్తునిర్మాణములు మున్నగునవి తప్పఁ దక్కిన వన్నియు వాఙ్మయ పరిధిం జేర్చుటయె యుక్తమైయున్నది.

ఇంక సాహిత్యముం గూర్చి విచారింతము. రససహితమైనదే సాహిత్యము. అట్లగుట నే విషయములు సాహిత్య శబ్దవాచ్యములు? ఈ ప్రశ్నకుత్తరము కవులు, పండితులు, విమర్శకులు తమ తమ యభిమానముల ననుసరించియు అభిరుచుల ననుసరించియు నిచ్చుచుందురు. లాక్షణికులు కొందఱు తమ గ్రంథములకు 'సాహిత్య దర్పణ' మనియు

'సాహిత్య రత్నాకర' మనియు నామకరణము చేసి యున్నారు. ఆ గ్రంథస్థ విషయములఁబట్టి విచారింప, వారొసంగిన సాహిత్యనామము కావ్యమునకే తగియున్నది. మఱికొందఱు పండితులు తర్క వ్యాకరణాలంకారాదిశాస్త్రములకు సాహిత్యపద మన్వయించునని యందురు, "వేదవిద్యలును, సంగీత విద్యయుఁ గానివన్నియు సాహిత్య నిర్వచనంబున నిమిడియుండునట్లు శ్రీ హర్షుని యాశయముగా నుండవచ్చు" నని యొక విమర్శకుఁడు నుడువుచున్నాఁడు. "శృంగార నైషధమును దెనిఁగించిన శ్రీనాథకవి సాహిత్యమును విశదపఱచుచు, సాహిత్యమునకుఁ గావలసిన కొన్ని లక్షణములను స్పృశించి — "శబ్దంబనుసరించియు, అభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు" నని వచించుచున్నాఁడు. అట్లగుట నితఁడు సాహిత్యమన్నఁ గవిత్వమనియే యర్థము చేసినట్లు తెల్లమగుచున్నది. రామరాజభూషణుఁడు తన 'వసుచరిత్ర' మందు "సంగీత సాహిత్య నామక విద్యాయుగళంబు ఫల్గుఁ జెలికిం బాలిండ్ల జోడై" యని సంగీత విద్యను నొక స్తనముగను సాహిత్యవిద్యను మఱియొక స్తనముగను సరస్వతీదేవి కయినట్లు వర్ణించినాఁడు. ఇక్కడ సాహిత్యమనఁగాఁ గానకళ యనియె యర్థము. ఏలన సంగీత కవిత్వములకంత యొద్దిక యున్నది. కొందఱు సాహిత్యమున కర్థము వేఱువిధముగాఁ జేసినను, కవిత్వమనియె దాని కర్థము చేయువారనేకు లున్నారు. నిజముగ సాహిత్యమనఁగ భావప్రేరకమును, రసపోషకమును నగు కవిత్వమే

యగును; తర్క వ్యాకరణ చ్ఛందోలంకార శాస్త్రసమ్మత మగు కవిత్వమని నుడివినను నుడువవచ్చును. ఏ సారస్వత భాగము భావవిలసితమై, రసాశ్లిష్టమై, కళాభరితమై, ఔచితీ యుతమై, రమణీయార్థ ప్రతిపాదికమైయుండునో యదియె సాహిత్యము.

---

## 8. కవి కుండవలసిన ముఖ్య లక్షణములు.

కవికి ముఖ్యముగాఁ గావలసిన లక్షణము లేవి? కొందఱు తర్క వ్యాకరణ చ్ఛందోలంకార జ్ఞానంబవశ్యమని నుడువుదురు. దీనికిఁ దోడుగా లోకజ్ఞానము, మనన శాస్త్రజ్ఞానము, మేధ, రసభావాభిజ్ఞత కావలసియుండుననియుఁ జెప్పుదురు. అది యిది యననేల? 'కవి గాననిచోఁ గవి గాంచు' వాఁడగుటచే, వానికి సకల విద్యలు, సకల శాస్త్రములు, సకల కళాశిల్పములుఁ బడసియుండుట యవశ్యకము. కాని యే ప్రధాన లక్షణములు లేకున్నఁ గవి కానేరఁడు! భావన, (imagination), రసజ్ఞత (feeling), ఉపజ్ఞ (good original sense.) ప్రతిభ — యివి లేకపోయిన కవి గానేరఁడని ప్రాజ్ఞులు వచించువారు. ఈ నాల్గింటిని గుఱించి కొంత విచారము చేయుదము.

భావన :- భావన కేవలము, స్మృతి (memory) కాదు. స్మృతి ప్రమాణ ప్రవృత్తిచే ననుభూతమయిన విషయములను జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుట మాత్రమగును. భావనతో ననుభూత విషయములను జ్ఞప్తికిఁ దెచ్చుకొను

టయే కాక, చిత్తగత పూర్వానుభవములను బృథక్కరించు టయు, సమ్మేళన మొనరించుటయు నుండును. కనుక స్మృతి యనునది భావన యొక్క యేకదేశము మాత్రమే. భావన వలన మానవుఁ డూహాలల్ల గల్గును; పరుల యింగితము లెఱుఁగఁ గలుగును. వారి మనోభావములతోఁ దాను దాదాత్మ్య మొందగలుగును. నవనవ కల్పనలఁ జేయఁ గలుగును. నవ్యసృష్టులను సృజింపఁ గలుగును. లోకము నెఱింగి దాని యెడల సహానుభూతిని జూపఁగల్గును. ఆత్మా నందమును బడయఁగల్గును. భావనాశక్తిఁ గలవానికిఁ గావ్యాలంకారములు తమంతఁ దోఁపఁగాఁ, నాతఁడు రసభావ సంచలనమున కనురూపముగా దాని నుపయోగించును. అతఁడు సృష్టిపరిశీలనము చేయఁగలిగి, వస్తుస్వభావ తత్త్వ మును నెఱింగినవాఁడై యుండును; అతఁడు తన చిత్తము నందు బాహ్యజగత్తును బ్రవేశింపఁజేసి, దానితోఁ దాదాత్మ్య మొందఁగలిగి, దానిని దన జగత్తుగాఁ జేసుకొనఁ జాలును. వేయేల? భావనాపటిమగల కవి హృదయము విశ్వవ్యాప్తిగల దయి వెలసి, యతని రచనా విష్కృతులు చదువరులకుఁ గ్లేశముం గూర్పక, పరితృప్తియు, ఆనందమును గూర్పఁ జాలినవై యుండును.

రసజ్ఞత:- రసజ్ఞత సహృదయత యగును. ఎట్లన్న రసాస్వాదనము వలన మానవుని హృదయము శుద్ధియగును. నవరసములను దగినరీతి ననుభవించుట వలన మానవుని యనాగరక బాల్యస్వభావము సుశిక్షితమై వాని హృదయము మెనమువలె మెత్తనై, దిద్దితీర్చి యాకారింపఁ దగినదై

యుండును. అంత వాఁడు రసజ్ఞుడై శీలవంతుఁడై, యుచితజ్ఞుడై పరఁగును. రసజ్ఞుడును, శీలవంతుడు, ఉచితజ్ఞుడునునైన వాఁడు హర్షామర్ష భయోద్వేగాది నానావిధ రసభావము లను దన రచనలయందు సముచితిముగా బయల్పఱచువాఁడై, ఏ రసమునుగాని జుగుప్స పుట్టునంత యధికముగఁ బోషింపని వాఁడై యుండును. ఆతని స్వభావము నయ దయా దాక్షి ణ్యములకు లోనయి యుండును.

ఉపజ్ఞ:- ఉపజ్ఞ యనఁగా నుపదేశములేక తనంతనె పుట్టెడి జ్ఞానము. వ్యాధుఁడు క్రౌంచ మిథునములలో నొక దానిని గూల్చినపుడు, వాల్మీకికిఁ గల్గిన శ్లోకనిర్మాణ జ్ఞానము ఉపజ్ఞ. ఉపజ్ఞఁ గలవానికిఁ పరిదృశ్యమానములగు వస్తు విషయములె కావ్యములుగాఁ గన్పట్టుచుండును. వాని హృదయమునందుఁ గవితార్హములైన వివిధ భావంబు లుదయమందును. ఉపజ్ఞగలఁ గవి యంతఃకరణ పరిణామ ములను జక్కగాఁ బ్రతిపాదించువాఁడై, కావ్యౌచిత్యమును రమణీయంబుగాఁ బోషించువాఁడై, ఉద్దిష్ట రమ్యార్థమును పూర్వోత్తర విరోధములేక దృఢముగా నుపపాదించువాఁడై తాను బ్రతిపాదించు విషయములను మంజుల సంవిధానమున నమర్చి, "పొసఁగ ముత్తెపు సరుల్ పోహళించిన లీలఁదమలోన దొరయు శబ్దముల పొందికఁ" గల్గిన కావ్యములను రచించు వాఁడై విలసిల్లుచుండును. ఇతఁడు చేయు మనఃప్రత్యయ ములు (concepts) సంస్కరణ మందినవై, దోషవర్జితములై భాసిల్లుచుండును.

ప్రతిభ:- భావన. రసజ్ఞత, ఉపజ్ఞ పడసియున్న వానికి సకలశాస్త్రజ్ఞానము సులభముగాఁ బట్టువడును. ఇట్టివాని యంతశ్చైతన్యము సముజ్జ్వలమై యుండును. ఈ సముజ్జ్వలమగు నంతఃస్ఫురణయే – యంతశ్చైతన్యమే ప్రతిభనాఁబడును. ప్రతిభాశాలికిఁ బూర్ణదృష్టియుండి సముచిత బింబ కల్పనము చేయు శక్తియు నుండును. కవి ప్రతిభావంతుఁడై యుండెనా, చలువఁగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినట్లు యతని కవిత తేజరిల్లును. ఇట్టి కవికృతమగు కావ్యము కేవల బుద్ధి వలన రచింపఁబడినదిగాక, తన్నుఁ దానెఱిఁగిన చేతనవలన రచియింపఁబడిన దగుటచే, నయ్యది బాహ్యాభ్యంతర ప్రపంచము ననుసరించి సుందరమును, రమణీయమును, సునిశితమును, తేజోదాయకమును, హృదయోద్బోధకమును, అంతఃస్ఫోరకమునునగు విషయ విశేషములు గలిగి విరాజిల్లుచుండును. అతని భాషయందలి పదసమాస వాక్యముల జోడింపు పూమొగ్గయందలి పువురేకుల కూర్పువలె జిగిబిగి గలిగి, పుట్టములుగా విప్పుగొన్నప్పుడు పరిమళమును వెదచిమ్మునదై యలరారుచుండును. వెండియు సూర్యుని శుభ్రకిరణజాలము నభోంభఃకణ సముదాయముగుండఁ బోయినప్పుడు, పృథఃకృతములై వింతవన్నెలుగల యింద్రచాపరూపమును భాసిల్లునట్లు, శుద్ధసత్యము కవి ప్రతిభను బ్రవేశించి వెడలునప్పుడు నానారసభావ సంశోభితంబగు కావ్యరూపమున బయలు వెడలుచుండును.

## 9. జీవితము - కళ

ప్రపంచమున జీవితమునకంటె మించిన భాగ్యము లేదు. జీవితము మిక్కిలి పావనమైనది, చైతన్యాయుతమైనది, మధురమైనది. ఉత్తమప్రాప్తికి హేతుభూతమైనది. జీవితము ప్రవృత్తిజనకము; అనగా నూరకయుండునదిగాక కర్మప్రేరక మయినది. కర్మాచరణ నిమిత్తమే భగవంతుఁడు మనకు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, బుద్ధ్యాద్యంతఃకరణంబులఁబ్రసాదించియుండుట. ఎట్టిదైననుసరే కర్మ జీవుని కనుభవము చేకూర్చును.

ఏ కర్మయైహికాముష్మిక సుఖజీవనమున కనుకూలించునో యదియె నిజమైన కర్మ. మన యార్యులైహికాష్మిక జీవనమునే పురుషార్థము లనిరి. ఈ పురుషార్థములు ధర్మార్థ కామమోక్షములని చతుర్విధంబులై పరగుచున్నవి. పురుషార్థములనఁగాఁ బురుషుఁడు - జీవుఁడు అర్థింపదగిన భాగ్యములు.

ఈ జీవితమున కావలను సంసారమున్నది. ఇక్కడ సంసారమను పదము విపులార్థమున వాడబడినది. నిఖిల సంసారమును నిర్వహింపఁ గల్గుటకు ధర్మార్థకామములె ముఖ్య సాధనములు. ఈ పురుషార్థ త్రయమునందు విషయ విశేషములు పెక్కులిమిడి యున్నవి. సదభిప్రాయము, సదాలోచనము, సత్యసంభాషణము, సత్కార్మము, సజీవనము, సత్ప్రయత్నము, సన్మనస్కృత, సన్మననము, అని గౌతమ బుద్ధుఁడు నుడివిన యష్టాంగశీలమును సాధించుటయె ధర్మ సాధనమగును. ధర్మమును బురస్కరించుకొని సాధించు నర్థ

కామములె మనుష్యునకుఁ బ్రయోజనపడునని, అర్థము (ధనము) లేకున్న శరీరభరణము, స్వకుటుంబ పోషణము, దుర్లభమగును. గనుక, అర్థమును నార్జించు టత్యావశ్యకము. మఱి అర్థార్జనము అధర్మముతోఁ గూడినదై యుండునేని యది జీవితపతనమునకుఁ గారణమగును. అర్థార్జనము చేయుటకు శరీరారోగ్యమును, శరీరదార్ఢ్యమును ముఖ్యముగాఁ బొంద వలసియుండును. ఇఁకఁ గామ మనఁగాఁ గోరిక. మానవు నకుఁ బలు కోరిక లుండును. స్వకుటుంబ పాలన వర్ధన శిక్షణ విషయములగు కోరికలుండును; సాంఘిక రాజకీయ వ్యవహారము లందుఁదోడ్పడి, లోకమున సౌభ్రాత్రి మేర్పఱచి లోకసంగ్రహణమునకై పాటుపడవలయునను నభిలాష లుండును; రసజ్ఞుఁడై కళోపాసన చేయవలయునను కాంక్ష లుండును; ఇట్లు మానవుఁడు విశ్వశ్రేయంబునకై నిష్కామ కర్మ చేయుచుఁ తుదకు ముముక్షువు కాఁగోరుచుండును. కాని కొందఱు దేశకాలముల దుష్ప్రభావములకు లోనయి, ధర్మమోక్షములను విడిచి, యర్థకామములె ప్రధానము లని విశ్వసించి, దీని సంపాదనముకై జీవితమును ధార పోయుచుందురు. ఇట్టివారు భౌతిక వాదులు (Material-lists), నిరీశ్వరవాదులు, ఋణముచేసి ఘృతము భక్షింప వలయునను చార్వాకులు; పశులఁబీడించుటకై జంకనివారు. ఏ జనసంఘము నందిట్టివారు బహుసంఖ్యాకులై తమవర్తన మును మార్చుకొనక యుందురో, ఆ జనసంఘ మచిర కాలములోనే యధోగతిపాలగును. ఏ జనసంఘము నందధిక సంఖ్యాకులు పై నుడివిన చతుర్విధ పురుషార్థ సంపాదనము నకై పాటు పడువారై యుందురో, ఆ జనసంఘమె యుత్త

మోత్తమమైనది. అధోగతి పొందిన గొప్ప నాగరక జాతు
లన్నియు నిట్టి పతనముం బొందుటకుఁ దజ్జనుల మితిమీఱిన
యర్థకామములం దపేక్షయు, ధర్మమునం దుపేక్షయు,
స్వార్థపరతయు, పరపీడనమును గారణములై యున్నవి;
తమ జీవిత పరమార్థమును విస్మరించి, యింద్రియ సుఖమే
జీవితపరమార్థమని తప్పుఁదలఁచిన వారు.

జీవితమునుండి కళ వేరుగాఁ బ్రాదుర్భవించుటచేతను,
అది జీవితమును వెలయించి యుద్ధరింపఁ జేయుట చేతను,
కళకును జీవితమునకును సన్నిహిత సంబంధమున్నది. చతు
ర్విధ పురుషార్థ సంపాదనమె జీవితముయొక్క పరమార్థము
గదా. అట్లగుటచేఁ గళాసాహిత్యము లీపురుషార్థములను
లోఁతుగ వివరించి వెలయించి తత్సంపాదనమునకుఁ దోడ్పడు
నవై యున్నవి. కళాసాహిత్యములు ప్రజకుఁ గేవల హృదయా
హ్లాదమును, సుఖమును నొడఁగూర్చుటయేగాక, హృదయ
శుద్ధిని గలిగించి, జ్ఞానోదయం బలవరించి, చిత్తవికాసముం
జేకూర్చి, దృఢసంకల్ప శక్తిని నొడఁగూర్చి శ్రేయః
ప్రాప్తిని సమకూర్చును. ఈ కార్యములన్నిటిని నవి ప్రజకుఁ
దెలియకయే చేయుచుండును; ప్రాకృత జీవితము నుండి
సంస్కృత జీవితమునకుఁ బ్రజను నవ్యక్త రమణీయభంగినిఁ
దీసికొనిపోవుచుండును. భూస్థితమైన విత్తనము వర్షపాతము
వలన నెంత యవలీలగ నంకురించి వర్ధిల్లి వృక్షమై పశుపక్ష్యాది
భూతశ్రేణి కాశ్రయమగునో అట్లే మానవ హృదయాంతర్ని
హితమయిన కవితాశక్తి, సముచిత బాహ్యస్థితు లొనగూడుట
వలనఁ, బై కుబికి కావ్యమై, జీవితార్థ ప్రదర్శకమై, లోకోప
కారకమై భాసిల్లుచుండును.

మఱియుఁ గళాసృష్టి లోకముకొఱకే యైయుండును, గావునఁ గళానుభూతి సంఘమున్నంగాని పొసగనేరదు. సంఘజీవిత మనాగరక స్థితియందుండునప్పుడు దానికిఁ దగిన యసంస్కృత కళయె పుట్టును, సంఘమునకు అభ్యున్నతిఁ గాంచినప్పు డుత్కృష్టమైన కళ యుద్భవించును. ఎట్లన్న గవి దేశీయేతిహాస సంప్రదాయములను, ఐతిహ్యములను రసభావములను, మతధర్మములను, పరిసర స్వభావములను, నైతిక భౌద్ధిక సాంఘిక రాజకీయ పరిస్థితులను బురస్కరించుకొనియె తాత్కాలిక మానస మానసస్వభావమును గుర్తించి కళాకావ్య రచనకుఁ గడంగును. అతఁడు దీనిని మించిపోలేఁడు. కాని యొకానొకప్పుడు మహాకవి యొకఁ డుదయించి భావిగతులను దన యంతర్దృష్టితోఁ జక్కగాఁ గనుఁగొని, యుత్కృష్ట కావ్యమును రచింపఁ గల్గును. కాని యా కావ్య మానాఁటి జనుల కర్థముఁ గాకుండును. దానిని ననుభవమునకుఁ దెచ్చుకోవలయునన్నచో, సంఘము యొక్క సంస్కృతి యా మెట్టునకు రావలసి యుండును. కావునఁ గావ్యకళ సాధారణముగా సామాన్య జనజీవితము ననుసరించియె యుండును. "కానిఁ గావ్యకళ జనుల యాదర్శక జీవితమునుండి వేఱుచేయఁబడుచోఁ గళాదృష్టి నుండి కావ్యమును, జీవితదృష్టి నుండి జనసంఘమును గైవారిలి రెండును సంతృప్తికరములుగఁ దోపకుండును."

కవి సృష్టించిన కావ్య మాతనికి మాత్రమేఁ గాక, మానవసంఘ మంతకంతకును నిరంతరము ప్రయోజనపడునదై

యుండును. ఇదియే యున్నత నాగరకతాభివృద్ధికిఁ గవి యొసంగెడి శాశ్వతమైన వరదానము. ఉత్తమ సత్కావ్యము జీవితాదర్శకార్థ ప్రదర్శకమై, సర్వజన తేజోదాయకమై, అంతరదృష్టి సంజనకమై, రమణీయమై కొమరారుచుండును. సాహిత్య నాగరకతలు ఒకటితో నొకటి చేయూతఁగొని జోడుగ విహరించుచుండును.

జనులయందలి గుణదోషములు జాతీయ కళలయందుఁ బ్రతిఫలించుచుండు ననెడి 'రస్కిన్' మహాశయుని యభిప్రాయ మంచెంతయు సత్యమున్నది. ఉత్తమ కళాసృష్టి కేవల మనుకరణము వలనఁగాని, ఒరుల మేలిరచనలఁ గొంతకొంత కైకొని వానిని మేళన మొనర్చుట వలనఁగాని యున్నతస్థాన మందుటలేదు. ఉత్తమ రమణీయసృష్టి సంస్కృత జీవితము వలన నుదయమందుట నిజము. చెట్టు చెడినప్పుడు కుక్కమూతిపిందెలు పుట్టునట్లు, సమాజము చెడుచో, నందుఁ బుట్టు కళాకవిత్వములు కురూపములై, ప్రయోజన హీనములై యుండును.

లలిత కళాభ్యుదయమును బట్టి ఫలిత కళాభివృద్ధి యుండును. ఫలిత కళలు, లలిత కళలతో సమానాదరముం గాంచినప్పుడే జనాంగము ఆర్థిక సంపన్నమై, జీవిత సంతుష్టి గలదియై జీవిత పరమార్థము నెఱింగినదై, ఉచ్చదశనందినదై పరఁగును. ఏ సమాజమందుఁ గళాసృష్టియు, కళోపాసనయు నుండవో, అయ్యది వట్టి యుపయోగముం బట్టి వస్తువులను నిర్మింపఁజాలిన కేవల వణిక్సంఘమై యుండును. అది యెంత ధనసంపత్తి గలదియైయున్నను, జీవిత పరమార్థ

దృష్టినేవిదగు ఒక సమాజము నికృష్టమైనదై యుండును. ఒక సమాజము నాగరకతాభివృద్ధి గాంచిన దనుటకు దాని ధనసంపదనుబట్టి కాక, దాని పారమార్థిక జీవితమును బట్టియె నిర్ణయింపవలసియుండును. ఉత్తమమగు సాత్త్విక కళయు, ఉత్తమమగు సాత్త్విక జీవితమును నొండొకటి పొత్తు బాయనివై యేకముగ నుండును.

కళ పురుషార్థ సంపాదనమునకుఁ దోడ్పడునని నుడివితిమి. అది యెట్లో పరిశీలింతము. కళాసృష్టి రమణీయసృష్టి; అందు దివ్యసౌందర్యము గోచరించును. ఇట్లు గోచరించు దివ్యసౌందర్యమును నిర్మల హృదయముతోఁ బ్రేమించుట సహజము. ప్రేమ సాత్త్విక గుణంబగుటవలన నయ్యది మానవుని దైవసాన్నిధ్యమునకుఁ గొనిపోవునదై యున్నది. మఱియు సత్ప్రవర్తనము, నిర్మల జీవనము, లోకహిత సేవయుఁ, బ్రేమయొక్క ప్రతీకములె యగును. కావునఁ గళాస్రష్ట తాను సృజించు రమణీయ సృష్టులంబట్టి సత్ప్రవర్తనమందును, నిర్మల జీవితమందును లోకహితసేవన మందును — ధర్మార్థకామ మోక్షములందు — జనుల కనురక్తిని బుట్టించువాఁడయియుండును. ఇంక కళోపాసకుడో (art lover) కళాసృష్టులందలి సౌందర్య రసంబును నాస్వాదించువాఁడే కాక తత్ సృష్టులయందుండి జీవితాదర్శమును గూడ గ్రహించువాఁడై యుండును. జీవితాదర్శములను గ్రహించు వ్యక్తి సమాన దయాదాక్షిణ్య సౌజన్యాది గుణంబులతో నొప్పారి పరిశ్రమాసక్తుఁడై, లోకోపకారియై, సర్వజన

సౌందర్యము గలవాఁడై సంతసిల్లుచుండును. ఏ సమాజము తన కళాభికాంక్షను నావిష్కరించుకొనుట కవకాశమును పుట్టింపఁజేసికొనదో యది యాత్మోపలబ్ధిని పొందనేరదు.

## 10. కవిత్వ నిర్వచనము

గోవు వలని ప్రయోజనము నుడువుట సులభము కాని దాని స్వరూపమును నిర్వచించుట సులభము కాదు. మన యింటి యావును గుర్తుపట్టుట సులభము కాని దాని స్వరూపమును వచించుటెంతయుఁ గష్టము. ఇట్లే కవిత్వ మిది యని నుడువవచ్చును గాని కవిత్వ తత్త్వస్వరూపమును నిర్వచించుట, యసాధ్యము గాకపోయినను, సులభసాధ్యము కాదు. కవిత్వ స్వరూపము, ఎండమావులవలె, దూరము నుండి కాన్పించును గాని, దానిఁ బరిశీలింప సమీపమునకుఁ జనుచో నది దవ్వులఁ బోవుచుండును.

కవిత్వ మనవేమి యనుటను విమర్శకులేమి, కవులేమి, పాశ్చాత్యులేమి, ప్రాచ్యులేమి విచారించియున్నారు. వీరిలోఁ గొందఱి యభిప్రాయములను దెలిసికొందము.

"ఛందోబద్ధమగు వాక్య రచనయే కవిత్వ" [1] మని జాన్సన్ తన నిఘంటువునందు నుడువుచున్నాడు.

---

1. Poetry is 'metrical composition.'

కోర్ధోపు, ఛందోబద్ధమైన భాషలో భావనాకలితములగు తలంపులను, రసములను యథారీతి నావిష్కరించి, తన్మూలమున హృదయోల్లాసమును జేకూర్చు కళయె కవన' 2 మని వచించుచున్నాఁడు. కార్లైలు "శ్రవణ రంజకమైన భావోత్కర్షమె కవిత్వ" 3 మని చెప్పుచున్నాఁడు. హృదయోద్వేగమును శాంతిసమయమందు స్మృతిపథమునకుఁ దెచ్చుటయె కవిత్వ" 4 మని వర్డ్సువర్తుకవి పల్కువాఁడు. 'జనజీవితమందలి సర్వజనీనమైన విషయమును నావిష్కరించుటయె కవిత్వ' 5 మని బుచ్చరు వాకొనుచున్నాఁడు. ఎమర్సన్ 'ప్రాతిభాసిక ప్రాపంచిక విషయములం గూర్చి సహృదయుం డావిష్కరించునదే కవన' 6 మని వాకుచ్చుచున్నాఁడు. 'మానవుని సమగ్రమైనట్టియు, ఉన్నతమైనట్టియు నుడికారమె కవిత్వ' 7 మని మాథ్యు అర్నాల్డ్

---

2. Poetry is the art of producing pleasure by th just expression of imaginative thought and feeling musical language,

3. Poetry we call Musical Thought.'

4. Poetry is 'emotion recollected in tranquility'

5. Poetry is an expression of the universal in human life.'

6. Poetry ' is the expression of a sound mind speaking after the ideal and not the apparent.'

7. Poetry 'is simply the most delightful and perfect form of uttrance that human words can reach.'

నొడువుచున్నాఁడు. బేన్ అను పండితవర్యుడు 'భాషారూపమున గాంచిన భావముచే హృదయమును నలరింపఁజేయునట్టి లలితకళయె యుత్తమ కవిత్వ'[8] మని యనుచున్నాఁడు. వేట్సొక మహాశయుఁడు 'పదముల నుపయోగించి యత్మావిష్కరణమును, వస్తుసాక్షాత్కారమును గల్పించుటకై మానవుఁడుచేయు గభీరప్రయత్నమె కావ్య'మని వక్కాణించుచున్నాఁడు, 'గంభీరమగు తాత్త్వికార్థమును బ్రతిపాదించు కావ్యమె యుత్కృష్టమైన'[9] దని డూయీ పల్కుచున్నాఁడు. బుక్కాక 'సంసార ప్రపంచమందుఁ దాను గనుఁగొన్న నూత్నార్థములను రసావేశమున మననము చేసికొని శ్రవణపేయముగాఁ జెప్పునతఁడె కవి'[10] యని యుగ్గడించుచున్నాఁడు.

ఇవి కవన విషయమైన కొన్ని పాశ్చాత్యుల యభిప్రాయములు. ఇంకఁ దద్విషయమై ప్రాచ్యుల యభిప్రాయములను గొంత తెలిసికొందము.

విశ్వనాథుఁడు 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మని నుడువువాఁడు. ఇక్కడ రసమునకు సౌందర్యమనెడి యర్థము గ్రాహ్యము. పండితరాయలు 'రమణీయార్థ ప్రతి

8. Poetry is a fine art operating by means of thought conveyed in language

9. The best poetry is that which is informed by the soundest philosophy.

10. The poet is he who sees life, newly, assimilates it emotionally and countries to utter it musically.

పాదిక శబః కావ్య' మ్మని వచియించెను. రమణీయ విషయ ములను బ్రతిపాదించు శబ్దమే కావ్యమని యాతని మతము. 'విశ్వశ్రేయః కావ్య' మ్మని వాగనుశాసనుఁడు పలుకు చున్నాఁడు. ఇందుఁ బ్రయోగింపఁబడిన 'శ్రేయః' శబ్దము విశేషార్థప్రదమై యున్నది. ఇట్లు చెప్పినప్పుడు కవి కఠోప నిషత్తులోని రెండవ వల్లియందలి

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతః
తౌ సంపరేత్య వివినక్తి ధీరః
శ్రేయోహి ధీరోభి ప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే'

యను శ్లోకమును జ్ఞప్తియం దుంచుకొని యుండును. పై శ్లోకమున కర్థము - శ్రేయస్సును ప్రేయస్సును మనుష్యుని గూర్చి వచ్చుచున్నవి. ధీరుఁ డీరెంటిని విచారించి, వేఱు పఱచి, శ్రేయస్సునే వరించును; మందుఁడన్నను యోగ క్షేమములతోఁ గూడిన ప్రేయస్సునే వరించును. ప్రేయ స్సనఁగా యోగక్షేమములుగల యైహిక సుఖము; శ్రేయ స్సనఁగా శుభము, ధర్మము, మోక్షమును నగును. కావున సమస్తమగు నైహికాముష్మికా సుఖమును గలిగించునదే కావ్యమని యాతని యాశయము. మమ్మటాచార్యుఁడు

"నియతి కృతి నియమ రహితాం
హ్లాదైక మయీ మనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితి మా దధతి
భారతీ కవేర్జయతి," అని కవి సృష్టిని కొనియాడు

చున్నాఁడు. కవియొక్క వాణి సాంకేతిక నియమములకు

బద్ధముగాక యానందైకమయమై, నవరస రుచిరమై, లోకో త్తర వర్ణనాచాతుర్యము గలదై, స్వతంత్రముగ నిర్మింపఁ బడినదై వెలయుచుండుననని యాతని యభిప్రాయము. శ్రీ అరవిందుల యభిప్రాయ మిది: "కవితా రచన మొక మనో వైజ్ఞానిక ప్రవృత్తి; ఆ కవితోద్రేకము మానవుని మనస్సు యొక్కయు, ఆతని యంతరాత్మయొక్కయు నుత్కటశక్తి ప్రేరితమైనదైన యావిష్కరణము." *

ఇంక కవిత్వ విషయమై తెనుఁగు వారి యభిప్రాయ ములను గొంత తెలిసికొందము —

"అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయ కాదె కవి వివేకంబు.

కొద్ది మాటలతోడనె విషయ విశేషంబులఁ గల్పించుటే కవిత్వమని నన్నెచోడుఁడు నుడువుచున్నాఁడు. కొందఱు దీనికి వ్యతిరేకముగాఁ దేటతెల్లముగా భావమును దెలుపుటె కవనము కాదనియు, చమత్కారముగా భావమును వ్యక్తీ కరించుటయే కవిత్వమనియు; ఇట్లు చమత్కారముగా, రసోజ్జ్వలముగా భావమును బ్రకాశపఱచుట కెక్కువ మాటలతో డాంభికరీతిఁ బలుసమయములఁ జెప్పవలసియుండు ననియు నుడువువారు. ఇందులకుఁ బ్రమాణముగా వారు 'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య' మ్మనుటను వచించుచున్నారు. పెద్దన 'యుక్తి విశేషము కబ్బం। బుక్తి

* Poetry is a psychological phenomenon, the poetic impulse a highly charged force of expression the mind and soul of man.

విశేషంబు గాదు' అని చెప్పువాఁడు, అర్థయుక్తి విశేషమె - అర్థగౌరవమె - అపూర్వార్థ కల్పనమె కవనముగాని, శబ్దముల పొందిక, లాలిత్యము మాత్రము గల కవిత్వము కవిత్వము కాదని యాతని మతము. దీనినే విడఁదీసి చెప్పిన, వాగాడంబరముగల వాచ్యకవి కవిగాదనియు, స్వానుభవమును భావంబునఁజొప్పించి, రసముప్పతిల్లఁగఁజేయువాఁడె నిజమైన కవియనియు నాతని హృదయంబగుట తేటపడుచున్నది.

క॥ "చతురోక్తుల నుతిపద బహు
గతుల నలంకార భావకాంతి రసార్థో
న్నతిఁ గృతి నతి రసికులు వర
సతి గతి నెలిఁగింప వలదె సౌభాగ్యమునన్."

చాతుర్యముగల మాటలతోఁగూడి, పదముల కూర్పులు బహువిధ రసభావముల కనురూపములుగా నుండి, అలంకారములు, భావకాంతి, రసస్ఫూర్తి విషయోన్నతికిఁ దగినట్లు వెలయించి, తన ప్రియసతి పలుకు పలుకులు రసికుఁడగు పతికింపగునట్లుగాఁ గావ్యము చెప్పవలయునని కవి నుడువుచున్నాఁడు. ఇంకొక కవి 'ప్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్' అని వచించుచున్నాఁడు. ఇక్కడఁ బ్రకృతియనగా బాహ్యాభ్యంతర ప్రకృతులని యర్థము. బాహ్యాంతర ప్రకృతులకు భాష్యములను వ్రాయువారే కవులని భావము. ప్రకృతికిన్ భాష్యము వ్రాయుటయనఁ బ్రకృతి ప్రక్రియల గమనించి, వానిని జీవితార్థములకు రమణీయముగా, రసోల్లసితముగా నన్వయించి పలుకుట యని తాత్పర్యము.

మఱియొకకవి కబ్యమును గుఱించి యిట్లు నుడువు చున్నాఁడు —

చ॥ "కవిత యనంగఁ బద్యములు
గద్యములున్ రచియించుటౌనె? భా
వ విలసనంబు, లోకహిత
వర్తనముం బచరింపఁ జేసి, క
న్గవకును నద్దమెట్లటుల
గ్రంథచమత్కృతి సేర్పు పెంపునన్
బ్రవిమల వస్తుతత్త్వమును
భాసిలఁ జేయుటగాక యారయన్."

గద్యపద్యముల నల్లుట కవిత్వము కాదనియు, భావ పరిపాకము గలిగి విశ్వశ్రేయమగు జీవనమును బ్రసరింపఁ జేసి, అతిశయమగు చమత్కృతి గలిగి, మానవుని స్వస్వరూపమును బ్రతిఫలింపఁ జేయఁజాలిన పవిత్రమగు వస్తుతత్త్వమును వెలయింపఁ జేయునదె కవనమని వక్కాణించుచున్నాఁడు.

కవిత్వ తత్త్వ స్వరూప విషయమైన యీ నిర్వచనములు వారివారికిఁ గవిత్వముపట్లఁగల యభిమానమును బట్టియు, అభిరుచింబట్టియు వచింపఁబడినవై యున్నవి. కనుక నివియతి వ్యాప్తిదోషమునకో, అవ్యాప్తిదోషమునకో గుఱియైయున్నవి. ఇయ్యవి కవిత్వ తత్త్వ స్వరూపమును నిరూపింపఁజాలినవై యుండుట నిజమే, కాని విమర్శన దృష్టితో వానినిఁ బరిశీలించునప్పుడు వానిలోఁ గొన్ని మిక్కిలి సంకుచితములై కవిత్వ తత్త్వ స్వరూపమును యథాతథముగా నిర్ణయింపఁజాలకున్నవి. కవిత్వ తత్త్వ

స్వరూపమును వచోవలయంబున బంధించుట సులభసాధ్యము గాదు. కనుకఁ గొన్ని పద్యములను నిదర్శనములుగాఁ గొని, వాని నాశ్రయించి కావ్యతత్త్వ స్వరూపంబును ననుభవమునకుఁ దెచ్చుకొనుటకుఁ బ్రయత్నింతము. ఇదియె సులభతరమైన మార్గము.

## 11. కవిత్వ విరూపణము

వైద్య జ్యోతిషాది గ్రంథములందలి విషయంబులు ఛందోబద్ధములై యున్నవి; అంతమాత్రమున నా గ్రంథములు కావ్యనామమునకుఁ దగినవై యుండుటలేదు. విషయములను సులభముగా జ్ఞప్తియందుంచుకొనుటకు శ్లోకములు, పద్యములు ననుకూలించును గావున నయ్యవి ఛందోబద్ధములు చేయఁబడినవి. అందలి శ్లోకము లేవేని రసోల్బణము గలిగియుండునేని, యవి కావ్యపరిధిం జేర్పఁబడుట కర్ణమగును. ఉదాహరణము :—

> శ్లో॥ "నఖముఖ లాలన సుఖదాపామా
> వామా నితంబ విస్తారా
> స్నేహా కనకరస గంధిః గచ్ఛతి
> పూర్వాపరా వశం యాతి."

పామ యనఁగా గజ్జి, వామ యనఁగా స్త్రీ. గజ్జి నఖముఖలాలనమున (కొనగోళ్ళతో గోఁకికొనుటవలన) సుఖమిచ్చును; అది నితంబములందు (పిఱుఁదలందు వ్యాపించునది;) స్నేహా—

కనకరస గంధములచే (నూనె, ఉమ్మెత్త, పాదరసము, గంధకము వీనిచే) గచ్ఛతి – పోవును. స్త్రీ నఖ ముఖ లాలనములచే (నఖ క్షతాదులచే) సుఖము నిచ్చును; అది విస్తారములగు నితంబములు (పిఱుఁదులు గలది); స్నేహ కనక రస గంధములచే (చెలిమి, బంగారు, రసము, గంధము వీనిచే) వశం యాతి - వశమగును. ఇందు శ్లేషాలంకారము చేతను, 'పామా వామ' లను శబ్దసామ్యము గల పదముల చేతను రసముత్పన్నమైనది గావునఁ గావ్యతా గుణమున్నది. కాఁబట్టి యెట్టి విషయముగాని కవిశక్తివలనఁ గావ్యతా గుణముఁ బొందఁగలుగుచున్నది.

కావ్యవస్తువులు బాహ్యాప్రపంచిక విషయంబులుగాను, భావప్రాపంచిక విషయములుగాను నుండవచ్చును. తానుగాని దంతయు బాహ్యాప్రపంచము; తన మనంబునకును నాత్మకును సంబంధించిన దంతయు భావ ప్రపంచము. భావ ప్రపంచ మునె మనః ప్రపంచమనియు, అంతర ప్రపంచమనియు, మానవ ప్రపంచమనియుఁ జెప్పుదురు. తరులతానికుంజ నదీ నద కాననకాసార విద్యుత్పవన కాదంబినీ గుహాపర్వత పత్త్ర నాదులును, క్రిమికీటక సరీసృప పశుపక్షి మానవులును, మఱియుఁ బంచేంద్రియ గోచరములగు సకల వస్తువులును, లోకవృత్తములును, బాహ్యాజగత్తునకుఁ జేరినవి. కావుననే వామాపామలు బాహ్యాజగత్తునందలి విషయంబులె యగును. రస-భావములు సత్యాసత్యములు, జనన మరణములు, నిద్రాస్వప్నములు, త్యాగ మోహములు, ఆత్మ చేతనలు మున్నగు మనోగోచరములగు విషయంబులన్నియు భావ

జగత్తునకుఁ జేరినవి. భావజగత్తునకు జేరిన విషయంబులను వర్ణించునది భావకావ్యమగును. కాని భావజగత్తును దన యాంతర జగత్తుగఁ జేసికొని, యారెంటికిని సామరస్యమును బొందుపఱచి యావిష్కరించుటయుఁ గలదు. ఇట్టిది గూడ భావకవిత్వమగును. రసభావావిష్కరణము లేకున్న నిజమైన కవనమే పొసగఁదనుట నిజమె. ఈ కారణమున భావకవిత్వ మను పేరు నిరర్థకమని కొందఱు చెప్పుదురు. కాని రస భావావిష్కరణ మధికముగాఁగల కవిత్వము లయాన్విత ముగాఁజెప్పఁబడినప్పుడు, దానికి భావకవిత్వమను సాంకేతిక నామమిడుట తప్పుగాదని తోఁచుచున్నది.

దుష్యంతుఁడు గాంచిన కణ్వాశ్రమంబును వర్ణించు టలో నన్నయ కవి

సీ॥ "శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడి శుకముల చదువుగలిగి,
కదలక వినుచుండు కరులయుఁ గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరంబు
కణముల చల్లని గాడ్పున పడిదానిఁ
జెంది సుఖంబున్న సింహములయు,
భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు

గీ॥ కడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్న యెలుకల పిల్లుల యొండు సహజ
వైరితత్త్వంబులయు సహవాసమపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమందె."

వని నుడివినాఁడు. మునిశక్తివలన వనములు శాంతిభూయిష్ఠ
ములై యందలి జంతుజాతములు తమ సహజవైరమును వీడి
యున్నవని కవి కణ్వాశ్రమంబును సహజముగను, రమణీ
యముగను వర్ణించినాఁడు. మునిప్రభావమున కట్టిశక్తి
యుండునని యెఱింగినవాఁ డగుటచేతను, అట్టి శాంతియుత
మగు నుత్తమ కాలము ముందొకానొకప్పుడు వచ్చునని
యాశించువాఁ డగుటచేతను నన్నయ యట్టి వర్ణనము చేసి
నట్లు తోఁచుచున్నది. ఈ పద్యమందు బాహ్యవస్తువగు
మున్యాశ్రమమె వర్ణింపఁబడినది. కవి తన నిశిత దృష్టితోఁ
బరిశీలించి యూహించిన సంగతులనే మన యెదుటఁ బెట్టి
నాఁడు; కాని తన యాత్మానుభవముతో విషయములను
మేళవించి, వానిని దన యాంతర జగత్తుగాఁ జేసికొని, యా
విష్కరింపలేదు. ఇందు బాహ్యప్రకృతివర్ణనము మాత్రమున్నది.

'శృంగార నైషధము' లో నలదమయంతుల కౌతుకా
గారమును వరించుచు శ్రీనాథకవి విద్యుద్దీపములు వెలుఁ
గుచుండినట్లు నుడువుచున్నాఁడు.

సీ॥ ఒక దీపమార్చిన నున్న దీపంబులు
నప్పుడ తమకుఁ దామారుటయును,
దాల వృంతానిల చేలాంచలాదిక
వ్యాపారముల దీపమారమియును,
నారిన దీపంబు లప్రయత్నంబుగ
మఱి చూడఁజూడంగ మండుటయును,
మండి యారియు నారి మండిన దీపంబు
వెలుఁగుఁ జీఁకటియుఁ గావించుటయును,

గీ॥ గలుగునట్లుఁగ వరశక్తిఁగడఁక రాజు
శిల్పమున నప్పటాలకుఁ జేయుచుండ...

శ్రీనాథకవి పదియైదవ శతాబ్దియారంభమున నుండిన వాఁడు. ఆ కాలముననె విద్యుద్దీపములు (Electric lights) అపురూపమున నుండునని తెలియుచున్నది. విద్యుచ్ఛాస్త్రము "సౌదామినీశాస్త్ర" మను నామమున మన దేశమందుండినట్లు శ్రీ బెంగుళూరు సూర్యనారాయణరావుగారు వచింపఁగా నేను చదివియువినియునున్నాను. శ్రీనాథుని విద్యుద్దీపముల వర్ణన కేవల మూహాకల్పితము గాదు; ఆతఁడా శిల్పచమత్కారము ప్రదర్శింపఁబడుట కనులార నెందో చూచి యుండవచ్చును. కవి తనరసభావముల నందుఁ జొప్పింపక, యెట్టి అలంకారములను గూర్పక, వర్ణనకుఁగడంగక, ఎక్కువగను దక్కువగను మాటల నుపయోగింపక, చూచిన దానిని జూచినట్లు చెప్పినాఁడు. ఇట్టి కవితాభాష "నగ్న" (The language of poetry is bare) మని చెప్పుదురు. ఇట్టి నగ్న భాషయందు, వ్రాయబడిన కవిత్వమెల్ల కావ్యములందును నుండును. శ్రీనాథుని కాలము నాఁటికి విద్యుద్దీపములు వింతయగు సుందరవస్తువులైయుండు కారణమునఁదద్వర్ణన మాకాలపు జనులకు మిగుల నభిరుచిజనకమై వింతగా యుండుననుటకు సందేహము లేదు.

క॥ "ఇనుఁడు దనకడకు నేతెం
చిన రాగ ముఁబొందుటది యుచిత మనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం
గన జనసుభావనలను గౌతుక మందెన్.

విరాట పర్వము నందొక్క యెడ సూర్యాస్తమయ వర్ణనమును తిక్కనార్యుఁడీపైని పద్యముతో బ్రారంభించినాఁడు. ఇక్కడ 'నినుఁడు,' 'రాగము' అను పదములను శ్లేషముగాఁ గవి ప్రయోగించినాఁడు. మగఁడు భార్య కడకురాఁగా నామె సంతోషమున వివర్ణయైనట్లు, సూర్యుఁడు పశ్చిమదిశను జేరఁగా నక్కడఁ గెంపావహించెనని యర్థము. కవి యీ వర్ణనమందు సూర్యాస్తమయమును బాహ్య వ్యాపారమును (phenomenon), దన యనుభవముతో- తన చెంతకుఁ దన భార్య రాఁగఁగలిగిన యనురాగానుభవ ముతో- సామరస్యముం బొందుపఱచి రమణీయముగా నీ పద్యమును నుడివినాఁడు.

ద్రౌపది మహానస గృహంబునకు రాత్రివేళఁ బోయి తన పరాభవంబును గూర్చి భీమసేనునితోఁ జెప్పి, యాతనిం గీచకు వధకు నొడంబఱచి, పిదపఁ 'దన నిద్రించు నెలవునకుం బోయి, పర్యఁకభాగంబునఁ దనువువైచి' యంకిలిదేఱని డెందంబు కొందలంబుతోడి నిశ్చయంబుఁ బొరయ నిద్రం బొరయని కనుదోయి మొగిడ్చియుండె.' అంతఁ బ్రభాతంబయ్యె- ఆ ప్రభాత వర్ణనమును తిక్కనార్యుఁడు కథతో నిమిడ్చి యెంత రమ్యముగాఁ జెప్పినాఁడో కనుఁడి:

తే॥ 'ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచునున్న సరసి
వేఁడినిట్టూర్పులోయన వెడలెఁ గొత్త
కావి మూతులు విచ్చు నెత్తమ్మివిరుల-'

ఇందు కవి హృదయము బాహ్యప్రపంచముతో నైక్యముం బొందగాఁ "బ్రకృతికిఁ భాష్యపరిణేతయైవాఁడు కవి తిక్కన. ఇట్లు బాహ్యవిషయములను కథావస్తువుతో, సాంసారిక ప్రపంచముతో సమ్మేళన మొనరించి చెప్పుట కవులకు సహజమె. లోకమందు మానవులకుఁ దమ యాంతర ప్రపంచము ననుసరించి బాహ్యప్రపంచము గోచరించుట నిసర్గమె కదా.

చ॥ 'తరుణి ననన్యకాంత నతి
దారుణ పుష్పశిలీ ముఖవ్యథా
భరవివశాంగి నంగభవు
బారికి నగ్గముచేసి క్రూరుఁడై
యరిగె మహాసురాధముఁడ
హంకృతిలో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన న
భోమణి దాల్చెఁగషా యదీధితిన్'

ఈ పద్యమున పెద్దనార్యుఁడు వరూధినీ ప్రవర్తనము విషయమై తనకుఁగల యామోదమును, ప్రవరుని విషయమైన ద్వేషమును గుప్తముగా నుడువుటకై యవకాశమేర్పఱచికొని' సాయంకాల వర్ణనమును వెపముగాఁ బెట్టుకొని, ప్రకృతికి వరూధిని యెడ సహానుభూతి యుండునట్లును, ప్రవరుని యెడనమర్ష ముండునట్లును వర్ణించినాఁడు.

క॥ 'కరకా చిటపట రవ భీ
కరమై ఫెళఫెళ నినాద ఘనమై ఝంఝా

మరుదుద్ఘూత బిల మంద్ర
స్వరమై యకాండ నొక్క వర్షము గురెసెన్"

ఈ పద్యమున వడగండ్లతోఁ, నుఱుములతోఁ గూడిన వర్షపాత రవము చెవులకు సోఁకునట్లున్నది. పెద్దనకవి యిక్కడ భావమున కనురూపమయిన శబ్దములను బొందుపఱచి శ్రవణ రంజకముగను, హృదయం గమముగను వర్షమును వర్ణించి యున్నాడు. ఇక్కడ భావసౌందర్యముగాని, అతిశయమగు బింబసౌందర్యము (Beauty of the image) గాని, రససౌంద ర్యము (Beauty of Emotion) గాని లేదు. ఇందు శబ్ద మాధుర్య ముండఁబట్టి శైలిని 'నగ్న'మనిచెప్ప నలవికాదు.

ప్రవరుఁడు దానింటలేమికిఁదన తల్లిదండ్రులు, భార్యయు శిష్యులును నెంత దుఃఖింతురో యని చింతించుచు, అతిథి సంతర్పణంబులు, నిత్యకర్మలు నేమయ్యెనో యని విచారము పొందుచుఁ దనమనోవేదనను వెళ్ళఁబోసికొను చున్నాఁడు. ఈ క్రింది పద్యమునందు స్మృతికిఁ దేబఁడినభావము లెంత స్వాభావికముగను, సర్వజన హృద్యముగను నున్నవి! ఆ నుడి కారమెంత సొంపుగానున్నది! ముఖ్యముగఁ "బాఅవైచితె మిన్నులు వడ్డచోట", యను పలుకు లాపద్య మునకుమకుటప్రా యమై యెంత కరుణ రసస్ఫోరకము లైయున్నవి! చూడుఁడు

సీ॥ 'నను నిముసంబు గానకయున్న నూరెల్ల
నరయు మజ్జనకుఁడెం తడలునొక్కొ.
యెపుడు సంధ్యలయందు నిలువెళ్ళనీక న
న్నోమెడు తల్లి యెం తొడలు నొక్కొ.

యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మదినెంత గుందునొక్కొ,
గెడ తోడునీడలై క్రీడించు సచ్ఛాతు
లింతకు నెంత చింతింతురొక్కొ.

గీ॥ యతిథి సంతర్పణంబు లేమయ్యె నొక్కొ,
యగ్ను లేమయ్యె నొక్కొ, నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ! కినుక నిట్లు
పాఱవైచితె మిన్నులు వడ్డ చోట."

హిమగిరిలోఁ బ్రవరుండు సంచరించునప్పుఁ డాతని రూపరేఖావిలాసంబులం గాంచి మదనార్తిపడు వరూథిని యాతని దారి కడ్డుచని నిలచెను, ప్రవరుండు విభ్రాంతుఁడై

ఉ॥ 'ఎవ్వతె వీవు భీత హరి
ణేక్షణ? యొంటిఁ జరించె దోటలే
కివ్వనభూమి? భూసురుఁడ
నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవఁదప్పితిన్
గ్రొవ్వున నీ నగాగ్రమున
కుం జనుదెంచి; పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగద
వే తెరువెద్ది శుభంబు నీకగున్.'

అని తన కథ నెఱింగించి త్రోవ నడిగిన. నవ్వేలది 'చిఱు నవ్వుతో' నిట్లనియె. ఈ చిఱునవ్వులో నెంత భావము గర్భీభూతమై యున్నదో చదువరు లూహింతురు గాక, తొలు

చిఱు నవ్వు తాను 'నర్మగర్భంబుగాఁ జెప్పఁబోవుదాని కుపో
ద్ఘాతమై యున్నది.

ఉ॥ "ఇంతలు కన్నులుండఁ దెరు
వెవ్వరివేఁడెదు భూసురేంద్ర! యే
కాంతము నందు నున్న జవ
రాండ్రి నెపంబిడి పల్కరించు లా
గింతయ కాక, నీవెఱుఁగ
వే మునువచ్చిన త్రోవచొప్పు? నీ
కింత భయంబు లేకడుగ
నెల్లిదమైతిమె? మాటలేటికిన్."

ఈ పై పద్యమందు గర్భితంబైన నర్మాభిప్రాయ
మేమొ విచారింతము. వరూధిని, 'ఇంతలు కన్నులని తన
పుడిసిలి చూపి మడువుటలో ప్రవరుని కన్నుల సౌందర్య
మును, 'భూసురేంద్ర' యని సంబోధించుటలో రంభాది
యప్సరసలకును నిందునికిని నెట్టి సంబంధమున్నదో యట్టి
సంబంధమే యప్సరోంగనయగు తనకును భూసురశ్రేష్ఠున
కును గలుగునను సూచనయు, 'ఏకాంతమునందునున్న జవ
రాండ్రి నెపంబిడి పల్కరించులా' గనుటలోఁ దానొంటిగా
నుండుటయు, యౌవనవతి యనియు, వలపున స్త్రీనిఁ బల్క
రించుటకు వెదకిన కారణమే దారియడుగుట యనియు,
'నీవెఱుంగవె వచ్చినత్రోవ చొప్పు' అనుటలోఁ గల వ్యంగ్యా
ర్థమును, 'ఇంతభయంబులే కడుగ నెల్లిదమైతిమె' యను
టలో తాను సులభసాధ్యము కాదనియు — అనఁగాఁ
దానప్సరస యనియు, 'మాటలేటికిన్' అనుటలోఁ 'దాను

సత్వర కార్యపూర్తి కాంచునట్లును సూచ్య రహస్యార్థ మేర్పడగా కవి యయ్యంగననోటఁ బలికించుచున్నాఁడు.

ఇందు నల్లసాని పెద్దన యొక్క శృంగార రసాభి లాషయు, అతని యైంద్రిక సౌందర్య (Sensious Beauty) లాలసయు, అతని యింద్రియోత్కర్షక యథార్థరూప కల్పనయు (Sensuous Realism), అతని జాను తెనుఁగును, అతనిపలుకుఁబడి సొంపును, అతని శైలీ మాధుర్యమును, అతని విలక్షణమైన భావతీవ్రతయు, అతని భావనా వైదగ్ధ్యమును, అతని కవిశాశిల్పమును, అతని వ్యంగ్య వైభవమును గోచరిం చును. కావుననే మనుచరిత్ర తన మించు మెఱుంగులతోఁ దళుక్కుబెళుక్కులతో యువకులను దన్మయత్వము నొందించు నదై యున్నది.

ఆత్మతో నాత్మకు ననుసంధానము గల్గుటయె ప్రేమ యొక్క యాత్యంతిక ప్రయోజనము. దీనిని నిరూపించుటకుఁ 'ప్రభావతీప్రద్యుమ్నము' నందుఁ బద్యుమ్నుఁడు తన చిత్తమును ప్రభావతిపై నెట్లునిల్పి యామెరూప సాక్షాత్కారముం బొందెనో యామార్గమగు శ్రవణ, మనన, నిధి ధ్యాసన, ధారణ సమాధుల మూలమున, యోగులు బ్రహ్మసాక్షా త్కారముం బడయుటకు బోల్చి, కడురమణీయముగాఁ దత్కవియగు పింగళి సూరనార్యుఁడు వివరించుచున్నాఁడు.

శా॥ "ప్రద్యుమ్నుండు ప్రభావతీ రుచిర రూ-
ప బ్రహ్మముఁ జాంస యో-
షి ద్యాథార్థ్యధురీణ వాగుపనిష-
త్సిద్ధాంత మార్గానుసా-

రోద్యత్ ప్రజ్ఞను బ్రహ్మయున్ మనన సం
యుక్తంబు గావించుచున్
హృద్యంబై యది యంతకంత కలరన్
నిల్పం గడుం జిత్తమున్"

ఈ పద్యమందు వర్ణింపఁబడినదియ్యది: ప్రభావతీరుచిర రూపమే బ్రహ్మము; ఈబ్రహ్మమే యథార్థ వస్తువు. ఈ యథార్థవస్తువును గూర్చి యుపనిషత్తులు నుడివినట్లు హంసాంగనయగు శుచిముఖి ప్రభావతీ రుచిరరూపమును నెఱుక పఱచినది. శ్రవణము ముగిసినది; చింతన యారంభ మైనది. ప్రద్యుమ్నుఁ డామె రుచిరరూపమును మననము గావించువాఁడు. కేవల మననము వలన వస్తువుయొక్క యదార్థ స్వరూప మలవడనేరదు. కావున నతఁడు నిది ధ్యాసనమునకు — మఱిమఱి తలపోయుటకుఁ — గడంగెను. అంతఁ బ్రద్యుమ్నుఁడు, కన్యకామణియగు ప్రభావతి యొక్క మనోజ్ఞరూప రేఖావిలాసము నుండి, తన యాత్మను మరలింప లేకుండెను; అనఁగా నతనికి ధ్యాననిష్ఠ గలిగెను. అప్పుడాతఁడు "కనఁ డొద్దనున్న వారిని; తబ్బిబ్బుగాఁ బలుపుఁ గ్రియలు..." ఈ ధ్యానారంభ దశయందు వస్తుస్వరూప సాక్షాత్కారము దూరమైయుండి, యది మసక మసకగఁ దోఁచెను. అంత విఘ్నములు సంభవింపఁగా ప్రద్యుమ్నుఁడు ప్రభావతియొక్క సర్వాంగములకు నుపమలు కల్పించుకొని- ముఖము చంద్రునికిని, శిరోజములు చంచరీకములకును — బొందుపఱచికొని యామె రూపమును స్థూలముగాఁ గాంచఁ గలిగెను. తరువాత దృఢధ్యానము కుదురఁగా మనసు తన

చంచల స్వభావమును మానినదై "హృద్యతరాంగి మూర్తి పొబగెల్ల నొకింతగఁజూచు నాత్మలోఁ."

ఉ॥ "ఉద్య దపేత పక్షవని
తోక్తుల వెంబడిఁ జంచరీక చం
ద్రాద్రి ద్యుపమాన శోభిత స
హాసరి గుణంబుగ హెచ్చఁ, గేశవ
క్షాద్రి ద్యఖిలాంగ లక్ష్మి మది
కందిన నంతయునుఁ నయించి యా
హృద్యతరాంగి మూర్తి పొబ
గెల్ల నొకింతగఁ జూచు నాత్మలోఁ."

అట పిదప నతనికి "నమ్మదిరాక్షి రూప మెయ్యది యదియే కనంబడయె." అనఁగా మనసు లయమై 'యచ్చపు బుద్ధి' మేలుకొని యుండుట చేత—సమాధి స్థితి యలవడుట చేత-యోగికి బ్రహ్మ స్వరూపావిర్భావ మొదవు నట్లు, అతనికి ప్రభావతీ రుచిరస్వరూపము వాత్తెను.

జీవాత్మ పరమాత్మ యొక్క స్వస్వరూప మగుట దెలిసికొన్నది. ఇంక నాత్మతో నాత్మ పొత్తు గలుగుటయే మిగిలి యున్నది.

ఇట్లు స్త్రీ పురుష సంయోగాభిలాషను జీవాత్మ పరమాత్మల సంయోగాభిలాషగా నభివర్ణించుటయే పాశ్చాత్య సాహిత్య మందుఁ గాని కలదా? ఏమి యీ భావవైదగ్ధ్యము! కళావైభవము భావవైదగ్ధ్య మందుఁ గదా యుండును,

"పాండురంగ మహాత్మ్యము" నందలి నిగమశర్మో పాఖ్యానములో నిగమశర్మ తన మనంబును దార్తీయ పురుషార్థమగు కామమునకే తార్చి, వైదికా చారమునకు దూరుఁడై, కొత్తగాఁ దాను వివాహమాడిన భార్యను నేలక, వేశ్యాలంపటుఁడై, యిల్లు గుల్లచేయఁ గడంగెను. అది విన్నవాని పెదసోదరి వాని శిక్షింప నెంచి, తన మగనిని బిడ్డలనుగొని పుట్టినింటికి వచ్చెను. ఆమెకు "ఇంతలు నంతలు నగు తన సంతానము చంట వెంట సందడిసేయుగ" దమ్మని కుపచారములు సేయుచుండెను. "అఖిలాన్నంబుల్ కనుగీటి నంతలోనవె" యమరించు చుండెను; అ కలకంఠి శుంఠుఁడగు తన తమ్మునకిట్లు పరిబోధించెను:

చ॥ పడఁ బడఁ బాయుచుకా వడఁకు
పట్టిన తల్లినిఁ దండ్రి, నేలలో
వెడలని [1] తమ్ముఁ గుఱ్ఱల, న
వీన కులాంగన నోరులేని యా
తొడుకుల [2], బంటుఁ [3], బైద, [4] విడఁ
ద్రోవక [5] ప్రోవఁగ నెందునీక పా
ల్పడినది కర్జునోఁ దలనె
భారత సంహిత నిల్చు చాడ్పునక

ఉ॥ "నాదుసహోదరుండు సుజ
నస్తవనీయనయప్రసక్తి [6] బ్రి

1 తమంతకుఁదాము నిల్వలేని; 2 ఆవులను; 3 కొలువుడు కాండ్రను; 4 బిడ్డలను; 5 పోనీాకక.
6 సజ్జనులను బొగడునట్టి నీతివిషయక ప్రసంగములో;

హోత్రదుల మెచ్చఁ; డే నతని
యజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై
వేది యలంకరింతు నని
వేపురలోపల నాడికొందు; నీ
వేరియు లేక సర్వగుణ
హీనుఁడవౌట యెఱుంగఁ దమ్ముఁడా!"

శా॥ "వీరావేశము దాల్చి సర్వధనముల్
వెచ్చింతు గాకేమి, ము
క్కారుంబండు నఖండ సేతు వ్రతముల్[7]
గే
దారంబుల్[8] దెగనమ్మఁగాఁ జనునె? ని
ద్దారుఁడవే?[9] వెన్కనె
వ్వారున్ లేరె సహోదరాదులు? కుల
ధ్వంసంబు నీకర్హమే?"

ఈ యుపదేశము లెంత స్వాభావికములుగ నున్నవి! "పడఁబడఁబాఱుచున్ వడఁకపట్టిన తల్లి నిదండి"నను టలో భావము ధ్వని ననుసరించి, పాత్రకలక్షణములు సూచితము లగుచున్నవి. ఆనాఁటి వైదికాచారములం బట్టి "ఏ నతని యజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై వేది యలంకరింతునని వేపురిలోపల నాడికొందు"నని యక్క చెప్పుచున్నది. ఆ కాలమున వైదికులు యజ్ఞములు చేయుటయె యధిక గౌరవమని తలఁ

9 భార్యలేనివాఁడవా.

చుచుండిరి. వైదికాచారములును, వేదవిద్యయుఁ గాలప్రాబల్య మునుబట్టి యిప్పుడు బ్రాహ్మణులు మానినారు.

మొట్టమొదట సోదరి యువకసంసారియొక్క కర్తవ్య ములను నుడివి తమ్మునిఁగొంత పొగడి, పిదప వానిదౌష్ట్య మును దడవుచున్నది. అప్పుడును నిర్ధారుండవే? వెన్క నెవ్వారున్నారె సహోదరులు?" అని చెప్పుటలోఁ గరుణరసం బుప్పొంగుచున్నది; నయంబు ప్రియంబు కదురుచున్నవి.

తే॥ "అక్కయీరీతి నయము ప్రియమ్ము గలుగ
నానతిచ్చిన సద్బుద్ధి యాదరించెఁ
జాల దినముల నుండియు మైలపడిన
బడుగు గావున వాఁడన్నపానకాంత."

అక్కపల్కిన బుద్ధిమాటలను నిగమశర్మ 'యన్నపాన కాంత' నాదరించెనే కాని, తనబుద్ధిపూర్వకముగ నాచరించ లేదు. కావుననే వాఁడు వంచకుఁడై 'తేనెపూసిన కత్తి' యైనాఁడు.

ఈ క్రింది పద్యమువలనఁ బదియాఱవ శతాబ్దినాఁటి సామాన్యజనుల గృహ్యా సాంఘిక రాజకీయ పారమార్థిక వ్యాపారము లెట్లుండినవి తెలియుచున్నది.

సీ॥ "రాజాలయమునకు* రాకపోకలు సేయు,
మానినచదువులు మరలఁ జదువు;
నిన్నాళ్ళ నెచ్చెలు లెదురైనఁ దలవలచుఁ,
గులవధూరత్నంబుఁ గుస్తరించు1 ;

* రాజాలయమునకు — కచ్చేరికి. 1 సమాధానపఱచు.

నాచార్యజనము ప్రత్యహము సంభావించు,
సర్పావళికి నుపహారం[2] మిచ్చు
నర్పించుఁ గుతపవేళా గతాతిథికోటిఁ
బసిఁడేదు[3] దర్పించుఁ బైరుపచ్చఁ;
గీ॥ దండి ప్రియుద్రమనీయంబుదా వెయుదుకు,
నత్తి కాభర్త తో[4] నవ్వ; నల్పసరణి
గ్రామకార్యంబు దీర్పనంగడికి వచ్చి.
తేనెపూసిన కత్తి ధాత్రీసురుండు.

అంత వాఁడు

"మాతృభూషలు నత్తి కామండనములు
నిజయువతిదాల్చు సొమ్ములన్నియు హరించి"
"ఒకనాఁటి రాత్రి పసుపడు
కకుఁ జెప్పక యిల్లువెడలి గాఢతమతమో
నికర ము తనదగు తోడు గ
నొకరుఁడ పేరడవితోవ నూడనిఁబాడెఁ"[5] .

ఈ కందపద్యము పయి పద్యములకు శిఖరప్రాయమై యెంత లలితముగ నున్నది! తెనాలి రామలింగకవి సామాన్య జీవితమందలి యొక్క ఘట్టముం గొని యావిష్కరించి తన కవనంపుఁ జవిచేతఁ జదువరుల హృదయంబుల నలరించువాఁడు; మఱియు భావనా వైలక్షణ్యము గలిగి, తన మనోగత బింబములను రమణీయముగా వ్యక్తీకరింపఁజాలినవాఁడు.

---

2 కాముక; 3 పసులఁగాపాడును;
4 అక్కమగనితో-బావతో; 5 పాఱిపోయెను.

శుభవ్రత, ప్రియవ్రతుఁడనువారు భార్యాభర్తలు. వీరికి సులక్షణయను కూఁతురు తండ్రి గండంబున జన్మించెను. ఆ బాల యంతంత వర్ధిల్లఁగాఁ దండ్రికి మరణచింత వర్ధిల్ల సాగెను. తనయకుఁ బెండ్లి చేయ నుంకించెను గాని, తండ్రికిఁ "చింతాజ్వరముపైన జ్వరముదాఁకఁగా నతఁడు మరణించెను; అతని భార్య శుభవ్రతయుఁ బతి ననుగమించెను. సులక్షణ "దుఃఖావేశయయ్యును ధీరోదాత్తఁ గావునఁ, దాత్పర్యంబు నం దల్లిదండ్రుల కౌర్ధ్వదైహిక విధుల నిర్వర్తించి నిజాంతర్గతంబున" నిట్లు నిర్వేదనం బొందె

సీ॥ "ప్రాణంబు ప్రాణములైన తల్లిని దండ్రి
హృదయంబులో ననే నెట్లు మఱతు?
పితృమాతృ హీననై యతి శూన్య వృత్తినే
నెట్లు దాఁగి నీఁదుదు భవాబ్ధి?
ఏల కల్పించె నాకీ రూపులావణ్య
సౌభాగ్య సంపద జలజ భవుఁడు?
కులశీల రూపాది గుణములు వీక్షించి
యెవ్వాని కీనేర్తు నేన నన్ను?

* * * * *

ఈ నాలుగు సీసపద్యములలో నబ్బాల తనశోకంబును నెంత రసోల్బణంబుగా వెళ్లబోసి కొనుచున్నదో గమనింపుఁడు జననీజనకులపైఁ దనకుఁగల భక్తి, తన రూపలావణ్య సంపద వలని భయము, తన యసాయత, తాను భర్తను గైకొనుచోఁ దగిన జీవితభాగస్థుఁడు దొరకునాయనుశంక యూమెను బాధింప సాగెను.

తుది కా బాల 'పురుషు నెవ్వని జిత్తంబుచొరంగ నీక! బ్రహ్మ చర్యవ్రతస్థితి' నుగ్ర తపంబు చేసె.

అప్పుడొక మేక వచ్చి యబ్బాలతో సాంగత్య మొనరింప నామెయు దానిని "కూర్మి చెలికత్తియ కైపడిఁ బ్రేమ మొనర్చుచుండె. "అది

తే॥ రాత్రి దూర్వా ప్రవాళ చర్వణ మొనర్చి
యుత్త రాదిత్యకుండిన నుదకమాని
పగలు నాల్గాలు సేవించుఁ బద్మనయన
వత్సల తమిఁ జల వోక వయసు మేక"

అంతఁ బెద్దకాలంబునకు మహేశ్వరుండు ప్రత్యక్షమై వరము వేఁడు మనిన నాతని కబ్బాల యిట్లనియె.

తే॥ "మీన కేతన దమన! యీమేఁక పిల్ల
ప్రాణ సఖివోలె నాయొద్దఁ బాయకుండు;
శర్వ! యీనోరు మాలిన జంతువునకు
మొదల వరమిమ్ము, వరమిమ్ము పిదప నాకు."

ఏమి యబ్బాల స్వార్థ పరిత్యాగ శీలము! ఆమె కారుణిక హృదయము! ఈ చిన్న కథ శ్రీనాథుని 'కాశీఖండ' మను పురాణము లోనిది. పురాణములు మిత్ర సమ్మితములు గదా; హెచ్చువెంచి నుడవక మితముగాఁ బలికి బోధసేయుచున్నవి. ఈరమణీయదృశ్యమెంత కొంచెములో సాక్షాత్కరింపఁ బడినది! మృదుమధుర కవితా రూపమున నావిష్కరింపఁ బడిన యీకథను నాకళింపఁ గాఁ గళకుఁ గోరికల నుండి నరులను

విరుగడచేయు సామర్థ్యమున్నదని చెప్పు కళాస్రష్టల (Artists) పలుకులలో సత్యమున్నదని తెలియుచున్నది. ఉత్తమ కళ యొక్క పరమలక్ష్య మయ్యదే కదా. ప్రపంచము తోడి మన తగులమును గొంతవఱకైన విస్మరింపఁజేసి, మనకుఁగల విశ్వ సంబంధము తోడిసంపర్కమును బ్రదర్శించుటయేకదా కళా ధర్మము. ఈపద్యములు మనయెడ తెగని సాంసారిక వ్యవహార బంధములనుండి మన మనంబును నొక్కక్షణమేని త్రిప్పఁజాలి నవిగావా? అందలి సౌందర్యము చిత్తోత్తేజన మొనరింపదా?

కఠినశైలితో శృంగార నైషధమును నాంధ్రమున రచించినమహాకవియగు శ్రీనాథునికి మనోహర సులభశైలిపై నాదరము చివరకుఁ గలుగనేల? పాఠక మహాశయు లూహింతురుగాక.

ముక్కంటి కంటిచిచ్చు వలనఁ దన చెలికాఁడగు మన్మథుండు భస్మభూతుండగుట దెలిసి, వసంతుడు తన చెలికాని భార్యయగు రతీదేవిని నూరార్ప వచ్చినప్పుడు శ్రీనాథకవి యామేస్థితిని 'హరివిలాసమున' నిట్లు వర్ణించుచున్నాడు.

సీ॥ " కేవ్వురించిన లేఁత చెక్కుటద్దంబులఁ
దాటంక యుగళంబు తన్నియాడ,
నాక్రోశపరి వేదనాక్షర వ్రాతంబు
కంఠ గద్గతికచేఁ గ్రిక్కుపడఁగ,
వారి నీలముల చాయలక్ష్మి గోళ్ళమ్ముల
సొబగుగాఁ గన్నీటి సోనగురియ, "

ఈ వర్ణన శోకార్త యగు రతీదేవి యాకృతి నెంతయు మన యెదుటఁ బెట్టుచున్నది. ఆమె తన జీవితమందు నిఃస్పృహా గలదియై, "నీవును బరమ మిత్రుఁడవు గావున నన్నును నగ్నిముఖంబున నీసఖుంగూర్పు" మని నుడివి, శోకావేశంబున వెండియు నిట్లు దీనతం బ్రార్థించు చున్నది-

సీ॥ "హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెదఁ
దమ్ముఁడా నాకిమ్ము తగఁ జితాగ్ని,
మందమందంబుగా మలయానిలయంబులు
వెరవుతో నుండంగ విసరుఁగాతఁ;
బరలోక తృప్తికై బంధులిద్దఱకును
ధర్మోదకం బిందు తమ్మితేనె;
సహకార మంజరీ చరుపిండ కబళంబు
పెట్టెండు మాకునై పికము ముట్టఁ
గీ॥ తేనెపెట్టుండు కస్తూరి దీర్చియచటఁ,
జెరగొజ్జంగి పూనీటఁ జెంబులిడుఁడు,
నన్ను వలరాపుఁ దలఁచి మన్నన, దలిర్పఁ
దగ సమర్పణ చేయుఁడు దంపతులకు."

ఈ పద్యమందుఁ జెప్పఁబడిన యుత్తరక్రియా పరికరములు - చితాగ్ని, మందమలయానిలము, తమ్మితేనె. సహకారమంజరీ చరుపిండము, పికము, గొజ్జంగిపూనీరు - ఇవి మన్మథుని కింపై, వసంతుని కందుబాటులో నుండునవై యుండుటచేతను, ఆ యుత్తరక్రియా విధులు మన హైందవాచార యుక్తముగా నుండుటచేతను, ఆ పరికర సామగ్రి

తోడనె తన నాథునికిని, చావనున్న తనకున్న తనకును దర్పణం బియ్యఁగోరుటచేతను, తన చెలికాఁడగు వసంతుని మనస్సేకాక మన మనస్సును శోకరసార్ద్రి మగుచుండును. కాని యిక్కడ రతీదేవియు, వసంతుఁడును బొందు దుఃఖము పరిత్యక్తమైనది; మనకుఁ గల్గు శోకతాపమో కావ్యమూల మున శమించి, చల్లనై, 'రసమై,' యాస్వాదనీయమై, యానందప్రదమై యుల్లసిల్లుచున్నది.

పై రెండు పద్యములును సీసములే. శ్రీనాథుఁడు సీసపద్యములను రచించుటయం దద్వితీయుఁడు. ఈ పద్య పాదములందలి శబ్దముల జోడింపు, అందలి స్వరమాధుర్యము, అందలి తూఁగు సొబఁగు, అందలి యొయ్యారపు నడక చదువరులు గమనింతురుగాక.

శైలరాజునకు నదీలలామయగు శుక్తిమతియందు సంతానము గలిగెను. ఆ శుక్తిమతి తన సంతానమును చాలించు విధమును రామరాజభూషణకవి (బట్టుమూర్తి) యీరీతి నుడువుచున్నాఁడు.

చ॥ "జలకము లార్చి, పాండు జల
 జచ్ఛదపాళికఁ గప్పి, తమ్మిసం
కులఁ దెలిదేనెలు గులిడి,
 కొండరగల్ గదలించు కల్వతో
ట్టెలఁ గుమారుఁ గూతును ఘ
 టించి భజించు నదీల లామకో
మల కుముదాగతాళి కుల
 మంజు రవంబుగ జోల పాడఁగన్"

కవికిఁదెలిదమ్ములె పొత్తికలైనవి, తామర రేకులె యుగ్గుపోసెడి శంఖపాత్రములయినవి, తేటతేనెలె యుగ్గులైనవి, కల్వపూవులగమి యుయ్యేలలైనవి, అలలు దాదులయి యుయ్యేల లూపుచున్నవి; తుమ్మెదలు చెలికత్తెలై తమ తీయనిధ్వని చేత లాలిపాటలు పాడుచున్నవి. ఇక్కడ బిడ్డల తల్లియగు నదీమతల్లికి సన్నిహితంబులగు నుపకరణములే కవి స్వీకరించి రమణీయంబుగ వర్ణించినాఁడు. ఈపద్యము మధురకోమల శబ్ద విన్యాసముగల్గి ఎంత సొంపుగా నున్నది!

శా॥ "రాజీవాక్షుల నేచుపాతకి విచం
 ద్రా! రాజవానీవు; నీ
రాజత్వంబునఁ జక్రిముల్ మనియెనో;
 రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనె? దిందెనో యహితయో
 ద్రేకంబు; తాఁ జెల్లరే!
రాజై పుట్టుట రశ్మిమాత్ర ఫలమే?
 రాజోట దోషార్థమే?

రామరాజ భూషణుఁడీ చంద్ర దూషణమును గిరికా దేవి నోటఁబలికించు చున్నాఁడు. ఇందు శ్లేషాలంకారముచేత నర్థద్వయము తెలియుచున్నది. ఒకటి చంద్రపరముగను మఱి యొకటి రాజపరముగను:

రాజవానీవు = నీవు చంద్రుఁడవేనా, నీవు మహీపాలుఁడవేనా; నీరాజత్వంబున = నీచంద్రిత్వముచేత, నీప్రభుత్వము చేత; చక్రిముల్ మనియెనో = చక్రవాకపక్షులు (సూక్ష్మముగా)

బ్రదుకఁగలిగెనా, రాష్ట్రములు (సుఖముగా) జీవింపఁ గలిగెనా సత్సంతతుల్ రంజిల్లి తేజంబందెనో = నక్షత్రముల గుంపుల కాంతితోఁ బ్రకాశించెనా, సజ్జనులసమూహము సంతోషమున వెలసెనా; (చంద్రుఁ డాకాశమున వెలుంగునప్పుడు నక్షత్రములు కాంతిహీనములై యుండును.) అహిభయోద్రేకంబుడిందెనో = రాహువు నిన్ను మ్రింగునను భయమువీడెనా రాజునకుండు స్వపక్షభయము పోయెనా; ('అహిభయ' మనుపదమున కర్థము 'శబ్దరత్నాకరము' ను జూడుఁడు) రాజై పుట్టుట రశ్మిమాత్ర ఫలమే = కిరణ సంపద బొందుటకు మాత్రమేనా చంద్రుఁడవై జన్మించుట. ధనార్జన నిమిత్తమేనా రాజజన్మము నెత్తుట; రాజౌట దోషార్థమే = చంద్రుఁడగుట రాత్రికొఱకేనా; రాజగుట పాపముకొఱకేనా?

రామరాజభూషణకవి సంగీత విశారదుండని చెప్పుదురు. కావుననే కాఁబోలు నితని కవనము శ్రావ్యసుందర లలితపద నిబద్ధమై యున్నది. ఇంత లలితముగను, శోభాయమానముగను పద్యములను - గాదు గ్రంథమునె రచింపఁ గల్గుట కితనికి భాషాదేవి వశమై యతని నాల్కమీఁద నాట్యమాడుచుండును. ఇతని కవనమందు బౌద్ధిక సౌందర్యము - బుద్ధిని మెప్పించు సౌందర్య మధికముగా నున్నది. విడివిడిగా నున్న విషయాంబులను సంయోగపఱచు సామర్థ్యమును, మనమున రుచిరబింబములను బొందించు సామర్థ్యమును విరివిగా నున్నవి. కాని వీరరౌద్రాది గంభీరోదార రసములను నడుపునట్టి మహాశక్తి యితనికి లేదు.

నారదమహర్షి తాను స్వర్గమునుండి తెచ్చిన పారిజాత పుష్పమును రుక్మిణి సమక్షమునఁ గృష్ణుని కిచ్చెను. కృష్ణుఁడు

దానిని రుక్మిణి కీయ్యఁగా ఆమె దానిని భక్తితో స్వీకరించి తన కొప్పున ముడిచికొనెను. ఈ వార్త సత్యభామకుఁ దెలియఁగా, పతి తనకంటెను రుక్మిణీదేవినే యెక్కువ ప్రేమించుటగా వగచి, ఆమె ఈర్ష్యాకషాయిత హృదయయై, కోపపరీత చిత్తయై, కోపగృహంబునఁ బరుండెను; అంతఁ గృష్ణుఁడు వచ్చి యామెను గోపమునుండి తేర్చుటకై యామెను నర్మిలి మ్రొక్కెను. అప్పుడా భామ కృష్ణుని శిరమును దన "వామపాదంబునం దొలంగం దోచె." కవి యగు ముక్కు తిమ్మన యిప్పట్టున 'నాథుల్ నేరముల్ సేయఁ జేరలుకం జెందినయట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే' యని నుడువుచున్నాఁడు, ఇది నిజముగా ననుచిత వ్యాపారమే యగును. కాని కృష్ణుఁడు దానికిఁ గినుకపూన లేదు; ఆమెను మఱింత యోదార్చెను. కాని యామె

క॥ "మానంబె తోడవు సతులకు
మానమె ప్రాణాధికంబు, మానమఖిల స
న్మానములకు మూలంబగు;
మానరహిత మైన బ్రిదుకు మానిని కేలా? "

యని నుడివి, తన యాత్మగౌరవమె పోయినట్లు వగచి, ఆత్మగౌరవముఁ గోల్పోయిన మానిని బ్రిదికి యుం డుట తగదని పలికి, మరణోద్యోగంబునకుఁ దాను గడంగు నిట్లు సూచించు చున్నది:

సీ॥ "ఉవిద యెవ్వతె నోచియున్నదో యీస్వమం
తకరత్నమింక నొఁ దల ధరింప

"నీ రైవతక శైల చారుకూట విటంక
కేలి కింకెవ్వతె పాలు పడునో!
యెవ్వతె కబ్బునో యీవసంతా రామ
కర్పూర కదళి కాగార వసతి!
లీల నీమణిసౌధ జాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁ గలదో!"

గీ॥ అకట! నేఁ బెంపఁ బెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ!
నన్ను నాతోడి సవతులు నగకమున్న
పంతమలరంగ నిన్ను మెప్పింతుఁ గాక."

కవియగు ముక్కు (నంది) తిమ్మన్న యాత్మగౌరవము గల సత్యభామా స్వభావమును, దక్షిణనాయకుఁ డగు కృష్ణుని స్వభావమును నిప్పట్టునఁ నెంత సహజముగాఁ బరికాళింప జేసినాఁడు! సత్యభామ యనుభవించు చుండు భోగ్యసామాగ్రి యెంత మనోహరము లైనవిగాఁ గవి ప్రదర్శించినాడు! "ఈ సురుచిరా భోగవస్తు కలాపమును వింకే సవతితోఁ గూడి యనుభవింప నున్నావో! నాతోడి సవతులు నన్నుఁజూచి నవ్వుటకుముమపే నీకభీష్టమగు నామరణమును నేనే నాపంత మలర నెఱవేర్చి నీకు మెప్పుగలిగించెద" నని సత్యభామ నోటఁ బై రమణీయ పద్యమును బలికించుటలో ముక్కుతిమ్మన కవి నాయిక యొక్క భోగాభోగతను, ఆమె కోపమును, ఆమె యోర్వలేని తనంబును నెంతమృదు మధురముగ, లలితసుభగముగ నభివ్యక్తపఱచినాఁడు.

ఈకవిత్వముసొబగై, సులభమై, దీప్తివమై, యుల్లాస జనకమై, యెంతయు హృదయరంజకముగా నున్నది. ఈ కావ్యము మానవజీవితమందలి యొడుదుడుకులను బ్రదర్శించి, మానవుఁడు తమగలిగి మెలఁగుట సర్వతోభద్రమని నీతిబోధ గావించుచున్నది.

దేహము మలినమయ్యును హృదయశౌచ్యము గలిగి, మసిపాతలోఁ జుట్టఁ బడిన మాణిక్యంబువలె నున్న మాలదాసరిని 'ఆముక్తమాల్యద' కవియగు శ్రీకృష్ణదేవరాయ మహీపతి యెట్లు వర్ణించినాఁడో చూడుఁడు:

సీ॥ "చమురైన తోల్కుబుసంబు సెంకియును ని
నిత్తడి శంఖ చక్ర కుండలము లమర
దివెదారి కొమ్ము తోల్తిత్తియు జోడమ్ము
మెడమీఁది మొగలాకు గొడుగు దనర,
మల్హాద రతయు మావు వెన్నెలుకఁగు
ట్టిన యోటితి పిరిదండెయును మెఱయ,
చిటితాళములు చంకపుటిని నొక్కకమాటు
గతిరయమునఁ దాఁకి కలసి మెఱయ,

గీ॥ వలుదవనమాల కంబెయు, మలినతనువు
బట్టెతిరుమన్ను, బెదరుఁ గెంబుట్టు చూపు,
పసుపుఁబొటి తోలువల్లంబు, వెనక మొసఁగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు."

విష్ణుభక్తుఁడగు మాలదాసరి యొక్క చముదంటి మాసినతోలుచొక్కాయ, వానికుళ్లాయి, వానిశంఖచక్రములు

చెవులపోగులు, వాని గరుడ గంబము, వాని తోలుతిత్తి, వాని చేయమ్ము, వానిమెడమీఁది మొగలాకు గొడుగు, కాలి జోడు, గుజ్జుపుజాలు వెంటుకలతోఁ గుట్టినయోటి సొర కాయదండె, వడిగానడచు నప్పుడు ఒకటితో నొకటి తాఁకి శబ్దించుచుండు చంకపుటికలోని చిఱుతాళములు, వలఁదయగు తులసిపూసల సరము, వాని మాసిన శరీరము, కాల్వమట్టి తిరునామములు, వాని సహజమగు జేగురుబెదరుఁ జూపులు, వాని పసుపుపూసిన చిన్నతోలుగంత-ఇవిగలిగి తానువసించు వెలవునకు మూఁడు యోజనముల దూరమున నుండు 'తిరుక్కురుంగుడి' కి విష్ణుసేవకై ప్రాతర్వేళలందు వచ్చిపాడుచుండువాఁడు,

ఇందు మాలదాసిరి యొక్క యచ్చపురూపు మన కన్నుల యెదుటనెంత స్ఫుటముగా నుంచఁబడినది! ఏమియీ స్వభావోక్తి! ఈబింబకల్పనసౌందర్యము! మాలదాసరియొక్క దేహాభిమానములేని భక్తిభావము, వాని కులోచితాచారమందలి యనురక్తి, వాని మనస్సంతుష్టి, యిందుఁబొరగట్టుచున్నవి.

ఇట్టి చిత్రవర్ణన ముత్తమ చిత్రకారునకుఁ దన కుంచెలతో, వెన్నెలతోఁ, జిత్రించుట సులభసాధ్య మగునేమోకాని, కలికిఁదనభావా సామాగ్రితో చిత్రించుట సులభసాధ్యముగాదు. చిత్రకారుని కార్యక్షేత్రమును శ్రీకృష్ణదేవ రాయ కవి యాక్రమించి, కావ్యవర్ణము నందుత్తమ కవియని కీర్తిగాంచినాఁడు.

శా॥ "గండాభోగములన్ ముదశ్రులహరుల్
గప్పన్ సుతుల్వాడి యా
దండన్ వ్రేఁగులుఁడించి భక్తిజని తో
ద్యత్తాండవంబాడు నా
చండాలేతరశీలుఁ డుత్పులకియై
చండాలికన్ మీటుచున్
గుండుల్ నీరుగ నెండగాలిపసి తా
కుం జూడ కాపాశ్రిష్ణమున్."

ఈ పద్యమునందా మాలదాసరి - సామాన్య చండా లురకు వ్యతిరేకమైన నడవడిగల యా మాలదాసరి - భక్తి పారవశ్యము వర్ణితమైనది. వాఁడు చండాలికను వాయిం చుచు, నాట్యము సల్పుచు, కీర్తనలు పాడుచుండ వాని చెక్కిళ్ల యందంతటను సమ్మోదాశ్రువులు జాలువాఱుచుండు నఁట; వాని దేహము పుల్కరించునఁట; ఎండయు, గాలియు, ఆఁకలియుఁ దోచకుండునఁట. కవి వాని యనుభావములను, వాని యంగచేష్టలను నెంత సునిశితముగా నభివర్ణించినాఁడు! సామాన్యమగు కవిదృష్టి యున్నత రాజజీవిత విశేషములను గమనింపఁ బరుగిడునట్లు, శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమ కవి దృష్టి నిమ్నజీవిత విశేషములను గమనింప నుత్సహించెను; ఇది సహజమే కదా.

ఈ ఘట్టమునందు శ్రీ కృష్ణదేవరాయల హృదయౌ దార్యములను, చిత్తవైశాల్యమును, యోగ్యులను నాద రించి గౌరవించు బుద్ధియుఁ బొడఁగట్టుచున్నవి. ఇట్టి మహానుభావుఁడు కాఁబట్టియె కవులకుఁ గాళ్లంటి గండ

పేండేరంబుఁ దొడిగెను; కవులను బల్లకిలోఁ గూర్చుండఁ బెట్టి తన భుజమిచ్చి మోసి యూరేగింపు నడిపెను; పెద్దన కవిని "ఎదురైనచో మదకరీంద్రము నిల్పి కేలూఁత యిచ్చి యెక్కించుకొనెను." శ్రీ కృష్ణదేవరాయా! నీ గుణగ్రహణ పారీణత యెవ్వరికిఁ గలదు?

ఇతఁడు సుందర సుకుమార పదముల నేటికొని ధ్వని విన్యాస కలితమగు కవితను రచించుటలో నిపుణుఁడు కాఁడు; తన కవితా వైశిష్ట్యమును బ్రదర్శింపవలయునను బుద్ధితోడనె యితఁడు శ్రుతికటువులైన మూలగొట్టు పదములతోఁ గవిత్వమును నారికేళపాకమున రచియించినాఁడు. ఇందలి వర్ణనలు గూడ విలక్షణమైన భావనాసౌందర్యము (imaginative beauty) బౌద్ధిక సౌందర్యము – బుద్ధిని తృప్తిపఱచు సౌందర్యమును (Intellectual beauty) బడసియున్నవి. ఇంతే కాక కవి భక్తిభావమును బ్రదర్శించి యాధ్యాత్మికమైన యాదర్శక సౌందర్యమును (ideal beauty) గూడఁ గావ్యము నందుఁ గొంత పొందుపఱచినాఁడు. కావ్యము నారికేళ పాకమున నుండఁబట్టి సులభగ్రాహ్యముగాదు, కాని శ్రమించి లోనిసారమును గ్రహించుచో రుచికరముగా నుండుననుటకు సందేహము లేదు.

నీ సోదరి "యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ" యనెడి యాకాశవాణి పలుకులు విన్న కంసుఁడు తన చెల్లెలగు దేవకిని దెగవ్రేయ గమకించు సమయంబున నతని భావమఱంది యగు వసుదేవుండు డగ్గఱి,

క॥ "ఆపాప చిత్తుమత్తుం
గోపాగ్ని శిఖానువృత్తుఁ గొనకొని తన స
ల్లాపామృత ధారా వి
క్షేపమునం గొంతశాంతుఁ జేయుచునుండెన్."

ఉ॥ "అన్నవు నీవుఁ జెల్లెలికి
నక్కట మాడలు చీరెలిచ్చుటో,
మన్నన సేయుటో, మధుర
మంజుల భాషల నాదరించుటో,
మిన్నుల మోఁతలే నిజము
మేలని చంపకుమన్న మాని రా
వన్న! సహింపుమన్న! తగ
దన్న! వధింపకుమన్న! వేఁడెదన్."

మ॥ "చెలియల్ కన్నియ ముద్దరాలబల నీ
సేమంబె చింతించు; ని
ర్మల దీనిన్ బయలాడు మాటలకు నై
మర్యాద పోఁగొట్టి స
త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా!
కోపంబు పాపంబు, నె
చ్చెలి నోహో తెగవ్రేయఁ జాడియగు నే?
చింతించు భోజేశ్వరా!"

ఈ పలుకు లెంత రసభావ వర్తనంబును, లోకహిత వర్తనంబును బచరించునో గమనింపుఁడు. ఇంతతో నిలువక వసుదేవుఁడు వేదాంత విషయంబులను బ్రబోధించుచు

న్నాఁడు. కవియగు బమ్మెర పోతన వేదాంతి కావునఁ దన కిష్టమైన గభీరమగు నాధ్యాత్మి కార్థంబులను ఈ సమయమున సముచితముగ వసుదేవుని వదనముగుండ వెల్వడఁజేయు చున్నాఁడు. మొట్టమొదట జనన మరణంబులు వేఱుపడక యొండొకటితో మఱఁగియుండునని యిట్లు నుడువు చున్నాఁడు:

సీ॥ "మేనితోడన పుట్టు మృత్యువు జనులకు
నెల్లి నేఁడైన నూఱేండ్లకైనఁ
దెల్లంబు మృత్యువు దేహంబు పంచత
నందఁ గర్మానుగుడై శరీరి
మాఱు దేహముఁ దాల్చి మఱితొంటి
దేహంబుఁ బాయును......"

మృత్యువు గుఱించిన వసుదేవుని యీ వేదాంత వాక్యములు దుశ్శీలుండును, నిజమరణ భయోద్విగ్న చిత్తుండును నగు కంసుని తలకెక్కునా? ఇట్టి పలుకుల వలన వానికి మఱింత క్రోధము హెచ్చెను. అయినను వసుదేవుఁడు తన యుపదేశమును మానక, కర్మకును, యింద్రియ మనంబులకును గల సంబంధమును నుడివి, యెన్ని జన్మము లెత్తినను కర్మలు చెడక వెంటవచ్చుచుండునని యిట్లు వచించెను-

క॥ "తనతోపటి కర్మరాశికి
ననుచరమై బహువికారమై మనము పడిం
జను నింద్రియముల తెరువులఁ
దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్."

పిదపఁ బ్రాణి తన కర్మ నిర్మితాంగములచే రాగ కలితుఁడగుచు నెట్లు కదలుచుండునది యొక చక్కని సామాన్యోపమానంబున నిట్లు వాకుచ్చుచున్నాఁడు:

గీ॥ "జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు
గానఁబడుచు గాలిఁ గదలుభంగి
నాత్మ కర్మనిర్మితాంగములను బ్రాణి
కదలుచుండు రాగకలితుఁడగుచు."

అటుపిదపఁ గర్మఫలములను - ముఖ్యముగా దుష్కర్మ ఫలములను నొక్కి వక్కాణించి హింస గావింపరాదని బోధించుచున్నాఁడు:

క॥ "కర్మములు మేలు నిచ్చెడుఁ;
గర్మంబులె కీడునిచ్చుఁ; గర్త్రలు తనకుం
గర్మములు, బ్రహ్మకైనను
గర్మగుఁడై పరులఁ దడవనా వేమిటికిఁక?"

క॥ "కావునఁ బరులకు హింసలు
గావింపఁగ వలదు; తనకుఁ గల్యాణము గా
భావించి పరుల నొంచినఁ
బోవునె తత్ఫలము? పిదపఁ బొందక యున్నే?"

కడపట వసుదేవుఁడు కంసుని దీనతతో నిట్లు వేడుకొనుచున్నాఁడు:

మత్త. "వావిఁజెల్లెలు గానికూఁతురు
వంటి దు త్తమురాలు, సం-

భాజనీయచరిత్రి, భీరువు,
బాల, నూత్నవివాహ, సు
శ్రీవిలాసిని, దీన, కంపిత
చిత్త, నీకిదె మ్రొక్కెదం
గావవే కరుణామయాత్మక
కంస! మానవవల్లభా!"

ఈ "సల్లాపామృతధారా విశేషమునఁ" గంసునకు ననుకంప జనింపకపోయెఁ గాని, చదువరుల హృదయములు కరుణరసోదంచితములై, ఆత్మవికాసముం బొందుచుండును.

కథతోఁ బొత్తుహత్తని యాధ్యాత్మిక విషయంబులు కేవల శాస్త్రీయములై, బుద్ధికి మాత్రము నచ్చినవై, హృదయమును గదలింపనేరక, ఆత్మోత్తేజంబుఁ గలిగింపఁజాలక కావ్యతాగుణముఁ గొంత సడలినవై యుండును. కాని బమ్మెర పోతన యిందుఁ గర్మ, మృత్యువిషయంబులం గూర్చి, కొన్ని యాధ్యాత్మికార్థంబులను కథయందు నిండుగాఁ బొందపఱచి, సారతరముగా, హృదయంగమముగా నుడువు వాఁడు. మఱియు నీతఁడు యోగి యగుటవలన, నితని పలుకులితనిలోని సత్తనుండి యధికశక్తితో బయలువెడలినవై, యవి ద్యోతనచేయు పారమార్థిక గంభీర భావములకు జీవము పోయజాలినవై దీపించుచుండును.

పైనొక్కెడ పింగళి సూరనార్యుని భావగాంభీర్యమును జూంచినారము, ఆ రెండు పద్యములునునం దిమిడి యుండు నతని యుదాత్తభావమునే కనురూపమైన ప్రౌఢ శైలిలో నున్నవి. కాని యయ్యవి సూరనార్యుని శైలిని

దెలుపు నొరరాతివన్నెలు గావు. 'కళాపూర్ణోదయ' మందును, 'ప్రభావతీప్రద్యుమ్నము' నందును కావ్యలక్షణ ములను కవి నుడివియున్నాఁడు. 'కళాపూర్ణోదయ' మందలి పద్యమును మాత్రము గైకొని, యందలి మనోహర భావ మును, అందలి నుడికారము సొంపును బరిశీలింతము.

—: లయవిభాతి :—

''చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగెనను, సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన, సౌరభముఁ జలువయుఁ గో
మలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు
మలయ పవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన యీడుమఱి కలదనఁగ వచ్చుఁగడు
వెలయుఁగల యీ సుకవి పలుకులకు నెంతే,''

ఈ పద్యమందలి కవి హృదయమును దిలకింతము. సుకవి పలుకులను వెన్నెలకు బోల్చుదమా? వెన్నెలకు జల్లఁ దనము మాత్రమున్నది; కప్పురపుఁ బలుకులకుఁ (ఖండము లకుఁ) బోల్చెదమా; వానియందుఁ జల్లఁదనమును సౌరభ మును నున్నను కోమలత లేదు; కఱకుఁదనమున్నది. కావునఁ గఱకుఁదనము లేక. చల్లఁదనమును సౌరభమును మాధుర్య మును గలిగి సర్వత్ర వ్యాపనముఁగాంచు మలయమారుతపుఁ గొదమలకు వానిని బోల్చనగును. వెన్నెలలు చల్లనై త్వగిం ద్రియ సుఖము మాత్రమిచ్చును; కప్పురపుఁ బలుకులు

చల్లనై త్వగింద్రియ సుఖము నేకాక సౌరభము గలిగి ఘ్రాణేంద్రియ సుఖమును గూడ నిచ్చును, మలయపవనంపుఁ గోదమలన్ననో చల్లగను, పరిమళవంతముగను, మధురము గను నుండి త్వగింద్రియ ఘ్రాణేంద్రియ సుఖమును నైతమిచ్చును. మలయపవనంపుఁ గోదమలన్ననో చల్లగను, పరిమళవంతముగను, మధురముగను నుండి, త్వగింద్రియ, ఘ్రాణేంద్రియ, రసనేంద్రియములకును సుఖం బొడఁగూర్చు చున్నవి. ఇక్కడ రసనేంద్రియము సాక్షాత్తుగా ననుభవింపఁ గల వస్తువు లేకున్నను, రసనచేయగల మాధుర్య గ్రహణమును జాలవఱకు ఘ్రాణేంద్రియమే చేయఁజాలియుండును.

కవియగు పింగళి సూరనార్యుఁ డీ పద్యమునందు సుకవి పలుకు లిట్టివని వర్ణించుటలోఁ బంచేంద్రియములను సంతృప్తిపఱచునట్టివె యని స్పష్టపఱచుచున్నాఁడు. త్వగింద్రియమునకును, ఘ్రాణేంద్రియమునకును, రసనేంద్రియమునకును దృప్తిఁగలిగించు మలయపవనంపుఁ గోదమలకు వానిని బోల్చి, చక్షుః శ్రవణేంద్రియ సుఖములకుఁ దన పద్యమే నిదర్శనము కాఁబోవునని తెలుపునట్లున్నది. గ్రంథమందీ పద్యముం గాంచినప్పుడు, అందలి లలితాక్షర స్వరూప విన్యాస రమ్యత చక్షుస్సుఖమును, వృత్త్యనుప్రాసముతోఁ గూడిన యీ 'లయవిభాతి' ని లయానుగుణ్యాగతితోఁ బాడినప్పుడు శ్రవణసుఖమును నొసంగును. ఇట్లు సుకవి పలుకులు పంచేంద్రియ సుఖమును నియ్యఁగలిగి యుండునని కవి యాశయము. పంచేంద్రియములు గ్రహించిన విషయముల ననుభవించునది మనస్సే కదా. కావున నీ యతీంద్రియ

ములకు సుఖమొదవించు కవిత్వమే కవిత్వమని కవి హృద
యము. కాని సూరనార్యుఁడు — సూరనార్యుఁడే యేల
ప్రబంధకవులందఱును, తక్కిన వారిలోఁ బెక్కండ్రును —
నొక్క ముఖ్య విషయమును — ఆత్మను విస్మరించినారు.
కవులనేకులు ఇంద్రియ సుఖానుభవమే జీవిత పరమార్థమని
తలపోసి తత్సుఖంబునే యారాధించువారు. వారి బాహ్యాత్మ
యభిలషించుచుండునదంతయు బాహ్య సుఖమే. కాన
దానిని బొందుటకై వారు బాహ్యేంద్రియంబుల శుశ్రూ
షించి, వానికిఁ గావలసిన విషయములనే తమ కావ్యము
లందుఁ బొందుపఱుపసాగిరి. కాని యాధ్యాత్మికానందమును
సంపాదించుటకై వారు తమ కవితను వినియోగింపరైరి.
అధ్యాత్మికానంద లబ్ధికి వలయు శుశ్రూషను వారు తమ
కావ్యములందు నడుపలేదు. "కేవల బాహ్యేంద్రియ జ్ఞాన
ముతోఁ బ్రకృతిని గాంచువారికి దానియందుఁ బరిస్ఫుటము
గను, పౌరుషవంతముగను గాన్పించు నింద్రియసుఖమే
మానవాదర్శమనియు, అదియె సౌందర్య రసాభిజ్ఞతయనియు
గోచరించును".* కావుననె ప్రబంధకవులు, మఱి యనేక కవు
లును నైహిక జీవితానుభవమునకే—ప్రాణమయ మనోమయ
సుఖవ్యాపారమునకే-తమ కావ్యములం దెక్కువ ప్రాధాన్యము
నొసంగినవారు. కాని "యాత్మశక్తియింద్రియశక్తి" యను
నీరెంటిలో నాత్మశక్తియె ప్రధానమైనది. ఈశక్తియె మానవుని
నున్నతస్థితికిఁ గొనిపోవఁజాలినది. కనుకఁ గావ్యమందుఁ
గూడ ఆత్మశక్తికే ప్రాధాన్య మీయవలయును,

---

* శ్రీ అరవిందుల 'కాళిదాసు.'

ఇంక సూర్యనార్యుని శైలిని గుఱించి కొంతనుడి వెదము. "ఇందిృయసుఖ" మీ కవికావ్యము లీఁజాలుననుట నిక్కువము. ఈతని కావ్యశైలి వాగాడంబరము లేనిదై, అర్థపుష్టి గలదై, గంభీరమై, సందర్భోచిత శబ్దప్రయోగము గలదై, లలితపద విన్యాసముతో శ్రావ్యమైయున్నది.

ఈ పరికరణమనెడి నికషోపలమునఁ బదియార్వన్నెల కంటె నెక్కువ వన్నెలుగల లక్ష్యములను జూపినారము. వీనిని నిపుణముగా నుపయోగించుచోఁ జదువరు లే కవిత్వపు యోగ్యతనైనను స్పష్టముగను, నిర్దుష్టముగను నిర్ణయము చేయవచ్చును. ఈ పయి నిదర్శనములు పరస్పరమెంతో విలక్షణములై యున్నను, వాని యొక్కొక్కటి యందును, ఉత్తమ కవిత్వ లక్షణములు మెండుకొనియున్నవి. ఇవి యొక్కొక్కటియుఁ దనతన వైశిష్ట్యముంబట్టి కవితా లక్షణములం బ్రదర్శింపఁ జాలియున్నవి; కావున వీని యన్నింటియందునుగల సారస్యమును మన మవగతముచేసి కొన్నచో, ఏ కవిత్వముకాని మన యెదుటబెట్టఁ బడినప్పుడు దానియందెంత కవితాశక్తియుండునది, లేదా కవితాగుణమే విషయమునఁ గొఱవడియుండునది సులభముగా నిర్ణయింప వచ్చును. మఱియునీలక్ష్యములను జక్కగా నవగాహనముచేసి కొన్నచోఁ గవితా రసాస్వాదనశక్తియు, శైలీ సౌందర్య గ్రహణశక్తియు, పలుకులపరిమళమును, వీనివెన్నంటి విడ వాడకుండు నిశ్చిత సూక్ష్మతర భావార్థంబుఁ గనుఁగొను సామర్థ్యమును నలవడును.

ఇంకొక దీర్ఘ ప్రకరణమున నాంధ్ర కవిసార్వభౌముఁడగు 'తిక్కనసోమయాజి' కవిత్వమును నిరూపించి యీ విషయంబును నుపసంహరింతుము.

## 12. కవిత్వ నిరూపణము — తిక్కనార్యుని కవిత్వము.

ఆంధ్ర సాహిత్య వాఙ్మయమున ఆంధ్ర మహాభారత మద్వితీయమైన కావ్యము. ఇది 'బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునకు' మూలాధారమై, కవితా వైభవమునఁ దనరి, యత్యున్నత స్థానమును వహించి, ఆంధ్రుల మనోరాజ్యమును నేకాధిపత్యముగ నేలుచున్నది. అందు విరాటపర్వ 'మూర్జిత కథోపేతమై, నానారసాభ్యుదయోల్లాసినియై' భారత మహాకావ్యమునకు శిఖరప్రాయమై యున్నది. ఈ కావ్యభాగమందలి సుదేష్ణా, ద్రౌపదీ, కీచకుల ఘట్టమొక విలక్షణమగు క్లిష్టమైన సాంసారికావస్థను బ్రదర్శించి, కేవల బాహ్యేంద్రియ ప్రచోదితంబులగు మనఃప్రవృత్తుల పోకడలఁ జూపి, ఉత్తమ ధర్మములఁ బ్రకాశింపఁజేసి, కాంతవలె నలరించి, హృదయోద్బోధన మొనరించి, నయోపదేశంబు గావించి, చదువరులకు దుశ్శీలతా ప్రక్షాళన మొనర్పఁజాలినదై యున్నది. ఇందు శృంగారరసము కిక్కిరించి యున్నను, జుగుప్సాకరముగ నుండక, యందుబయలు దేఱు వివిధామోద వీచికాపరంపరలు మనోమోహనకరములై యాస్వాదనీయములై యుండును.

తిక్కనకవి సుదేష్ణా, ద్రౌపదీ, కీచకుల పాత్రపోషణ మెట్లు నిర్వహించి వారిని బ్రదర్శించినాఁడో కనుఁగొందము. మొదటఁ గీచకుని మనఃప్రకృతి నెఱింగి, పిదప కవి ద్రౌపదీ సుదేష్ణల మనోవ్యాపారముల నెట్లు దిద్దితీర్చినాఁడో కొంత తిలకింతము.

కీచకుఁడు మత్స్యదేశాధిపతియగు విరాటరాజు మఱందియై; దండనాయకుఁడై యుండుకారణమునఁ దన్నగర మంచాతఁడు మహాప్రబలుఁడై యుండెను. అతఁడు బల గర్వితుఁడు, రూపాభిమాని, దుర్విదగ్ధుఁడు, అహంకార పూర్ణుఁడు, మదనోన్మత్తుఁడు, వివేకవిహీనుఁడు, గర్వోన్మత్త చిత్తుఁడు.

ద్రౌపది సుందరి, ధీరురాలు, సాహసికురాలు, నిపుణురాలు; సూక్ష్మగ్రాహిణి సమీక్ష్యకారిణి, ఉపాయశీల, క్షాత్ర తేజోవిరాజమాన, భర్తృపటుబల గాఢవిశ్వాసశీల, ప్రతీకారకరణోద్వేగ; సమయసముచితముగ మాటలాడునదే కాని మాటలుపడునది కాదు; మాఱాడు నోరుగలది యయ్యుఁ ఖండిత వాదిని; సహృదయ యయ్యును శత్రువులపైఁ బగదీర్చు కోవలయునను నుత్కంఠ గలక్షత్రియాంగన. ఈ రాజస గుణములతో పాటుగ నామెకు సౌశీల్యమును, పతిభక్తియు, దైవభక్తియు మిక్కుటముగా నుండెను.

సుదేష్ణ యుచితజ్ఞత లేనిది, కుత్సిహృదయ, అసత్యవాదిని, నీచకార్యములకుఁ గడంగు కలుషాత్మ.

తనయక్కయగు సుదేష్ణకు మ్రొక్కఁ జనుకీచకుండు, అద్దేవికనతి దూరంబున నున్న ద్రౌపదింగనుంగొని, యా

సుందరిపై మోహైక దృష్టులఁ బఱచుచుండెను. తిక్కనా ర్యుఁడీ పట్టున కీచకుని సంభ్రమంబును, అతనికి రాఁగలపాటును నలంకార యుక్తముగ నుడివి, అతనిపైఁగల తన రోసమును గుప్తముగఁ గథతోఁ బొత్తుకలిపి, వాచ్యముగా నీతినిజెప్పక, వ్యంగ్యవైభవమున బోధించుచున్నాఁడు.

తే॥ "ద్రౌపదీ రూపమను నురిఁదగిలి తనదు
హృదయ మనుమృగ మత్తఱి నుదిలగొనుచుఁ
గాముఁడను బల్లిదపు వేఁట కానిఁ బాఱిఁ
బడుట కెంతయు నాసింహ బలుఁడు దలరి".

కీచకుఁడు 'రూపాభిమాని' యనిచెప్పి, కవి యాతని వదనమున దుృపద తనయ యొక్క రూపాతిశయమును నుగ్గడించుపద్యములను నాల్గింటిని ఔచిత్యముమీఱకుండ నుంచియు న్నాఁడు. 'మాసిన చందముఁ దమగని రోసిన డెందంబుఁగల తరుణి నెలుఁగంజాలని' కామాంధుని నోటనెంతయు వెడలఁ దగియున్న వా పద్యములు. దీని తల్లిదండ్రులెవరో, దీని పేరేమొ, దీని మగండెవండో, దీని గృహమెట్టిదో యని తలపోయు మదనోన్మాదుఁడగు కీచకునినోట—

సీ॥ "దీని జన్మంబునఁ దేజంబు నొందిన
యింతియుఁ బతియు నెవ్వరొకొ!
దీని నామాకృతిగా నోఁచి పడసిన
యింపగు వర్ణంబు లెవ్వియొకొ!
దీని వల్లభుండనగా నిలనొబగు నొం
పెసఁగ వర్ధిల్లు వాఁడెవ్వఁడొకొ!

దీని వసించుటఁ దానొప్పి పెంపున
నేపాఱు మందిరం బెద్ది యొక్కో!

యని యల్పార్థ రచనను ననల్పాక్షరములతోఁ గవి నుడిపించి, కీచకునికి ద్రౌపదీ రూపాతిశయముచేఁ గలిగిన మోహమును వెల్లడించుచున్నాఁడు. భావమును సులభముగాఁ గొలఁది మాటలతోడనె స్ఫురింపఁజేయుట కిట్టిసందర్భములు పనికిరావు. 'దీని పేరేమొ' యని యూహించుటకు మాఱుగ 'దీని నామాకృతిగా నోఁచి పడసిన వర్ణంబు లెవ్వి యొక్కో' యని యెక్కువ మాటలతోఁ జుట్టుమార్గమునఁ బల్కుచుఁ దల పోయుటలో నొక గౌరవభావమును, నొక గభీరార్థమును, నొక సొంపును నున్నవి. మఱియు హృదయమున నుదయిం చిన తద్విషయమైన భావోద్వేగము కడచనుటకుఁ బట్టునంత కాలమున కనుగుణమైన దీర్ఘోచ్చారణముండుట యవశ్యము గదా. ఇట్లుండుట హృద్యంబయి యుండుటవలన శబ్దాడం బరమని యనిపించుకొనదు. కొన్ని సందర్భములందు చుట్టు మాటలతో భావమును వెల్లడిచేయుట రసోద్దీపకమై యుండును. 'ఒక్కో' యని పలుమాఱు పల్కుటలోఁ దన సందేహము నివర్తి చేసికోనవలయునను తహతహ గోచరిం చును. 'దీని వల్లభుండనఁగా....వర్తిల్లువాఁ డెవ్వఁడొక్కో'- ఇక్కడ 'వల్లభుండనఁగా' ననుటలో నెంతో గభీరార్థ మున్నది: 'దీనికిఁ బ్రియులుండవచ్చును, మగండని పేరు గాంచి, తాళిఁగట్టినవాఁ డెవ్వఁడో' యను ధ్వని స్ఫురించు చున్నది. సంక్షిప్తశైలి – తక్కువ మాటలతో నెక్కువ

యర్థమును బ్రతిపాదించుట – శాస్త్రసూత్రముల నిర్మించుట కుపయోగపడుచున్నను, కావ్యరచనయందుమ నెంతో యవశ్యమైయున్నను. కొన్ని పట్టుల భావమును వెల్లడించుటకు చుట్టుమాట లవశ్యములై యుండుననుట నిజంబు.

మనోజ వికారమగ్నుఁడైన కీచకుని చేష్టాదులను కవి యెంత మనోజ్ఞముగ వ్యక్తపఱచినాఁడో యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

చ॥ "అనియని యుగ్గడించు, ధృతి
 యల్లలనాడినఁ దల్లడించుఁ; బై
 కొను తలపోఁతనించుఁ, మదిఁ
 గోర్కులు పేర్చిన నప్పళించు, నె
 ట్టన తెగ నగ్గలించు, నచ
 టఁ జనులం బరికించు, బుద్ధి మా
 లిన వెస నెంతయుం గళవళించు ......

ద్రౌపదికి భయాదులవలనఁ గంపనాదు లొదవఁగా, వాని నా వివేక విహీనుఁడు కీచకుండు మదనవికారంబుగాఁ దలచి "రాగ సాగరపూర నిర్మగ్నుండయి ద్రౌపది కాంతిసౌందర్యములను దన కనుఁగవతో జుఱ్ఱుచుండి, తుదకు వాఁడు 'అనంగు పట్టియాడెడు జంత్రంబుపగిది నుండె."

పిదపఁ దన యక్కయగు సుధేష్ణయొ 'తోడుకొనఁగ నీడగు చుట్టంబు' గఁ దలంచి, కీచకుఁ డామె కడకేగి, ద్రౌపదిని గుఱించి కొన్ని ప్రశ్నలు వేసెను. ఈ ప్రశ్నలాతఁగాఁడు విషయములను దెలిసికొనఁగోరి వేసినట్టి ప్రశ్నలై

కావున, అభ్యూహా చేయునప్పు డనుకొన్న రీతిగా"....దీని
నామాకృతిగా నొచిపడసిన యింపగు వర్ణంబు లెవ్వియొక్కొ"
యని పలుకక "...పేరెయ్యది..." యని నేరుగా నడిగెను.
తమ్ముఁ 'డనంగ శరదళిత హృదయుఁ డయ్యెనని కొంత
దుఃఖించి సుదేష్ణ వాని 'మాటలు గీటునంబుచ్చి', యొండు
పలుకులు జరిపెను. అంత వాఁడు 'ద్రౌపది యున్నకడకుం
జని యా సమీపంబున నట్టాడుచు, నమ్మానవతి సౌందర్య
మును దన కనుఁగవతో జుఱ్ఱుచు, అయ్యరవిందగంధి మెయి
సోఁకి వచ్చెడి గాలిని నాఘ్రాణించుచు మరల నామెను
బొగడసాగెను. నిర్వికారయగు నయ్యంగనయొక్క యింగి
తం మూహింప వెరవుమాలి, యింతవఱకుఁ జక్షురింద్రియము
తోడను, ఘ్రాణేంద్రియము తోడను దృప్తిపొంది యుండిన
కీచకుండు, ఇప్పుడు తన శ్రవణేంద్రియమును సంతృప్తి
పఱచుకొఱకై, 'యమ్ముగ్ధ పలుకులు' విన నురియాట
పడెను; మఱీ స్పర్శసుఖము నొందుటకై యామె కేలు
తన కేలఁ గీలుకొలుపఁ దలంచెను. పంచేంద్రియములలో
నాలుగింద్రియముల సుఖమబ్బిన తరువాత నైదవదియగు
జిహ్వేంద్రియ సుఖమునకై యుత్తలపడసాగెను.

కథనునడిపించుటలోఁ గవిబ్రహ్మ బహుజాగరూకుఁడై
మెలఁగువాఁడు; ఉపాయశీలయగు ద్రౌపదితో నిట్లు పలికించు
చున్నాఁడు—

క॥ "నాయున్నదాము తలపవ?
యీయొడలీచీర యిట్టిదేవపుఁ జందం

బోయన్న! మదన వికృతిం
జేయు ననుట యెంతయును నిషిద్ధముగాదే?

తే॥ "చనునె యిమ్మాటలాడ సజ్జనులకు గాదుఁ
బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లుఁ గాకయు హీనవంశాభిజాత
నై పతివ్రత నగునన్ను నడుగఁ దగునె?"

ద్రౌపది 'ఓయన్న!' యని కీచకుని సంబోధించి, సుదేష్ణ నీకెట్టులో నేనును నీకట్లే యని తెలియఁజెసినది; సమయోచితముగను, అర్థవంతముగను దన యసహ్యమును గనఁబఱచినది. రూపాభిమానియు; దురభిమానియు, దుర్వినీతుఁడును, చపలుండును నగు కీచకుం డామెకిట్లు బదులాడుచున్నాఁడు —

తే॥ "నీవు దుర్జాతి గామికి నీవసాక్షి,
పరసతీ సంగమమున వచ్చుపాపమునకు
నోరుతునుకాని సైరింపనోపఁబచ్చ
విలుతు తూపుల తాఁకున కలరుబోడి!"

అంత ద్రౌపది 'మత్పతుల్ గంధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యబెమ్మెయిం గీచకా!" యని నీచముగ హీనంత శబ్దంబులతో గద్దించి, సంబోధించి వానిని జంకించినది. కాని బలగర్వితుండును, నీచుండును నగు కీచకుం డీ జంకెనలకు మెత్తఁబడక తన పరాక్రమమునె యుగ్గడించెను. ఈ యుగ్గడింపు మితవచన రచనతోఁ గూడిన

'గీత' పద్యమైయుండి, బలసమన్వితుఁడును, కార్యశూరుఁ డును (Man of action) నగు దండనాథుని నోట వెడలుట కెంతయుఁ దగియున్నది; అంత ద్రౌపది "యందని మ్రానుల పండ్లుఁ గోయఁదలచుట హితమే? మును చెడిన రావణాదుల విని యెఱుగవె వివేకవిహీనా!" యని నిదర్శనము నిరూపించి, వానిని హీనముగఁ జూచి కసరివేసినది.

అంత వాఁడు తన యక్క కడకు మరలఁ బోయెను: ఆమె వానిని వారింపఁ జూచి, "ఆయురైశ్వర్య కీర్తుల నపహరించఁబడ సతీసంగమము ... కానితెరువునఁ బోయినఁ గలుగు నయఁబ్రిదుకు చవి? యెంతయైన నపథ్యములకు వేడ్క సేయుదురయ్యా వివేకులు...?" అని కొన్ని బుద్ధిమాటలు పలికినది. కాని యామె పలికిన మఱికొన్ని మాటలలో నామె నైజము బయటపడినది.

తే॥ "క్రీడదెసఁ గౌతుకం బురియాడ రతుల
చవులు గొనియాడ నేరని జారసౌందు
హృదయమున కింపు సేయమి యెఱుకఁగలుగు
వారు దీని సుఖంబుగాఁ గోరరెందు."

ఇట్టి వైషయిక లౌల్యముతోఁ గూడిన రతివర్ణనము హితోక్తుల రూపముననున్నను, కాముకుని యెదుటఁ గామినికిని, ఒకవేళ భర్త యెదుట భార్యకును నాడఁజెల్లును గాని, తమ్ముని ముందఱ సోదరికి నాడఁజెల్లునా? ఇట్టి యనుచిత వచనములతోఁ గూడియున్న సోదరి యుపదేశ ములు తమ్ముని మదనోన్మాదంబును నపచయింప లేకపోవు టయె కాక, యక్కను దార్ష్ట్యఁగత్తెగ నుపయోగింప వానికి

మఱింత ధైర్యమును నొసంగెను, తిక్కనకవి యిట్టి పలుకు లను గావలయునని యె సుదేష్ణనోట వెడలించినాఁడు.

అంత సింహబలుండు - కీచకుండు -

ఉ॥ "బుద్ధులు సెప్పుచెల్లి నటు
పోవిడు. మెమ్మెయినైన సౌఖ్య సం
సిద్ధి యెనర్చునాకు, నెడ
సేసినఁ దాపము రూపుమాపు, నా
వృద్ధియ కోరుదేని నవి
వేకివి నీవని నన్నునిట్లు సం
బద్ధములైన వాక్యములు
వల్కఁకవే పిలిపింపు కోమలిఁ."

అనుచు దీనాననుఁడై యక్క కాళ్ళను బట్టికొనెను. ఆమె చిన్నపోయి, 'వీనికెమ్మెయిం జావునిజంబు మన్మథుని శాత శరంబుల' నని మనసులో నిశ్చయించుకొని, 'దందడి దొరఁగం జనుదెంచు నశ్రుపూరము గనుఁగవతో మిగ్రింగి కొనుచు'

ఆ॥ "ఇంత తలర నేల? యెమ్మెయినైన నను
గొమ్మనవి వరించి కూర్పుటరుదె?
యుమ్మలంబు దక్కి యూఱటతోడ నీ
వేగు నుసల వలవడింక నిచట."

క॥ "ఆసవమున కని నీదు ని
వాసమునకు దివము లోనపళ్యంబును నే

వా సదతిం బుత్తేంతు ని
జాసక్తి ఫలింపఁ గొఱలు మభిరతి కేళిన్."

అని పల్కినది. ఈమె యెంత సాత్త్వికదార్ఢ్యములేని భీరురాలు! తన సమతుమునసే వాఁడకృత్యమునకుఁ గడంగు యని భయపడి, ద్రౌపదిని దన కడకుఁ బంపు నుపాయమును గూడఁ జెప్పి, తమ్మునికోర్కి ఫలింపఁజేయ నుద్యమించినది; వలయుననియె కవి సుదేష్ణను గుత్సితహృదయగను, సత్త్వ గుణ రహితగను, భీరురాలుగను సృష్టించియుండునా? ఏమో.

అంత సుదేష్ణ ద్రౌపదిని రావించి, తృష్ణ భావించి,

క॥ "కీచకునియింట నెప్పుడు
వాచవియగు బహువిధముల వారుణిగలుగున్;
వేచని యచటికిఁ గొని ర
మ్మా చూతముగాని నీగమన వేగంబున్."

అని యేమియు నెఱుఁగని యమాయకురాలగు బాలికకుఁ బలెఁ బల్కినది. ద్రౌపది సూక్ష్మగ్రాహిణి యగుటచే సుదేష్ణ కుత్సిత హృదయమును నాకళించి, యామెతోఁ గొంత వాదించినది. ఈ సంభాషణము నాటకీయ ఫక్కిని మనోహ రముగాఁ గవి రచించినాఁడు.

ద్రౌపది తన ధైర్యబలమును, పతులబలమును, దైవ బలమును నమ్మి, నీవనయముఁ గోరునట్టిపని యర్థిమెయిం జని చేయుదానఁగాక" యని సాభిప్రాయముగా ముట్టఁ బలికి, కడు నిర్వేదపడుచు, దురవస్థంబొందుచు హరి స్మరణా సంసక్తచిత్తయై యుళ్వెడిచెను. దారిలో నామెకుఁ గలిగిన యలమటను కవి కడురమణీయముగా వర్ణించియున్నాఁడు.

అక్కడ నిజసదనంబునకుం జనిన కీచకుండు మోహాంధుఁడై, 'అనంగ విభ్రమంబుల కనురూపంబులైన బహువిధ ప్రలాపంబులం బ్రొద్దుగడుపుచు నమ్మదిరాక్షి రాక కెదురు చూచుచుండె.' కవి తిక్కన వర్ణించిన యీ ప్రలాపంబులు కీచకుని మనోవృత్తి కనుగుణంబులై, రసవిజృంభితంబులై యున్నవి.

ద్రౌపది కీచకుఁడున్న ప్రదేశంబునకుఁ జని, "దేవి తృషపుట్టి వారుణి దేరఁబనుప నరుగుదెంచితిఁ బోయింపుఁ" డని మర్యాదతో మితభాషా రచనమునఁ బలికినది; ఇచట 'అన్నా' అని కాని, 'అయ్యా' యని కాని కీచకుని సంబోధింపలేదు. అట్లు మరల మరల సంబోధించుటవలనఁ బ్రయోజనంబు లేదని యామె యెఱుంగును. ఇంతకుఁ గొంత మునుపే 'కీచకా, వివేకవిహీనా' యని నీచముగను, జంకెనలతోడను సంబోధించిన యయ్యింతి మరల 'అన్నా' యని గౌరవముగాఁ బిలుచుట, తాను మెత్తఁబడినట్లు తలఁపఁబడు నని యెంచి యా ధీరురాలట్టి సంబోధనము లేవియుఁ జేయకన్నది; మఱియు 'పోయింపుఁ' డనుటలో నర్థస్వారస్యమున్నది.

అప్పుడు మదనోన్మత్తుఁడగు కీచకుండాడిన మాటలివి-

క॥ "దేవి తృషదీర్పఁ బూనితి
వా వెలఁది సహోదరుండనగు వాతృష లీ
లావతి! నీదు సరస సం
భావనమె యిఁ దీర్పకునికి పాడియె చెప్పుమా!

గలవు. కవి యెంత యర్థోక్తిగా నీ పద ప్రయోగ మొనరించి వాఁడో గమనింపుఁడు.

తే॥ "చెలువ యప్పలుకులు పెడచెవులఁ బెట్టి
ధీరగావున విగత వికార యగుచు,
'మదిర పోయింపుఁ డద్దేవి యెదురుచూచు,
నలుగుఁ దడసైన, మగుడఁ బోవలయు' ననిన

కీచకుఁడు

చ॥ "మదిర సుదేష్ణపాలి కొక
మాత్రిన పుచ్చెద నోడ్ల చేత; నిం
పొదవెడు నట్టి దీని చవి
యుల్లము చొక్కఁగ నానుమీవు; నీ
వదన సరోజ సౌరభ మ
వారణ నన్నును గ్రోలనిమ్ము; బె
ట్టిద మగు కాము తూపులఁ దో
డిం బడకుండఁగఁ గావు మిత్తటీ."

అని పలికి తన మనోభీష్టమును దేటతెల్లముగ వెల్లడించి, మఱియు సామ దానోపాయ ప్రాగల్భ్య మచ్చుపడ వక్కాణించెను. అది విని ద్రౌపది పతుల బలమును, దైవబలమును నమ్మినదిఁ గావున మౌనమును భజించెను. మోహాంధుఁడగు కీచకుండు మౌనమర్ధాంగీకారముగా భావించి, యా సాధ్వి పైఁబడి పట్టుకొనెను. ఆమె వానిని విదిల్చివైచి రభసంబున నా మందిరంబును విడిచి చని, రాజసభకుం బోయెను. వెన్నంటిన కీచకుం డప్పడఁతిని నొడిచి తలపట్టి యీడ్చి నేలం

గూలఁ దాఁచెను. కాని వెంటనే ద్రౌపదియు వాని డొల్ల వ్రేసెను. ఆపత్సమయంబుల సామాన్య జనులకే స్త్రీబలము చేకూరుచుండఁగా భక్తితత్పరయు. పతివ్రతయు, నీతిసముపేతయు, మహోత్తరయునగు ద్రౌపదికి రాక్షస మహాబలము చేకుఱుటయందును, నయవిహీనుఁడగు సింహబలునకున్న బలము తఱుగుటయందును నేమి యాశ్చర్యమున్నది? ఆమె కిట్లు గలిగిన బలాధిక్యమునే కవి సూర్యప్రేషిత రాక్షస సాహాయ్యమని కావ్యధోరణిని సాంకేతికముగా నుడువుచున్నాఁడు.

ఇట్లు క్రిందఁబడిన కీచకుండు తన నీచస్థితి యొకు తెఱుంగకుండ లేచి రోషమూర్తియయి విజృంభింపసాగెను. ఈ దృశ్యమునంతయు విరాటరాజును, సభవారును జూచుచుండిరి. రాజు వానిం గినియలేదు; కినియునంతటి సాత్త్వక ధైర్యమెక్కడిది? అది చూచి యా సభలోనున్న భీమసేనుఁడు రోషఘూర్ణితుఁడై కీచకుని గీటడగింపఁ జూచెను. ఆతని భయంకరమూర్తిని స్ఫురింపఁ జేయుటకై భావమున కనురూపమైన శబ్దజాలమును కవి 183, 184 పద్యములందుఁ బ్రయోగించినాఁడు. కాని యట ధర్మజుఁడు భీముని భయంకర మూర్తిని జూచి, మీఁది కార్యభారమును దలపోసి, యతనిఁ గనుసన్నచేసి వారించెను. ద్రౌపది ఖిన్నురాలగుచు సభచేరువ కరిగినిలిచి, సభాసదులం జూచునట్లుగా నందున్న తన పతులను రూక్షవీక్షణములఁ జూచి. తడవు నిలిచి, వారిని దూఱుచుఁ దన భంగపాటును జెప్పుకొనెను. ధర్మజుండుఁ దమ యసహాయస్థితి తేటపడునట్లు ఈ విధమునఁ బలికెను.

సీ॥ 'జననాయకుండు నీసభవారు నీదగు
తెఱఁగెల్ల నెఱిఁగిరి తెలవ; యింక
మానక యీపలుమాట లాడఁగనేల?
చనుము నీవు సుదేష్ణ సదనమునకు;
నీ పరాభవమునఁ గోపింపనేర రే
గంధర్వులకుఁ దఱిగాదు గాన;
సమయ మెయ్యది యేనిఁ దమకును నీకుఁ గ
ల్గిన యట్టులైనను గినియరిచటఁ;

తే॥ గాన నాథుల దూఱఁగగాదు నిచటఁ
సతికిఁ దానెంత వడియును సభలలోనఁ
దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి
శంకచెడి ధిక్కరింపంగఁ జనునె చెపుమ."

'చెపుమ' యని పలికి యామె సముచితముగా నాలోచనచేయ విడుచుచున్నాఁడు ధర్మజుఁడు. తిక్కనకాక సామాన్య కవియైనచోఁ 'జనునె నీకు' అని ధర్మజుని నోటఁ బలికించి యుండును. ఇమ్మాటకు సత్యాగ్రహచిత్తయగు ద్రౌపది యచ్చోటు విడిచిపోలేదు; ఏమియో వలుక నుంకించుచుండెను. ఇది యెఱింగిన ...ఁడు వెండియు నిట్లనియె-

క॥ "పలుపోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు నూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువ చందము
దొలఁగఁగ నిట్లునికిఁ దగునె?"

ద్రౌపది మాటలు పదునదిగాదు; ఆమె ఖండితవాదిని; కావున నామె:

ఆ॥ 'నాదు వల్లభుండు నట్టుఁడింత నిక్కంబు;
పెద్దవారియట్ల పిన్న వారు;
గానఁ బతులవిధము కాకయే శైలూషిఁ
గా ననంగరాదు కంకభట్టు!

అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబు; మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కడియది?'' యని యభిప్రాయ గర్భితం బుగా నుడివి కోపమున నచ్చోటు విడిచి

''నన్నిటు లా దురాత్ము సదనంబునకుం జనుమన్న జంతకీ। బన్నము లన్నియుం దెలిపి ప్రియ్యుఁడనే?'' యని పోయె నార్తయై। కన్నుల బాష్పపూరములుఁ గ్రమ్మఁగ మోమున దైన్యమొందఁగా। నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుదేష్ణ పాలికిన్.''
అక్కడ సుదేష్ణ సంభ్రమంబు దాల్చి యేమి యెఱుంగని దానివలె నటించి శోకముఁ దెచ్చికొని,

ఆ॥ ''................'' ఎవ్వరెచ్చోట నీ
కేమి కీడొనర్చి రెట్టిపాటి
సాహసికులొ వారిఁ జంపుదు నొంపుదుఁ
భంగపఱుతు నిడుమపఱతుఁ జెఱు తు.'' ననియెను.

సుదేష్ణ పలుకులకు సరియైన ప్రత్యుత్తరమె యిచ్చినది యింగితజ్ఞయగు ద్రౌపది: ''నీ వెఱింగియు నెఱుంగమి

భావించిన నింక నేమని పలుకంగలదాన" నని, ఈ ప్రత్యు త్తరము తీవ్రమై హృదయమును దాఁకునట్టిదై యున్నది. మఱి జరిగిన సంగతి తెలియఁ జెప్పినది. ఇంతకంటె నెంత నిష్ఠురము లాడవలయును? అంతయు విని సుదేష్ణ పసిబిడ్డను నోదార్చురీతిగా

ఉ॥ "ఖేదము దక్కు మీఋణము కీచకు దండితుఁజేసి నీకు నాహ్లాదమొనర్తు" నని వచించెను. ఈ యసత్యవాదిని మాటలను ద్రౌపది నమ్మునా? అందుల కామె "పరాక్రమ వంతులగు నా పతులు గలరు. వారె పగదీర్తురు." అని నుడివెను. అప్పుడు సుదేష్ణ చేయునదిలేక 'నివ్వెఱగంది' యుండెను. అంత ద్రౌపది నిజశయన స్థానంబునకుఁ జనియెను. ఆమె స్థితియు, ఆమె తలఁపులు, ఆమె భంగపాటును జెప్పికొనుటకై మహానస గృహమున సుప్తుండైన భీమునికడకుఁ బోవుటయు, అందు వారిరువురకు జరిగిన సంభాషణంబును నాటకీయరీతిని వెలసి రమణీయముగా నున్నవి.

ద్రౌపది సుదేష్ణవిషయమైన యభిప్రాయములను వెల్లడించునెడ తిక్కనార్యుఁడామె విషయమైన తన యభిప్రాయమునే ప్రకటించినాఁడు. ఆమె 'కలుషాత్మ,' 'పాపాత్మ' యనియె కవి యాశయము.

ద్రౌపది భీముని నెట్లెలయించి కీచకవధంబునకు నొడంబఱచినదో యా కథాభాగమును తిక్కనార్యుఁడు మిక్కిలి రసవంతముగా నడిపినాఁడు. దానినంతయు నిక్కడ వివరింపఁబూనిన గ్రంథ మనవసరముగాఁ బెరుఁగును. కావున

నింకఁ గొన్ని కథాసన్నివేశములను, సందర్భములను మాత్రము ప్రదర్శించి యీ ఘట్టమును ముగింతుము.

ద్రౌపది తన "తోరఁపుగెదు నళురిల మోమతని (భీముని) వతమునఁ జేర్చి" నది. "అక్కట మోసపోయి యడియాసలఁ జావక యున్నదాన .... ... నొక మూర్ఖునిచేఁ బడితిఁ సభా స్థలిఁ" అని పల్కినది. మఱియు

క॥ "గొంతికి నంత వెఱవ, మీ
కంత వెఱవ, దైవమునకు నంత వెఱవ, న
త్యంత కలుషాత్మ విరటుని
కాంతకు నే వెఱతుఁ బనులఁ గావించునెడన్."

అని స్త్రీ సహజమైన గుణములను వెల్లడిచేయుచు వక్కాణించినది. ఇట్లు చెప్పి తన యవస్థను భీముఁడె తాల్చునట్లు చేసినది. ఇందు కవి సామాన్యమైన వాడుక మాటలనే యమ్మానినినోటఁ బలికించి రసముప్పతిల్లఁ జేసినాఁడు.

భీముం డారేయి కీచకవధంబునకు వలయు నుపాయ పరికారం బిట్లు ద్రౌపదితోఁ నుడివెను. "నీవుం గ్రమంబున నొడఁబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేత ప్రదేశంబుగాఁ జెప్పి, యొంటిమెయిం జనుదేర నియమింపుము." ద్రౌపది ధీరయు, నిపుణయు, సాహసికయు, జాతితేజో విరాజమానయు, ప్రతీకారకరణోద్యోగయు, భర్తృపటుబల గాఢవిశ్వాసశీలయు నగుటచేఁ దన నాథుఁడు చెప్పినట్లే చేయసమకట్టెను. అసామాన్య పరిస్థితులుగల విషయంబుల సాధించుట కసామాన్య ప్రతికియలె కరణీయములు గదా.

అంత భానుబింబంబు పూర్వాద్రిపై వెలిఁగె; రూపాభిమానియగు కీచకుఁడు సింగారించుకొని, మదనకంపితుండగుచు, ఉవ్విళ్లూర్చుచు ద్రౌపదిం దిలకింప సుదేష్ణ మందిరంబునకుం జనియె. కవి యితని పోకడను 'ఇంతిఁ జేరఁగాఁ జనియె విధాతృ లుబ్ధక వశంబునఁబోవు మృగంబు చాడ్పునన్' అని చక్కని యుపమానముతోఁ జెప్పుచుఁ గీచకుని చర్యపైఁ దనకుఁగల యేవను దెలుపుచున్నాఁడు.

ద్రౌపది కీచకుం జూచియుఁ జూడనిభంగిఁ దన పని మీఁదనుండె. ఆమె దృష్టిని దన దెసకుఁ ద్రిప్పవలయునని వాఁడెన్నో దుర్విలాసంబులు చేసె: "వెంగలి పలుకుఁ బలుకు; తాళంబుగాఁ గరతలమునఁ బెలుచఁ గంబంబు వేయుచు వెడ పాట పాడు." ఈ క్రియలన్నియు నామెదెస నిష్ప్రయోజనములయ్యె. అంత కీచకుం డామెను సమీపించి, సామ దాన ప్రాగల్భ్య వచనములఁ బల్కెను. తుట్టతుదకు 'ఎందుఁ జొచ్చినను నిన్ను విడువక పట్టెద' నని నుడివెను. ఇమ్మాటల వలన కీచకుఁడు మిక్కిలి తమకమున నుండుటెఱింగి, తన యంత్రించు మాటలకు ముందే కదియంబడినచోఁ గార్యంబు చెడునని వగచి, తా మెత్తఁబడినట్లు నటించి, ద్రౌపది భీముని పలుకుల బలమున సాహసమూని, వానితో. 'రహస్యంబు విడిచి యింత విచ్చలవిడిగాఁ గార్యంబు చేయుటఁ దగునా? నీ కోర్కి నొడఁగూర్తును. నిశీథంబున నాటక మండపునఁ గలయుదము. అక్కడకు నీ వొక్కఁడవే రావలయు. అట్లు లేకున్న నేనక్కడ నిలువను' అని నొడివి వాని నూఱడించి

పంపి, తన మనంబున నెన్నో భావములు ఘూర్ణిల్లుచుండ వాని నణంచికొనుచుఁ దనపనియందుఁ దానుండెను.

తరువాత నామె భీముని కడకుఁ జిఱునవ్వు నవ్వుచుఁ బోయి. "నా కోఱతఁ దీర్చివచ్చితి; నీ కోఱతయె యింక సూతునిం దెగఁజూడఁగా" అని పలికి యతని హెచ్చరించెను. కాని "తీవ్రక్రోధంబు గుప్తసాధనంబునకు బాధకంబగు" నని సంచలితస్వాంతయై" యాతని కిట్లు బోధించెను.

ఉ॥ "బవ్వనివారు నవ్వ మహి
మోదధి ధర్మసుతుండు దీనికిన్
నెవ్వగఁబొంద, భూజనులు
నిందయొనర్పఁగ నేనొనర్చు నీ
చివ్వకు నీవు నల్కమెయిఁ
జేసిన యీపని గూఢవృత్తికిన్
దవ్వగు నేని నియ్యభిమ
తం బొడఁగూడియు నిష్ఫలంబగున్."

కవి ద్రౌపదితో నిట్లు పలికించి యామెను నెంత సమీక్ష్యకారిణిగఁ జిత్రించినాఁడు! నిలువెల్ల రోషానలంబునఁ దపించుచున్నను నామె శాంతిమెయి నాలోచించినది! క్లేశ, దుఃఖముల సంయత మొనర్చి శాంతిని నిలుపుటయందే కదా యానందమొదవుట. అట్టి యానందమును కవి యామెయందుఁ గనఁబఱచినాఁడు!

అక్కడ కీచకుండు మదనప్రేరితుఁడై పరిజనంబుల మొఱఁగి, యేకాంత స్థలంబునకుఁబోయి ద్రౌపదీ సౌందర్య

లావణ్య విభ్రమంబులఁ గూర్చియుఁ. ఆమె చేష్టావచన రచనంబులం గూర్చియుఁ దలపోయుచుండెను' కవి తిక్కన కీచకుని 'మదనవేదనాదూయమానసమును, వాని వితర్కములను, నెనిమిది పద్యములలోఁ గడురమణీయముగఁ జెప్పువాఁడు. ఇందెక్కడఁగాని యసభ్య శృంగారమునకు దిగి చదువరి యింద్రియంబులను సౌమ్మసిలఁ జేయలేదు. కీచకుఁడు "తలదు నలందురున్ నవయుఁ దాపభరంబున వెచ్చనూర్చు...." మఱియు నిట్లు వితర్కించు :—

తే॥ "తెఱవ చిడిముడిపాటు సుదేష్ణ యెఱిఁగి
వేడ్కఁ బనిపంచు టుడిగి రావిడుచు నొక్కొ!
మదనుఁడింతికి నొజ్జయై మతకములను
వదను నెఱిఁగించి నాకడ కనుచు నొక్కొ!

క॥ "అట్టేల రాక తక్కుం
గట్టిఁడియే యాలతాంగి? గామాతురు నన్
బెట్టి యుచటు దానికి మన
సెట్టు నిలుచుఁ? దగవువిడువ నెట్టులు నేర్చున్"

కామోన్మాదము కీచకుని తలకెక్కినది, వాఁడు దన బాహ్యేంద్రియంబుల నెల్లను గాయికసుఖమునకై 'శుశ్రూష చేయ విడిచినాఁడు. వాని భావంబున ద్రౌపది

సీ॥ "పొడసూపి నట్లైన వడిఁబట్టు సమకట్టి
పరికించి కానక బమ్మరించు;
మొలఁగిన యట్లైనఁ బలికింపఁ దలఁచి ని
రూపించి లేమి నళుల్రెలు వహించు;

కదిసిన యట్లైనఁ గౌఁగిలింపఁ గడంగి
యారసి బొంకైన నలఁతనొందు;
బడఁబడ్డ యట్లైన నడరి పైకొనఁజూచి
చెన్నటి యగుట నిశ్చేష్టఁబోరయు.

గీ॥ లలిత వివిధ విహారంబులకు లతాంగి
యలసి సొలసిన యట్లైన నెలమిఁ గలసి
యభిమత క్రీడ సలుపంగ నభ్యసించి
వెదకి రిత్తబయల్ గని విహ్వలించు."

తిక్కనార్యుఁడు భావజ వికారంబుల కగపడిన యున్మత్తుని భావమును నెంత సొంపుఁగా వివరించినాఁడు! మానవ మానసిక వ్యాపార వర్ణనాచాతుర్యమునం దీ కవి యద్వితీయుఁడు; స్వరూప వర్ణనము చేసి విషయములను యథాతథముఁగా జిత్రించుటయందు దక్షుఁడు. ఈ వర్ణనము పటముమీఁదఁ గుంచెతోఁ జిత్రింపఁబడినట్లుండి యందలి బింబములు పైకిలేచి వచ్చి కన్నుల యెదుట నిలిచినట్లున్నవి!

తరువాతఁ బొద్దు గ్రుంకుట కెంతో మునుకడనె కీచకుఁడు మందిరారామ భూమికిం జనియె. అందలి యాతని చపలతా చేష్టలను కవి యిట్లు వర్ణించుచున్నాఁడు:

చ॥ "కమలవనంబు సొంత నును
గాడ్పొక యించుక యాదరించుఁ, జి
త్తమునకుఁ దాఁకఁ దల్లడము
దక్కుటయుం జని గారవంపుఁ జూ–

తము కడనిల్పు; నిల్పి యది
తాపముఁ బెంచిన లేఁత తీవ జొం
పముఁ జొఱఁబాఱు; నందలఁత
పైకొనినఁ బెడలుఁ బెనుంబడుఁగ."

కీచకుం "డొక్కయెడ నైనను గాలూఁదక లీలో
ద్యానంబు గలయం గ్రుమ్మరుచు,

సీ॥ "ఇంపైన ప్రియకాన నిచ్చి నిల్చిన మధు
వాదటనాను మత్తాలి విభునిఁ,
చెట్టుపల్ పచరించి చుట్టుఁగ్రుమ్మరి మనో
రమ నియ్యఁగొలుపు మరాళవిభుని,
ఫలరస మొండొంటి కెలమిఁ జంచుల నిచ్చు
మెయిన బొక్కెడు శుక మిథునములను,
గమిఁజూసి తలిరు జొంపమునకు మెయిమెయిఁ
దాఁకంగఁ జను, పిక దంపతులను,"

జూచినాఁడు. ఆ చూడ్కివలన వానికిఁ గోర్కులడరినవి. ఈ రమణీయ దృశ్యములను నెట్టి సమయ సన్నివేశమునఁ గీచకుని దృష్టిపథమున నుంచి[illegible]ను కవి! ఈ దృశ్యము లా మదనోన్మత్తుని హృదయాశయములకును, వాని బాహ్య వ్యాపారములకును నెంత యనురూపముగ నున్నవి! వాని నోట వెడలు మాట లెంత సామరస్యము గలిగి వాని హావ భావావిష్కరణముతోఁ బొత్తుఁ గలియుచున్నవి! తిక్కన కవి ప్రకృతికిని, మానవునికిని, కావ్యమునకును గల యన్యోన్య సంబంధమును నెంత చక్కగా నెఱింగిన వాఁడు!

మఱియు నిందలి రాజసిక శృంగారవిలాసము చదువరి హృదయమును రంజిల్లఁజేయునే కాని, దాని నుద్దేశించి, వాని పౌశీల్యమున కెట్టి న్యూనతను నాపాదింపదు.

కొన్ని తరుణములందుఁ గాలము త్వరితగతిని బోవునట్లును, మఱికొన్ని తరుణములందది యతిదీర్ఘమైసాఁగి నిలచునట్లును దోఁచుట సహజము. ఇత్తఱి కీచకుఁడు భావరతంబుల, శిశిరోపచారంబునఁ గడపినకాల మతిదీర్ఘముగాఁ గనఁబడసాగఁగా వాఁడు

క॥ "మాయరవి యేలకుంకఁడో
కోయను, నిశ్చైల తడసెనోయను, గ్రుంకం
బోయెడుఁ జూయిస్పుడ యను
దాయపఱచెనను మనోజతాపము పేర్మిన్

ఆ॥ "దివముకాని యింక భువనంబు నందిట
నట్టిరాత్రిలేని యట్టుగాఁగఁ
జేసెనొక్కొ విధి విశేషించి నాక కా
నేఁడదివము సాఁచి నిలిచెనొక్కొ!"

తే॥ "అనుచుఁ గ్రుంకింపరాని పొద్దరసి యరసి,
శిశిర పర్యంకమున మేను సేర్చి చేర్చి
వంతఁ దలపోసి తలపోసి, వనరి వనరి,
మిగుల వందురి వందురి, పొగిలి పొగిలి."

ఈ పద్యమందలి 'పొద్దరసి యరసి' మొదలైన యామ్రేడితములను బ్రయోగించి కాలము దీర్ఘముగాఁ దోఁచుటవలనఁ గలిగెడి తమకంబును కవి తన పనితనముఁ జూపి తెలియఁజేయుచున్నాడు.

అంతఁ బ్రొద్దు గ్రుంకెను. కీచకుండు

కం॥ 'కై సేసి మదన వికారో
ల్లాసంబున మేనుపొంగ లఘుగతి నుత్కం
ఠాసవపాన విధాన
వ్యాసంగ తరంగితాంతరంగుం డగుచున్.

శా॥ "సింగంబున్న గుహానికేతమునకున్
శీఘ్రంబున న్వచ్చు మా
తంగంబుం బురడించుచు ........నా
రంగాగారము చేరవచ్చెను."

ఈ వాక్యము వలన నంతనుమున్నే ద్రౌపది భీమసేను లా నాట్యమందిరముఁ బ్రవేశించియుండిరని తేటపడుచున్నది. ఈ నాట్యమందిరమునఁ గుడ్యమిది, స్తంభమిది యని యేర్ప ఱుపరాని చిమ్మచీఁకటులుఁ గ్రిమ్మియుండెను. భీముఁడు తన సతిని నుత్తర యొక్క లీలాపల్యాంకంబు సమీపంబున నోసరిల ననిచి, తానా తల్పంబున నుండెను. కీచకుఁడు భీమసేనుని ద్రౌపదిగాఁ దలఁచి దుర్విలాసంబుఁ సేయుచుఁ దన రూప లావణ్య విలాస వివేకంబులఁ గొనియాడ మొదలుపెట్టెను. ఆ మాటలు విని భీముండుచిత నిగూఢభాషణములు పలికెను; కాని వానియందలి గూఢార్థ మాకామాయత్త చిత్తునకు గోచరము కాలేదు. కావున వా డా మాటలకు సంతసించు చుండును. ఇక్కడ కవి యసాత్త్విక హాస్యరసంబును జిలికినాఁడు. ఇట్లుండ భీముఁడు వానిం దలపట్టి వంచి ముష్టి ప్రహారంబుఁ గొట్టి వాని మస్తకమును దీర్ఘ భుజశాఖలును, పాదయుగళంబును మేనిలోనికిఁ జొర మగ్గుగాఁ దుటిమి,

నించిన గ్రంథలతి త్రిమైన కీచకుని ధరణీస్థలికిఁ జదిపి, చక్కని ముద్దగఁజేసి, వికృతపుఁ జావు చంపి, తద్వృత్తాంతంబు ద్రౌపదికిఁ జెప్పి, తాను

చ॥ "అనలము గూఢ యత్నమున
　　నయ్యోడకుం గొనితెచ్చి, దానిఁజ
య్యాన వెలుఁగొందఁ జేయుటయు
　　నచ్చెరువుఁ భయముఁ బ్రియంబునుఁ
బెనఁగొనఁగాఁ గనుంగొనియె
　　భీతమృగేక్షణ భీముఁడాయెఁగాఁ
జని కడు నక్కజంబయిన
　　చందమునం బడియున్న పీనుఁగుఁ."

పిదప

"ఆచపలాక్షి ముక్కుపయి
　　నంగుళముం గదియించి, "దీనికై
కీచక యింత చేసితి, సు
　　ఖత్వముఁ బొందుదుగాక యింక న
న్నేచిన నిట్లుగా కుడుగు
　　నే యనుచుఁ వెఱఁగందు చుండగఁ"

ఆమెకుఁ గలిగిన భయము ఆశ్చర్య సంతోషముల నడుమ నిఱికికొన్నదై లేశమాత్రమై యుండెను. పయిపద్యమును ట్టిచూడ నామెకు విస్మయమే యధికముగా నుండునట్లు తెలియుచున్నది. ముక్కుమీఁద నంగుళముం గదియించు టాశ్చర్య సూచకము గదా.

అంత భీముండు తడయక నర్తనాగారమును విడిచి పోయెను. ద్రౌపది నర్తనశాల వెలువడి యందలి కావలి వారిం బిలుచుచు,

క॥ వావతులగు గంధర్వుల
చేపడి మృతిఁబొందెవీఁడె సింహబలుం డీ
పాపాత్ముంజూడుఁడు దుర్
వ్యాపార ఫలంబుగాంచె..." నని పలికెను.

అది విన్న కావలివారు కోలదివ్వెలఁ గొనుచు నర్తనశాలఁ బ్రవేశించిరి. ఆ కలకల మెఱింగిన కీచకుని సోదరులును, బంధుగులును వచ్చిరి. రూపఱియున్న కీచకుని శవముంజూచి శోకించిరి. కీచకుఁడు వధింపఁబడె నను వార్త యూరెల్ల వ్యాపించెను.

"ఉపకీచకులు తమ యన్న కగ్నిసంస్కారము చేయువారలై తమ పనులఁ జేయుచుండిరి. ద్రౌపది వారి చందమును జూడవలయునని వచ్చి యించుక దూరమున నిలుచుండెను." ఈమె యెంత భయరహిత హృదయ! ఎంత సాహసికురాలు! కీచకుని యింటికి వారుణి దేరబోయియు 'అన్నా' యని సంబోధింపకుండుట, రాత్రియనక భీముని వెంటనేకాని నాట్యమందిరమునకుఁ జనుట, ముద్దయైపడి యున్న కీచకుని శవముం గనులారఁ జూచుట, కీచకుని మరణ వృత్తాంతంబు కావలివారికి వెల్లడిచేయుట — ఇవన్నియు సాహసమం దీకార్యమునకుఁ గ్రిందయినవె. ఏల యీమె యిట్టి మహాపాయప్రదమగు సాహసమునకుఁ గడంగినది? కొందఱి కపాయాపాదకములగు సాహసకృత్యములు చేయుటం వాని

యందు జయముగాంచుట — వీనివలనఁ గలుగు నాహ్లాదము మఱిదేనివలనను గలుగుటలేదు. తిక్కన మహాకవి యీమెను నిట్టివారిలో నొకతెగాఁ బరిగణించి, యామె స్వభావశీలమును జక్కగా వర్ణించుటకీ ఘట్టమును నాశ్రయముగాఁ గొన్నవాఁడు. మఱియు ద్రౌపది యగ్నికుండమునఁ బుట్టినదగుటచే, (ఇక్కడ నగ్నికుండము దృఢసంకల్ప శక్తికి సంకేతము.) ఆమె యప్రతిహతమ్మగు నహం మతిగలది. (self-will) యని కవి యెఱింగి యీమెను స్వచ్ఛందమగు చేతనాశక్తియు, ధైర్యసాహసములుఁ గలదానిఁగాఁ జేసినాఁడు.

కవితిక్కన కాళిదాసునివలె, షేక్స్పియర్ వాంటిలవలెఁ బ్రపంచమందలి యుత్తమ కవితర్కములోఁ జేర్పఁబడుట కర్హుఁడగుట కెట్టి సంశయమునులేదు. కవితావైభవమునందును, ఇంద్రియావేగముల నభివర్ణించుటయందును, శృంగారాది నానారస నిర్వహణమందును, భావావిష్కరణమందును, రచనా చాతురియందును, చింతితార్థ సాధనమందును, వాఙ్నాడంబరమందును, సమయోచిత శబ్దసమాస ప్రయోగమందును, ఔచిత్యనిర్వహణమునందును, నాటకీయ యథార్థరూపకల్పనమునందును (dramatic vividness)నితఁడమృతహస్తుఁడు. ఇతని రచనలయందు దృఢతర నిగ్రహశక్తి గోచరించును. ఇతఁడు కథావస్తువుపైఁ దన నిశితమైన యాంతర దృష్టినిసారించి తన యున్నత ప్రతిభవలన దాని యంతః స్వరూపమును గ్రహించి, దానినత్యుత్తమముగాఁ జేయుటకై చాలినంత శ్రద్ధ వహించుచుండును. ఈ ద్రౌపదీ సుదేష్ణా

కీచకుల ఘట్టమును నొకచక్కని యచ్చునఁబోసి, రుచిర వివరణములతోఁ బ్రకాశింపఁ జేసినాఁడు.

ఇతని శైలియందు నుదాత్తత, గభీరత, యర్థపుష్టి; శబ్దపుష్టి, శిల్పకౌశలము, స్వచ్ఛందత, జిగిబిగి గోచరించి నను, మను వసుచరిత్రములందువలె మధుర మనోజ్ఞ కోమల శబ్దములుగలిగి యంత చికిలిచేయఁబడినదై, శ్రవణపేయమై, వఱలుటలేదు. ఇతఁడు శ్రీనాథాదులవలె వాచ్యకవిగాఁక భావకవియై భాసిల్లువాఁడు. ఈ భావకవి తేజంబు ముందఱ నితరాంధ్ర కవులందఱు వెన్క కొత్తగిలి యుండవలసినవారే. ఇతని జాను తెనుఁగు నుడికారముల యందభిమాన మధిక ముగా నుండుటవలన, దేశి తెలుఁగు పలుకులనే విరివిగాఁ బ్రయోగించినాఁడు. ఇతని పద్యములు, పాదాంతము లందు నిరతిఁ గొనక, ముంగలకు జాల్వాఱుచుండుటవలనఁ దద్రచనఁ గొంత పఠనకాఠిన్యముఁ గలిగియుండియు సొంపు వహించి యుండును.

ఇతని వచనము పటువై, నిశితమై, లలితమై, నాతి కఠినమై, సౌమ్యసుందరమై శోభిల్లుచుఁడును.

# 13. ఉత్తమ కవిత్వ లక్షణములు - వస్తువు - శైలి.

ఉత్తమ కవిత్వ మెట్లుండునది లక్ష్యయుతముగ వెను కటి రెండు ప్రకరణములందు నిరూపింపఁబడినది. ఇప్పు డుత్తమ కవిత్వ లక్షణములను దెలిసికొన యత్నింతము. లక్ష్యానంతరము లక్షణముల నెఱుంగుట సులభము గదా. లక్ష్యలక్షణముల రెంటిని నవగాహనము చేసికొన్నప్పుడు మన కంటఁబడు నే కవిత్వపు యోగ్యతను గాని నిర్ధారణ చేయుటఁ సులభతరమైయుండును. ఈ విషయ విశదీకరణమునకై మఱి కొన్ని లక్ష్యములిం దీయబడును.

కావ్యమున కందలి వస్తువునుబట్టియు, అందలి శైలిని బట్టియు యోగ్యత గలుగుచుండును; అనఁగా : గవిత్వమున కుండవలసిన ముఖ్యలక్షణములు వస్తువు, శైలి.

వస్తువనఁగాఁ గావ్యమందలి విషయము. ఈ వస్తువు పంచేఁద్రియములకు గోచరమగు బాహ్యావస్తువుగనో, పంచేం ద్రియములచే గ్రహింపఁబడి దానిమీఁద మానసిక ప్రభావము చెల్లుబడియైనట్టి వస్తువుగనో, మనస్సు బాహ్యప్రేరణలేక యే స్వయం ప్రేరణవలనఁ దనలోఁ దానే బింబములను గల్పించు కొని, యుత్పత్తిచేసుకొన్న భావముగనో యుండవచ్చును. ఇట్లు కావ్యవస్తువు మూఁడు విధములుగా నుండవచ్చును.

దీనినే వేఱురీతిగాఁ జెప్పినఁ గావ్యములు - (1) కన్నవి కన్నట్లుగాఁ జెప్పునవిగను, (2) అక్షికి గోచరమైన బాహ్య వస్తువును భావాధికారమునకు లోఁబఱచికొని చెప్పునవిగను,

(3) మఱి మనంబు తనలోఁ దానే యాలోచించుకొన్న యమూర్త విషయంబులం గూర్చి చెప్పునవిగను నుండును. ఈ పద్యమును జూడుఁడు:—

క॥ "ఱక్కవలు చెదరఁ గమలము
లొక్కమొగిఁ మొగుడఁ గైరవోత్కరములకున్
మక్కువలఁ దేంట్లు ముసరఁగ
గ్రిక్కున నినుఁ డపరశిఖరికడకుం జనియెన్.
— కేతనకవి దశకుమార చరిత్రము.

ఇక్కడ సూర్యాస్తమయమును కేతనకవి తాను జూచి కనుఁగొన్న దానినిఁ గనుఁగొన్నయట్లె నుడువు చున్నాఁడు. సూర్యాస్తమయము కేవలం బాహ్యావస్తువేకదా. ఈ బాహ్యా వస్తువు కవి తన కంటి కెంత గోచరమైనదో దానిని నుడువు చున్నాఁడు. ఇయ్యెడ కవి తన యభిప్రాయము నేమియుఁ బొందు పఱుపలేదు. ఈ గ్రంథమందలి పదియొకండవ ప్రకరణములోని 3, 4 ఘట్టము (paragraphs) జూడుడు; అవియు నిట్టివె.

కంటికి గోచరమైన బాహ్యావస్తువును కవి తన భావనా బలముచేతఁ బైకి లేవనెత్తి, లోకమునకుఁ బ్రదర్శించుట రెండవ విధము. ఈ విధమునే కవులెక్కువగా ననుసరించు చున్నారు. ఏ సందర్భ సన్నివేశమైనను సరె కవి హృద యము నాకర్షించి, కావ్యత్వమును బొందగలిగిన, నదియొ కావ్యమగును. అదే పదియొకండవ ప్రకరణమందలి మొదవ ఘట్టము మొదలుకొని చివర వఱకును నుండు నుదాహృత పద్యములిందుకు నిదర్శనములు. ఏ బాహ్యావస్తువులందు కవి

యొక్క హృదయాధికారము సమీచీనముగా మిళితమై యుండునో యక్కడ నుత్తమసృష్టి యొదవును.

ఇంక మూఁడవది. ఇందు బాహ్యప్రేరణ యక్కఱ లేక యుండవచ్చును. మనస్సే స్వయంప్రజ్ఞచేఁ దన్ను గుఱించి కాని, ఆత్మ, పరమాత్మ, సత్యము, అహింస, కోపము, శాంతము, ద్వేషము, పుణ్యము, పాపము, నరకము, మరణము, జననము, నిర్వాణము, ఇంద్రియ సుఖములు మున్నగు భావైక గమ్యములగు (abstract) విషయంబుల గుఱించికాని సమాలోచించి, మనోబింబములను గల్పించుకొని వివరించును. రెండవ మూఁడవ రకపుఁ గావ్యవస్తువులలో కవి యొక్క యాత్మానుభవ మావిష్కృతమగుచుండును.

ఈ మూఁడవరకపుఁ గవిత్వమందును తారతమ్య భేదములెన్నో యుండును. ఇంద్రియసుఖములను గురించి తిక్కనార్యుఁడిట్లు నుడువుచున్నాఁడు:-

క. "విషయంబులు నశ్వరములు,
విషసన్నిభములు, సమగ్రవికృతి జనకముల్;
ధిషణాగుణముల నెల్లఁ గ
లుషములుగాఁ జేయు మోహలోభకరములై."

ఈ పద్యమందలి సంగతులు కవి యొక్క స్వయంపరిశీలన వలన నుడువఁబడినవో, లేక యాప్తవచనమును నాధారము చేసికొని చెప్పఁబడినవోయై యుండును. ఇయ్యవి సత్యార్థము లగుట నిజమే. కాని యీ సత్యార్థములనెడి ఫలములను

పొందిలియున్న యాకు జొంపము లాకర్షణీయములు గను, హృదయంగమములు గను లేవు. సత్యమె సుందరము గాన, సత్యార్థావిష్కరణము సుందరమగునని యందురా? యోగి దృష్టిలో నిట్టి యావిష్కరణము సుందరమగును గాని, కళా దృష్టితోఁ జూచువారికది సుందరముగా గోచరింపదు. ఏలన నగ్నసత్యార్థములు బుద్ధికి నచ్చునె కాని హృదయంబునకు నచ్చవు. ఏ విషయములుగాని హృదయంగమముగా నుండి రుచిరాకృతిఁదాల్చి నప్పుడే వానికిఁ గళాత్వము సిద్ధించును. విషయంబులు ఛందోబద్ధము లయినంత మాత్రమున నదదాకృతి. తత్కృతి హృదయంగమమని చెప్పనలవి గాదు. వస్తువిషయంబులను నావిష్కరించు విధానము రసోదంచితమై వెలయునప్పుడే, యవి యనురాగాదులద్వారమున మన స్వభావములోనికిఁ బ్రవేశించి, మనకు మిక్కిలి ప్రయోజన పడుచుండును.

అశ్వమేధపర్వమందలి తృతీయాశ్వాసములో "ఇంద్రియ మనఃపరస్పర సంవాద" మందలి విషయము సంభాషణ రూపమునఁ దనరి హృదయంగమముగా నున్నది. పదియొకండవ ప్రకరణమందలి పంతొమ్మిదవ ఘట్టములులోని కంసునికి వసుదేవుఁడు చేసిన బోధయందలి వస్తువుసయితము మూఁడవ రకమునకుఁ జేరినది. ఇందు బోధన కథతోఁ బొత్తుగలిసి యుండుటచేఁ గడు హృద్యముగా నున్నదనుటకు సందేహము లేదు.

ఆధునిక కవులు ముఖ్యముగా శ్రీ అరవిందులు ఆధ్యాత్మిక కవిత్వమునకు నూతన మార్గమును గల్పించిన

హారయి యున్నారు. ఇమ్మహాకవి రచించిన "Thought The Paraclete", "Rose of God", Transformation", "Nirvana", మున్నగు పద్యమాలిక లాధ్యాత్మిక విషయంబుల మిగుల హృద్యములుగా నావిష్కరించుచున్నవి. ఇతఁడాంగ్లముననే రచించిన 'సావిత్రి' యను మహాకావ్యము 28,000 పద్యపాదములు గల గ్రంథమైయున్నది. ఆధ్యాత్మిక విషయములను గావ్యవస్తువులుగా స్వీకరించి కావ్యములను రచించిన యాంగ్లేయ కవులును, ఐరిష్ కవులును గొందఱున్నారు. శ్రీ అరవిందులు రచించిన " నిర్వాణము " ను నిందు నిదర్శనముగా నుడివెదము.

NIRVANA

"All is abolished but the mute Aolone,
The mind from Thought released,
The heart from grief
Grow inexistent now beyond belief;
There is no I, no Nature,
Known, unknown.
The city, a shadow picture without tone,
Floats, quivers unreal forms without relief
Flow, a cenema's vacant shapes; like a reef
Foundering in shoreless gulfs
the world is done.
Only the illimitable permanent
Is here, A peace stupendous,
featureless, still

Replaces all, - what once was I, in It
A silent unnamed emptiness content
Either to fade in the unknowable
Or thrill with the luminous sees
of the Infinite.

### నిర్వాణము

తే॥ నీరవం 'డొక్కరుఁడు' దప్ప నిరసనంబు
గని యొఁదక్కిన సకలంబు; మనసు తలఁపు
లను ద్యజించి విడుమరం జెలంగె; హృదియు
నుమ్మలిక వీడె; రెండు ననూహ్యమైన
వింత యవ్యక్తగతి సభివృద్ధిఁగాంచె.

లేదహంతయుఁ, బ్రకృతియున్ లేదు, లేవు
వ్యక్తమవ్యక్తమును, మఱియాపురంబు
వికసనము లేక యెటువంటి విరతి లేక
తమినిఁగపించుఁ జలనచిత్రంబువోలె.

దరియెఱుంగని కడలి మధ్యంబునందు
జలము తెరచాఁపదాఁక రాఁగలము మునుఁగు
నట్లు లోకంబె కనుపించ, నవ్యయుం డ
నంతుఁడొక్కఁడే వెలుగొందు చచటనుండు.

నిశ్చలంబయి, స్థిరమయి, నీరవమగు
వింతశాంతియె యన్నిటి న్వెలికిఁద్రోచియ
'నే' నటంచును బరఁగిన 'దాని' యందు
మఱవఁగారాని పట్టిసంతుష్టియుండు.

'నే' ననునది యజ్ఞేయమందేని నడఁగుఁ;
గానిచో నద్ది దేదీప్యమానమైన
యలయనంతత్వ జలరాసులందు సంగ
మంబుఁగని వానితో విజృంభణముఁగాంచు.

మాతృకయందలి శైలీవైదగ్ధ్యము, భావావిష్కరణ రమ్యత యీ యాంధ్రీకరణమందుఁ గొరవడినను, దానియందలి భావవైభవము గొంతగోచరించును.

ఈ మూఁడు విధములైన కావ్యవస్తువులలో నుత్తరోత్తరములె కడుంగడు హృద్యములని ప్రాజ్ఞులు చెప్పుదురు. అందు మూఁడవది యాత్మకు సంబంధించి, యాత్మోత్తేజనముగ నుండుటచేత, నయ్యది యుత్తమమని వారి యభిప్రాయము. ఇట్టి కవిత్వము ఆధ్యాత్మిక సౌందర్యము (spiritual beauty) గలిగి, ఆధ్యాత్మిక కవిత్వమని పేర్కొనఁబడుచున్నది. ఇందు సహితము బాహ్యవస్తుప్రవేశము కొద్దిగా నుండవచ్చును.

ప్రపంచమున వ్యాప్తిఁగాంచియుండు కావ్యములలో అనేకములు రెండవ రకమునకుఁ జేరినవి. బాహ్యవస్తువు లున్నవి యున్నట్లు పంచేంద్రియములకు గోచరించినను, అవి మానవ మనఃప్రపంచమునఁ బ్రవేశించినప్పుడు, తద్విషయమై యంతఃకరణ వ్యాపార మారంభమగును. అప్పుడే యేవిషయము సత్యము? ఏది యసత్యము? ఏది సుందరము? ఏది యసుందరము? ఏది యానందప్రదము? ఏది జుగుప్సాప్రదము? ఏది శివము? ఏది యశివము? మున్నగు విచార

ములు పొడమును. ఇట్టి మనోవిచారములు గలుగుటకుఁ గారణ మా త్రివిధ వస్తువులందు మంచిచెడ్డ లనెడి తరతమ భావము లుండుటయె. ఇంతేకాక యాయా వస్తువులను గనుపించునప్పుడు కవికిఁ దాత్కాలిక మనఃస్థితినిబట్టి మంచివి మంచిగను, చెడ్డవి చెడ్డగనుగాక, మంచివి చెడ్డవిగను, చెడ్డవి మంచివిగను దోఁచుచుండు. కావునఁ కవికృతులలోఁ గొన్ని చదువరిని దుఃఖమునకు గొనిపోవునట్టివై, కొన్ని హృదయమును నలరించునట్టివై, కొన్ని యైహికాముష్మిక సుఖంబుల నిచ్చునట్టివై యుండును. ఉత్తమకవి కావ్యవస్తువులను బరిగ్రహించుటయందు బహుజాగరూకుఁడై యుండి యుత్తమ వస్తువులనే తన యుదార మనోదృష్టిచేఁ గైకొనుచుండును. ఏ వస్తువులు గంభీరములై యుండి జీవిత యాథార్థ్య ప్రదర్శనమునకు యోగ్యములై యుండునో, ఏవస్తువులవలన నాత్మతో నాత్మ పొత్తుగలయుట కుపకరించుచుండునో, ఏ వస్తువులందు కవి బాహ్యజగత్తునకును నాంతరజగత్తునకును సామంజస్యమును గుదిరించి వానిని నిత్యనూత్నములైనవిగను, నిత్యభోగ్యములైనవిగను, నిత్యానందప్రదములైనవిగను జేయునో, ఏవస్తువులందు కవి యలౌకిక భావములపొంతబోక సందర్భానుసారముగ నుదాత్త భావములఁ దారసిల్లఁ జేయునో యవ్యావే యుత్తమములైన వస్తువులు. ఈ యుత్తమత్వముపై నుడివినట్లు వస్తువునందే కాక, ముఖ్యముగా కవిశక్తియందును నుండును. ఉత్తమకవియొక్క యలౌకిక వస్తువునుగొనిఁ (కవికది యలౌకికముగాఁ గాన్పింపదు) దానిని మహోత్కృష్ట కావ్యవస్తువుగాఁ జేయఁజాలియుండగా, కాకవి

యొక యుత్తమ పుణ్యావస్తువును గైకొనియు నికృష్ట కావ్యము నే సృజింపగలుగును.

ఇంక శైలినిగుఱించి విచారింతము. కవి తన భావమును నావిష్కరించుటకు శ్రావ్యస్వరవిన్యాసము ప్రథమావశ్యకము. కేవల వట్టిభావము ఱెక్కలు లేని పక్షివంటిది; అది వాక్కులనెడి ఱెక్కలున్నఁగాని పైకెగరనేరదు. గూఁటిని విడిచి శ్రావ్యగానముసేయుచుఁ బైకెగిరినప్పుడే యది మనకుగోచరమై పూర్ణానందముఁ గలిగించును. కవిత్వము శ్రావ్యముగ నున్నప్పుడె యంతరాత్మ మేలుకొని వస్తువిషయమును గన్నెత్తి చూచును. భగవత్సౌధ మెక్కుటకు గానము సులభసోపానముగదా. ఉత్తమకవిత్వమందలి భావబింబ బృందమును - అనగాఁ గావ్యవస్తువును – అక్షులకుఁ బొడఁగట్టునట్లు చేయవలయునన్న, నిబిడశ్రుతి లయానుబద్ధమగు పోకడ, ఉదాత్తమైన పలుకుఁబడి దానికి హత్తియుండవలయును. కావ్యవస్తువును దలఁపునకు మాత్రము దెచ్చు శబ్దవిన్యాసము అంతశ్రేష్ఠమైనది కాదు. ఋషుల మంత్రములందుఁ బ్రయోగించిన వాక్కులకే వస్తుసాక్షాత్కార సామర్థ్యమున్నదని ప్రాజ్ఞులు చెప్పుదురు. ఏ కవి తన శబ్దప్రయోగ మహిమవలనఁ జదువరిని దన స్వీయాంతశ్చైతన్యమునందు నివసింపఁజేసి వస్తుసాక్షాత్కారము నొందింపఁ జేయునో యాతఁడే ఋషితుల్యుఁడు. అతనికవిత్వమె మంచి శైలిగలిగియున్నదని చెప్పవలయును. నిజముగా ఉక్తివిశేషమే శైలి. కావ్యశైలి యొక్క బాగోగులు గ్రహించుటకును నధికారముండవలె

యును. ఈ యధికారమున్న పాఠకునకె కావ్యపఠనము వలని పూర్ణప్రయోజన మలవడును.

మఱియు భావమనునది జలబిందువువంటిది; శైలియనునది దానిని వహించు పాత్రవంటిది. జలబిందువు శుక్తిపాత్రిలోఁ బడెనా యది మణిత్వముఁ గాంచును; తృణాంకురము వహించెనా యది మణివలెఁ బ్రకాశించును. తప్తలోహము వహించెనా యది నశించును.

భావమునకును భాషకును అవినాభావ సంబంధ మున్నది. మానవుఁడు భాషతోఁ దన తలంపులను (భావములను) వెలుకపఱచుట మాత్రిమె కాక, అతఁడాలోచనలు సల్పుటకును భాష సాధనమైయున్నది. అనఁగా నతఁడు సామాన్యముగా మొదట నాలోచనచేసి పిదపఁ దద్భావమును భాషయందుఁ బొందుపఱుఁపఁడు. మాతృభాషమూలముననె యతఁడు తలఁపులను దలఁచువాఁడు. తలఁపు - భాషయను నీరెంటి సంయోగముననె సంభాషణ ముత్పన్న మగుట. సంకీర్ణభావమును బ్రకటింపవలసి వచ్చినప్పుడు తలఁపె తగిన పదములను వెదకికొనును, లేదా సృష్టించుకొనును.

విషయము భావోద్దీపితమైనప్పుడు సమయోచితము లగు ప్రౌఢశబ్దములను కవి కావ్యమందు పోహాళించును. భావము పేలతమై యుండునేని శబ్దములు నీరసములై యుండును. పదములు భావద్యోతకమున కనురూపములై యుండవలయును. శైలి నీరసమైన పట్టున నుదాత్తమగు కావ్యయాథార్థ్యము (poetic truth) కుదురుపడదు. వేయేల?

కావ్యమందలి భావము ననుసరించి కావ్యశైలి సందర్భోచిత
ముగా శక్తిమంతముగను, మార్దవముగను, భావితార్థద్యోతక
ముగను, సుస్ఫుటముగను, వాచికముగను, హృదయంగమ
ముగను, రజోగుణ పరిచోదకముగను, బుద్ధిపరిచోదకముగను,
ఆత్మప్రబోధకముగను నుండవలయును. ఉత్తమకవికి వాక్కులు
విధేయములై యాయా సందర్భసన్నివేశములకుఁ దగినరీతిఁ
గొంత రసోదంచితముగను, కొంత ప్రోత్సాహకముగను,
కొంత కఠినముగను, కొంత మృదువుగను, కొంత సానునయ
ముగను, కొంత నిందాద్యోతకముగను, కొంత స్తుతియుక్త
ముగను, కొంత విపులముగను కొంత సంకుచితముగను వెలసి
బహుళపరియత్నములేకయె దొరలుచుండును. ఉత్తమ కవి
త్వమందలి వాక్కులు తమ శారీరస్వర విన్యాసముచేతను,
తమ సూచ్యార్థ సూచనచేతను, తమ పరస్పర సాన్నిధ్య
సాంగత్యము వలనఁ గలిగెడి వ్యంగ్యవైభవముచేతను నేరుగాఁ
జదువరి హృదయంబున కొడిగిలి దాని నార్ద్రముచేయు
చుండును.

కావ్యశైలి యనునది వ్యక్తిబహిరంగముగా భాషా
రూపమునఁ దలపోయుటయె యగును. గాన, శైలినిబట్టి తద్ర
చితయొక్క స్వభావమును నిర్ణయింపనగునని ప్రాజ్ఞులందురు.
ఈ వచనమంతెంతయు సత్యమున్నది.

కావ్యములు కొన్ని యుదాత్తములై, యుత్తమత్వముం బడసి మానవ మనోరాజ్యమును నేలఁజాలి, యెన్నిసారులు పఠించినను నిత్యనూత్నములై తీరుచుండును. దీనికాఱు ముఖ్య కారణములున్నవి; వానిని విచారించుదము. *

మొదటిది - ఉత్తమ కావ్యములు సహజముగా విచిత్ర నవ్య కల్పనలు గలిగియుండఁబట్టి యవి మొదటిసారికే చదువరికి మనోగోచరమగుటలేదు; మఱియు దానియందలి రసభావముల యన్యోన్యాశ్రియము త్వరలో బుద్ధి కవగతంబగుటలేదు.

రెండవది - విషయము లనేకములై యుండి యధిక సంకీర్ణత గలిగియుండుటచేతను, అతిశయమయిన పనితనము గలిగియుండుటచేతను, కళాకావ్యములు రుచిరములై యుల్లసిల్లుచుండి, అవి యభివ్యక్తపఱచు విషయంబు లొక్కసారిగాఁ బ్రసన్నమగుటలేదు. హిమవత్పర్వతప్రాంత భూములు, సానుప్రదేశములు ఎన్నిసారులు దర్శించినను నూత్నములై యానందప్రదములై భాసిల్లుచుండును గదా.

మూడవది - మన మనోవృత్తి నిరంతర మొకవిధముగా నుండక మాఱుచుండును. ప్రథమ తరుణమున వస్తువును

---

* ఈ విషయములు 'Bain's Rhetoric' అను గ్రంథము నుండి యనువదింపఁబడినది.

కావ్యమందలి భావము ననుసరించి కావ్యశైలి సందర్భోచిత ముగా శక్తిమంతముగను, మార్దవముగను, భావితార్థద్యోతక ముగను, సుస్ఫుటముగను, వాచికముగను, హృదయంగమ ముగను, రజోగుణ పరిచోదకముగను, బుద్ధిపరిచోదకముగను, ఆత్మప్రబోధకముగను నుండవలయును. ఉత్తమకవికి వాక్కులు విధేయములై యాయా సందర్భసన్నివేశములకుఁ దగినరీతిఁ గొంత రసోదంచితముగను, కొంత ప్రోత్సాహకముగను, కొంత కఠినముగను, కొంత మృదువుగను, కొంత సానునయ ముగను, కొంత నిందాద్యోతకముగను, కొంత స్తుతియుక్త ముగను, కొంత విపులముగను కొంత సంకుచితముగను వెలసి బహుళప్రయత్నములేకయె దొరలుచుండును. ఉత్తమ కవి త్వమందలి వాక్కులు తమ శ్రావ్యస్వర విన్యాసముచేతను, తమ సూచ్యార్థ సూచనచేతను, తమ పరస్పర సాన్నిధ్య సాంగత్యము వలనఁ గలిగెడి వ్యంగ్యవైభవముచేతను నేరుగాఁ జదువరి హృదయంబున కొడిగిలి దాని నార్ద్రముచేయు చుండును.

కావ్యశైలి యనునది వ్యక్తిబహిరంగముగా, భాషా రూపమునఁ దలపోయుటయె యగును. గాన, శైలినిబట్టి శ్రీ చితయొక్క స్వభావంబును నిర్ణయింపనగునని ప్రాజ్ఞులందురు. ఈ వచనమంతెంతయు సత్యమున్నది.

కావ్యములు కొన్ని యుదాత్తములై, యుత్తమత్వముం బడసి మానవ మనోరాజ్యమును నేలఁజాలి, యెన్నిసారులు పఠించినను నిత్యనూత్నములై తీరుచుండును. దీనికాఱు ముఖ్య కారణములున్నవి; వానిని విచారించుదము. *

మొదటిది - ఉత్తమ కావ్యములు సహజముగా విచిత్ర నవ్య కల్పనలు గలిగియుండఁబట్టి యవి మొదటిసారికె చదు వరికి మనోగోచరమగుటలేదు; మఱియు దానియందలి రస భావముల యన్యోన్యాశ్రియము త్వరలో బుద్ధి కవగతంబగుట లేదు.

రెండవది - విషయము అనేకములై యుండి యధిక సంకీర్ణత గలిగియుండుటచేతను, అతిశయమయిన పనితనము గలిగియుండుటచేతను, కళాకావ్యములు రుచిరములై యుల్ల సిల్లుచుండి, అవి యభివ్యక్తపఱచు విషయంబు లొక్కసారిగాఁ బ్రసన్నమగుట లేదు. హిమవత్పర్వతప్రాంత భూములు, సానుప్రదేశములు ఎన్నిసారులు దర్శించినను నూత్నములై యానందప్రదములై భాసిల్లుచుండును గదా.

మూడవది - మన మనోవృత్తి నిరంతర మొకవిధముగా నుండక మాఱుచుండును. ప్రథమ తరుణమున వస్తువును

* ఈ విషయములు 'Bain's Rhetoric' అను గ్రంథము నుండి యనువదింపఁబడినవి.

జూచినప్పుడు మన యనుభూతికి రాని సౌందర్యములు తరువాతఁ బొడగట్టుచుండును. రామాయణ మహాభారతములు, కాళిదాసుని శాకుంతల కుమారసంభవములు నిటువంటి సౌందర్యసంపదల రంజిల్లువలె.

నాల్గవది - మనకంతగా రూఢిలో లేక యపరిచితముగా నుండు విషయవస్తువులు నిత్యనూత్నతను నొసంగుచుండును. ఈ హేతువుచేతనె మన ప్రాచీన కళాకావ్యములు విదేశీయుల యుత్తమసాహిత్య గ్రంథములు నిత్యనవీనములై యుండును.

ఐదవది - ఒక్కసారి యనుభవించినట్టి యానందము మరలఁ దద్వస్తువును నధిగమించునప్పుడు స్మృతికి వచ్చుచుండును. ఈ యానందవిషయమైన స్మృతి సాహచర్యము, పునఃపఠనమందు, దానినవ్యతను గోల్పోవకుండ నుంచుచుండును; మఱియు నీస్మృతిసాహచర్యము మానవునకు వయస్సుగైవ్రాలినప్పుడు గలిగెడి జ్ఞాపకశక్తియొక్క క్షీణతనుగూడఁ దోఁపఁజేయకుండఁ బోషించుచుండును. ఈ స్మృతిసాహచర్యమె యనురక్తి నాఁబరఁగునది.

ఆఱవది - మనుష్యున కేవిషయముమీఁద నభిరుచియెక్కువగా నుండునో దానిమీఁద నాతనికభిమాన మెక్కు

వగా నుండును. కాళిదాసునికి మునులపట్లను, మున్యాశ్రమములపట్లను, మునుల జీవితముపట్లను. శ్రీ వీరేశలింగము గారికి సంఘముపట్లను, సంఘ సంస్కరణముపట్లను నభిమాన మధికము; కావుననే వారిమనంబు లాయావిషయంబులమీఁద నవలీలఁ బాఱి, వానిని వర్ణించు నవకాశ మబ్బినప్పుడంతయు వారి లేఖనులు గడువిజృంభించుచుండెడివి. అసమాన ధర్మములుగల పాఠకులాయా విషయంబులం జదువునప్పుడు తమ యభిమానముం బ్రదర్శించుచుండుటచేత, అవి నవ్య నూత్నములుగా శోభిల్లుచుండును.



జూచినప్పుడు మన యనుభూతికి రాని సౌందర్యములు తరువాతఁ బొడగట్టుచుండును. రామాయణ మహాభారతములు, కాళిదాసుని శాకుంతల కుమారసంభవములు నిటువంటి సౌందర్యసంపదల రంజిల్లువలె.

నాల్గవది - మనకంతగా రూఢిలో లేక యపరిచితముగా నుండు విషయవస్తువులు నిత్యనూత్నతను నొసంగుచుండును. ఈ హేతువుచేతనె మన ప్రాచీన కళాకావ్యములు విదేశీయుల యుత్తమసాహిత్య గ్రంథములు నిత్యనవీనములై యుండును.

ఐదవది - ఒక్కసారి యనుభవించినట్టి యానందము మరలఁ దద్వస్తువును నధిగమించునప్పుడు స్మృతికి వచ్చుచుండును. ఈ యానందవిషయమైన స్మృతి సాహచర్యము, పునః పఠనమందు, దానినవ్యతను గోల్పోవకుండ నుంచుచుండును; మఱియు నీస్మృతిసాహచర్యము మానవునకు వయస్సు గైవ్రాలినప్పుడు గలిగెడి జ్ఞాపకశక్తియొక్క క్షీణతనుగూడఁ దోఁపఁజేయకుండఁ బోషించుచుండును. ఈ స్మృతిసాహచర్యమె యనురక్తినాఁబరఁగునది.

ఆఱవది - మనుష్యున కేవిషయముమీఁద నభిరుచి యెక్కువగా నుండునో దానిమీఁద నాతనికభిమాన మెక్కు

వగా నుండును. కాళిదాసునికి మునులపట్లను, మున్యాశ్రమ ములపట్లను, మునుల జీవితముపట్లను, శ్రీ వీరేశలింగము గారికి సంఘముపట్లను, సంఘ సంస్కరణముపట్లను నభిమాన మధికము; కావుననే వారిమనంబు లాయావిషయంబులమీఁద నవలీలఁబాఱి, వానిని వర్ణించు నవకాశ మబ్బినప్పుడంతయు వారి లేఖనులు గడువిజృంభించుచుండెడివి. అసమాన ధర్మములుగల పాఠకులాయా విషయంబులం జదువునప్పుడు తమ యభిమానముం బ్రదర్శించుచుండుటచేత, అవి నవ్య మూత్నములుగా శోభిల్లుచుండును.

